# మీపిల్లలకు అధిక శక్తినిస్తుంది... అగ్రస్థానం చేకూర్చుతుంది... కోకో-రుచిగల బోర్న్‌విటా!

బోర్న్‌విటాలో ఇప్పుడు అధికంగా కోకో ఉన్నది. దానిని మరింత రుచికరంగా-ఆరోగ్యంగా చేసేందుకు

అంతేకాక బోర్న్‌విటా మాల్ట్, పాలు మరియు పంచదారల పోషకత్వపు గుణాలతో నిండియున్నది.

వేడి కప్పు పాలలో రెండు చెంచాలతో రుచికరమైన పోషకత్వం గల పానీయం తయారవుతుంది. మీ పిల్లలకు ప్రతిరోజూ బోర్న్‌విటా ఇవ్వండి. రోజుకు రెండుసార్లు వారి ఎదిగే శరీరాలకు అమూల్యమైన పోషకత్వం చేకూర్చేందుకు సహాయపడుతుంది. వారికి మీకు గూడా బోర్న్‌విటా అవసరం. వారికి తగ్గటుగా ఉండేందుకు!

క్యాడ్‌బరీస్

## బోర్న్‌విటా

అధిక కోకో గలది: అధిక రుచి, అధిక పోషకత్వం!




**75 పైసలు ఆదా చేయండి**

డబ్బు పొదుపుచేసే 500 గ్రా. రీఫిల్ ప్యాక్‌తో

OBM 8376 B/TL

# ప్రతినెలా వరుమానం లభించును




# ఐఓబి వారి విశేషమైన ఫిక్సుడ్ డిపాజిట్‌లో నిలువచేయండి.

మొత్తంగా డబ్బు వుండి, నెలసరి ఆదాయం కావాలి అనుకునేవారికి ఈ ఐఓబి ఫిక్సడ్ డిపాజిట్ అనువుగా వుంటుంది. బోనస్, నగదు బహుమతులు, జీవితభీమా మొత్తాలు, రిటైరైనాక చేతికి అందే లాభాలూ, ఎదురుచూడని ధన లాభాలూ ఇలా లాభసాటిగా నిల్వ చేయవచ్చును.

ఈ క్రింది పట్టిక మీ నిల్వ మొత్తం నెలనెలా ఎంత సొమ్ము తెచ్చేదీ చూపిస్తుంది.

| నిల్వ మొత్తం. | నెలసరి ఆదాయం. | | |
|---|---|---|---|
| రూ. | 12 - 36 నెలలు | 39 - 60 నెలలు | 63 పైగా నెలలు |
| 5,000 | 24.88 | 31.06 | 37.22 |
| 10,000 | 49.75 | 62.11 | 74.44 |
| 1,00,000 | 497.51 | 621.11 | 744.40 |

ఐఓబి కి రండి. మీకోసం మాదగ్గర చక్కటి పథకాలున్నాయి.



## ఇండియన్ ఓవర్సీస్ బ్యాంక్

మీ ఔన్నత్యాన్ని కోరే ఉత్తమ మిత్రుడు

IOB/41/78.Tel

# వనిత

స్త్రీ జన మాస పత్రిక

సంపుటి: 4 సంచిక: 3

సెప్టెంబర్: 1978

విడి ప్రతి: రెండు రూపాయిలు

సం॥ర చందా: ఇరవై నాలుగు రూపాయిలు

శ్రీలంక: రూ. 2.00 (ఇండియా)

మలేసియా: 90 సెంట్స్

చిరునామా:

చందమామ బిల్డింగ్స్

మద్రాసు-600 026


వని దేశంలోని పెద్ద పెద్ద నగరాలలో చైల్డ్ కేర్ సెంటర్స్ వున్నాయి. అ విధంగానే హైద్రాబాదులో కూడా చిక్కడపల్లి, కోఠి ప్రాంతాలలో ఈ సెంటర్స్ వున్నాయి. భాగ్య నగరంలోని వివిధ వాడలలో వుండే ఉద్యోగినులు సికింద్రాబాదు నుంచి చిక్కడపల్లికి, సైదాబాదు లాంటి చోట్లనుండి కోఠికి వచ్చి తమ పిల్లలను ఉదయం ఆఫీసుకు వెళ్ళేటప్పుడు ఆ గృహాలలో దింపి సాయంత్రం తమతోపాటు యింటికి తీసుకు వెళుతూ వుంటారు. ఈ విధంగా పిల్లలను చూసుకునేందుకు నిర్ణీతమైన రుసుము చెల్లించాల్సి వుంటుంది. అయితే మనం యిళ్ళల్లో ఆయాలను పెట్టుకుంటే వారు సరిగ్గా చూసుకుంటారో లేదో అని సందిగ్ధంలోపడే బదులు ఈ 'చైల్డ్ కేర్ సెంటర్స్'ని నమ్ముకోవడం ఎంతో ఉత్తమం. ఇక్కడ పిల్లలకు బిస్కత్తులు, పాలు వంటివి యివ్వడమే కాక ఆటవస్తువులు కూడా వుంటాయి. విదేశాలలో ముఖ్యంగా అమెరికా, కెనడా వంటి



ఈ పేజీలలోని ప్రతి లేఖకూ చిన్న పారితోషికం— ఐదు రూపాయలు

దేశాలలో తీరికగా వున్న గృహిణులు ఉద్యోగాలు చేస్తున్న వనితల పిల్లలను చూసుకుంటూ వుంటారు. వీరిని ఆ దేశాలలో 'బేబి సిట్టర్స్' అంటారు. ఆ విధంగా ఉద్యోగినులైన తోటి వనితలకోసం పొరుగు వనితలు మన నగరాలలో కూడా తోడ్పడితే ఎంతో బాగుంటుంది. ఇందువల్ల తమ కుటుంబాలకి ఆసరాగా వుండే విధంగా కొంత ఆదాయాన్ని పొందవచ్చును. అల్లాగే మహిళా సమాజాలు కూడా ఇద్దరు ముగ్గురు ఓర్పుగలవారిని ఆయాలుగా నియమించి ఇటువంటి గృహాలు నడపాలి. అటు ఒకరికి ఉపాధి కల్పించినవారూ అవుతారు. ఇటు పసిపిల్లల తల్లుల ఉద్యోగ విధినిర్వహణకి ఆటంకం ఏర్పడకుండా చేసినవారూ అవుతారు.

**ముళ్ళపూడి రాజేశ్వరి ఎమ్. ఎ — సికింద్రాబాదు**

ఇంటికి దేవత ఇల్లాలే అంటారు. కాని ఇంటి దేవత రుమాటిక్ ఆర్థిరిటీస్ లాంటి చికిత్స లేని జబ్బులకు గురి అయితే శారీరకంగానే కాకుండా మానసికంగా కూడా నరకం చూడవలసి వస్తుంది. ఉదయం లేచింది మొదలు రాత్రివరకు గృహిణి నిర్వహించవలసిన బాధ్యతలు ఎన్నో ఉంటాయి. పిల్లలకు తన చేతుల్తో గోరుముద్దలందించాలని, ఆఫీసు నుండి వచ్చిన భర్తకు చిరునవ్వుతో కాఫీ అందించాలని ఏ భార్యకు ఉండదు? కాని తన పనులకోసం వారిపైనే ఆధారపడవలసివస్తే అంతకంటే చిత్రవధ ఇంకొకటి ఉండదు. విల్మా కరోల్ గురించి చదువుతుంటే మనస్సు ద్రవించింది. శత్రువులకు కూడా అట్లాంటి శిక్ష వద్దనిపిస్తుంది. సతికి పతియే ప్రత్యక్షదైవం అనే సూక్తి ఆమె పాలిట నిజమయింది. ఫ్రెడ్ కరోల్ ఆమె పాలిట నిజంగా దైవమే. స్వయం కృషితో తన భార్య సుఖానికే కాకుండా ఎంతోమంది వికలాంగుల పాలిట కల్పతరువై వెలసిన ఫ్రెడ్ కరోల్ అభినందనీయులు.

**దేవులపల్లి శిరీష — వికారాబాదు**

జూలై నెలనుండి హైదరాబాదు, విజయవాడ ఆకాశవాణి కేంద్రాలు స్త్రీల కార్యక్రమాలను




గత సంచికలో ఇచ్చిన 'కార్టూన్ పోటీ'లో నెగ్గిన—పై చిత్రాన్ని పంపినవారు—యస్. రామతులసి, విజయవాడ-4. ప్రకటించిన ప్రకారం ఇస్తామన్న 'చక్కని బహుమతి'ని ఆమెకు పంపివేశాము.

కార్టూన్ గియ్యడానికి ఇచ్చిన సన్నివేశం, సంభాషణం—ఇది:

పెళ్ళిచూపులు జరుగుతున్నాయి. అమ్మాయిని చూసిన తర్వాత, ఆ అబ్బాయి - ''మీ అమ్మాయి నాకు నచ్చింది. పెళ్ళికి ఏర్పాట్లు చేయించండి'' అన్నాడు. ఆ అమ్మాయి తండ్రి అతనికేసి ఓ క్షణం చూసి- 'ప్రపంచంలో అందరికంటే నేనే విషాద వ్యక్తిని-ఇంకెవరూ లేరే అని బాధపడేవాడిని ఇన్నాళ్ళూ, ఇవాళ్టి నుంచి నా కొకడు తోడు దొరుకుతున్నందుకు నేనెంతో సంతోషిస్తున్నాను.'' అన్నాడు.

"గౌరీ మనోహరీ రాగంలోంచి కొన్ని స్వరాలు తీసుకుని వాటికి నేను స్వయంగా రూపొందించిన మరికొన్ని స్వరాలు కలిపి 'ప్రియబాంధవి' రాగాన్ని సృష్టించాను. అయితే నేను సృష్టించిన ఇతర రాగాలను విమర్శించినట్టే ఈ రాగాన్ని కొందరు విమర్శించారు. నేను విమర్శకులను లెక్క చెయ్యను. ప్రేక్షకుల ఆదరణ పొందడమే నా ధ్యేయం" అంటారు ప్రముఖ వీణా విద్వాంసురాలుగా ఖ్యాతి గాంచిన కుమారి గాయత్రి. తన తొమ్మిదవ ఏటనే మొదటి కచ్చేరీ చేసి 'బేబీ గాయత్రి' గానే పలువురి ప్రశంసలు అందుకున్న కుమారి గాయత్రి ముఖచిత్రం: గోష్ఠి—వచ్చే సంచికలో



పరస్పరం రిలే చేసే పద్ధతికి స్వస్తిచెప్పి విడి విడిగా ప్రసారం చేస్తున్నాయి. ఈ మార్పు చాలా హర్షింపదగ్గది. ప్రస్తుతం విజయవాడ కేంద్రం వారంలో నాలుగు రోజులలో అరగంట చొప్పున స్త్రీల కార్యక్రమాలను ప్రసారం చేస్తున్నది. కాని హైదరాబాదు వారంలో రెండు రోజులు అరగంట చొప్పున మరియు పక్షానికోసారి 20 నిమిషాలు (గ్రామీణ స్త్రీలకు) మాత్రమే స్త్రీల కార్యక్రమాలు ప్రసారం చేయడం శోచనీయం. విజయవాడ వలె హైదరాబాదు కూడా వారంలో 4 రోజులు స్త్రీల కార్యక్రమాలను ప్రసారం చేయడం వాంఛనీయం. ఇక ఆది, గురు వారాలలో ఈ రెండు కేంద్రాలు ఒకే వేళలో స్త్రీల కార్యక్రమాలు ప్రసారం చేయడం సమంజసంగా లేదు. అలాకాక వేర్వేరు వేళల్లో ప్రసారం చేస్తే శ్రోతలు రెండు కార్యక్రమాలను విని ఆనందించగలుగుతారు. కడప, విశాఖపట్టణం కేంద్రాలు ఇంకా స్త్రీల కార్యక్రమాలను రిలే చేయడంతోనే సరిపెట్టుకుంటున్నాయి. ఆ కేంద్రాలు కూడా వారంలో కనీసం ఒక రోజైనా స్త్రీలకు స్వయంగా కార్యక్రమాలను ప్రసారం చేయాలి. ఈ విషయాలను ఆకాశవాణి అధికారులు గమనించగలరని ఆశిస్తున్నాను.

ఎస్. రాజకుమారీ శ్రీనివాస్ — కామవరొడ్డి

వనిత ఆగస్ట్ '78 సంచికలో సత్యవాడ సోదరీమణుల పరిచయం చదివి స్తంభించిపోయాను. తాము ఏదీ సాధించలేము, అసమర్థులమని నిందించుకొంటూ, చుట్టూ ఉన్న ప్రజానీకానికి జంకి, నిస్సహాయతతో, బాధపడే బదులు నీతి మార్గాన పయనిస్తూ, మనమూ ఎందుకు ముందుకు రాకూడదని, తమని ప్రశ్నించుకొని ఉత్సాహం, అభిలాష ఉన్న వాటిల్లో, నిర్విరామ కృషి సలుపుతూ, ఉత్సాహానికి తగ్గ ప్రోత్సాహం సమృద్ధిగా లభిస్తే వారే ప్రయోజకులవుతారు. ఒకనాడు తమను అప్రయోజకులుగా చిత్రీకరించిన వారే, వారి యొక్క కళాప్రతిభ చూసి ఆశ్చర్యచకితులవుతారు. సాధన సామగ్రి ఉంటే తయారయ్యే వస్తువు ఏది లేదూ? ఏమైనా రఘునాథమ్మ, సూర్యకుమారిగార్లు అలాంటి మహిళాలోకానికి మార్గదర్శకులు.

కె. జి. సరళకుమారి — కుప్పం

ప్రజలు మాట్లాడే భాషనే ఉపయోగించే ఉద్దేశంతో హీన యాన బౌద్ధ ప్రచారకులు పాలీ, ప్రాకృత భాషలను ఉపయోగించారు. వారినిబట్టి సుమారు క్రీ. పూ. 3వ శతాబ్ది నుండి క్రీ. శ 3వ శతాబ్ది వరకు పరిపాలించిన రాజ వంశాలు ఆ భాషలనే ఉపయోగించారు. తరువాత హీనయాన బౌద్ధ విద్వాంసులు, గుప్తుల కాలంలో హిందూ మత పునరుజ్జీవన కాలంలో హిందూ విద్వాంసులు సంస్కృత భాష నుపయోగించారు. ఆనాటి నుండి రాజవంశాలు సైతం సంస్కృత భాషనే ఆదరించాయి. క్రీ. శ. 8వ శతాబ్ది నుంచి అప్పటి వరకు కలిగిన సంస్కృత భాషా సంపర్కం వలన వృద్ధి చెందిన ప్రాంతీయ భాషలు ప్రాచుర్యంలోకి వచ్చాయి. ఇకపోతే సంస్కృతం అనేక ఐరోపా భాషలతోసహా ఇండో - యూరోపియన్ భాషా కుటుంబానికి చెంది ఆ భాషలన్నింటితో కలిసి ఒకే కుదుటినుండి ఉద్భవించింది. అందుచేత సంస్కృతానికి ప్రాచీన పారసీక, గ్రీకు, రోమన్ తదితర భాషలన్నింటిలోను రామలక్ష్మిగారు చూపినట్లు (వనిత – గత సంచిక) సమానార్థక పదజాలం ఉంటుంది. ప్రాకృతమే సంస్కృతీకరించబడి సంస్కృత భాష అయినదని రామలక్ష్మిగారి అభిప్రాయము. కాని అది సరికాదు. ప్రాక్తనమైన వైదిక భాష కావ్య భాషగా రూపొందబోయే ముందు పాణినీయ సూత్రీకరణ వలన సంస్కరించబడి సంస్కృత భాష అయినది. అంతకు పూర్వము ఆ భాషకు ఒక స్పష్టమైన పేరులేక కేవలం భాష, దేవ భాష అని మాత్రమే వ్యవహరింపబడుతూ ఉండేది. ఇకపోతే తెలుగు సంస్కృత భాషా జన్యమని, అసలు 'తెలుగు' పదమే 'త్రిలింగ' అనే సంస్కృత పదం నుండి ఉద్భవించిందని రామలక్ష్మిగారు వ్రాశారు. 'త్రిలింగ' నుండి 'తెలుగు' వచ్చిన మాట నిజమే కాని సంస్కృతం నుండి తెలుగు ఉద్భవించిందనడం శాస్త్రానికి, చరిత్రకు విరుద్ధం.

వి. కన్యాకుమారి — పెదనందిపాడు

## లోపల




వనితలో 'భాషలు నేర్చుకోండి' అన్న శీర్షికను ప్రవేశపెట్టటం సముచితంగానే వుంది. కానీ, మానమునకు ఒకసారి కొన్ని అక్షరముల ప్రకారం ఒక్కొక్క భాష నేర్చుకోవడానికి ఎన్ని సంవత్సరములు పడుతుందో! అట్లుకాకుండా ఒక్క భాష మాత్రమే పరిమితం చేసికొని ఆ భాషా వివరములు పూర్తి అయిన పిదప మరొక భాషను ప్రచురించుటకు పూనుకుంటే బాగుంటుందని నా అభిప్రాయము.

—పి. శ్రీదేవి, సికింద్రాబాద్

డి. కామేశ్వరిగారు చెప్పినట్లు రచయిత్రులు వ్రాసే కథలు పెళ్ళిళ్ళు, త్యాగాలు, ప్రేమలు వాటి దృష్టితోనే తప్ప సమాజం యొక్క అసలు సత్యం గురించి చాలా అరుదు అనే చెప్పాలి. నవలలో నిర్దుష్టమైన సాహిత్య విమర్శకు స్థానం లేకపోవటం వలన కూడా రచనల స్థాయి పెరుగుట లేదు. ఇప్పుడు రచయిత్రులు రాసేవన్నీ కేవలం సినిమాల దృష్టితో తప్ప; నవలలు సమాజానికి ఎంతవరకు ఉపయోగపడతాయనే విషయం ఆలోచించక పోవటం చాలా విచారం కలిగిస్తోంది.

—కుప్పిలి సావిత్రి, రాజమండ్రి

వనిత లోపలి పేజీల్లో కూడా ఆ పత్రిక యొక్క తారీఖు (ఉదా:- 1-8-78; 1-9-78) ప్రతి పేజీకి వేస్తే బాగుంటుందేమో. పదిమంది వనితల చేతులు మారి అసలుస్థానం చేరుకునే సరికి "రెక్కలు తెగిన పక్షి" అయిన పత్రిక యెప్పటిదో తెలుసుకోవడం కష్టంగా వుంటున్నది.

—కె. ఆర్. లలిత కుమారి, శ్రీరామపురం

ఆగష్టు నెల "వనిత" ఎక్కువ పేజీలతో మమ్ము ఎంతో ఆనందపరచినది. డి. కామేశ్వరిగారి పరిచయం, టి. విమలగారి "ఆశ" కవిత ఎంతో బాగున్నవి. అలాగే బామ్మగారి జవాబులు కూడ చాల సంతోషం కలిగించినవి.

—ఇందుకూరి దుర్గావతి, దువ్వ

మన దేవాలయాలు శీర్షికలో ప్రచురించిన "కాంచీపురం" వ్యాసంలో క్రింది ముఖ్య విషయాలు తెలుపక పోవడం విస్మయంగా వుంది. పూర్వం ప్రతి కథ చివరన యిలా వ్రాసేవారు. 'కథ కంచికి — మన మింటికి-' అని. ఏదైనా అసాధ్యమైన పనికి "కంచి గరుడసేవ వంటిది" అని పేర్కొనడం కద్దు.

—టి. విజయలక్ష్మిబాయి, పామిడి

'వనిత' లో ప్రతినెల ఒక సినీ నటీమణితో ఇంటర్వ్యూ ప్రచురిస్తే బాగుంటుంది.

—వి. కృష్ణవేణి, యం. ఉమ, సిరిసిల్ల

ఆగష్టు 'వనిత' లో అంధులయినా, 'ఆకలి' కథకు సత్యవాడ సోదరీమణులు ఊహాశక్తిని బాగా ఉపయోగించినారు. ఇట్టి వారికి కూడా 'వనిత' ప్రోత్సాహమిస్తున్నదంటే, వనిత ఘనత ప్రత్యేకంగా చాటనవసరం లేదు!

—పి. సుబ్బరత్నం, కడప

సత్యవాడ సోదరీమణులు వ్రాసిన 'ఆకలి' కథ చాలా బాగుంది. జన్మాంధులైనా కళ్ళకు కట్టినట్లు కథనల్లిన వారి ప్రజ్ఞ ప్రశంసనీయమైనది.

—స్వరాజ్య రామకృష్ణ, కలకత్తా

బి. సీతామహాలక్ష్మిగారు వనితలో సినిమా శీర్షిక ప్రారంభించాలని కోరారు. సినిమాల గురించి వివరాలు తెల్పే పత్రికలు వుండగా వనితల అభ్యుదయం కోసం స్థాపించబడిన 'వనిత' లో సినిమా శీర్షిక అనవసరం. ఇంకా వారు తెలిపిన విధంగా నాటక రంగంలో కృషి చేసిన-చేస్తున్న వనితల గూర్చి పరిచయాలు చేయడం ముదావహం.

—జి. కల్యాణి, భీమవరం
















ప్రపంచంలో నిరంతర శాంతికోసం కృషి చేసిన ప్రముఖుడు మన నెహ్రూ. నెహ్రూతో టిటో, నాసర్‌లు చేతులుకలిపి శాంతి స్థాపనకోసం, ఒక దేశపు ఆంతరంగిక వ్యవహారంలో మరో దేశం జోక్యం చేసుకోకుండా వుండడం కోసం తటస్థ సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టారు. దీనినే అలీన విధానం అంటున్నారు.

కొన్ని సంవత్సరాల క్రితం రెండు అగ్ర దేశాలైన అమెరికా, రష్యాల మధ్య మైత్రి సన్నగిల్లి పచ్చగడ్డి వేస్తే భగ్గుమనే వాతావరణం ఏర్పడింది. ఆ రెండు దేశాల మధ్య ప్రచ్ఛన్న యుద్ధం మూడవ ప్రపంచ యుద్ధానికి దారి తీస్తుందని భయపడి ప్రపంచ శాంతికి కృషి చేసే తలంపుతో అలీన విధానాన్ని రూపొందించారు. ఆ అలీన విధానం బలం పుంజుకుని అలీనోద్యమంలో ఎన్నో దేశాలు ప్రవేశించాయి. ప్రపంచ దేశాలు తటస్థ వైఖరిని అవలంబించాలనే ఉద్దేశంతో ప్రారంభమయిన ఈ ఉద్యమం ప్రపంచ యుద్ధ ప్రమాదం తగ్గడంతో మరో ప్రయోజనాన్ని చేపట్టింది. ప్రపంచ ఆర్థిక వ్యవస్థపై పెద్ద పెద్ద దేశాల ప్రభావం ఎంతగానో వుండడంతో బడుగు దేశాలకు పెద్ద 'ఆర్థిక ప్రమాదం' ఏర్పడింది. ఈ ప్రమాదాన్ని అరికట్టడానికి అలీన దేశాలు ఎంతగానో కృషి చేశాయి. అలా అటు రాజకీయపరంగానూ, ఇటు ఆర్థిక పరంగానూ అలీన ఉద్యమానికి గుర్తింపు లభించింది.

అలీన దేశాల సమావేశాలకు ఆ విధంగా ఎంతో ప్రాముఖ్యం రావడంతో వివిధ రాజకీయ సిద్ధాంతాలను అనుసరిస్తున్న దేశాలు కూడా అలీనోద్యమంలో సభ్యత్వం కోసం ముందుకు వచ్చాయి. క్యూబా, వియత్నాం, కంబోడియా అలీనోద్యమంలో సభ్యదేశాలు కావడం విశేషం. అయితే ఈ ఉద్యమంలో సభ్యత్వం వున్న దేశాలు కొన్నిటి మధ్య సంఘర్షణలు సాగడమూ అపురూపమైన విషయమే. ఇథియోపియా, సోమాలియాల మధ్య చిన్న యుద్ధమూ, ఈ యుద్ధంలో ఇథియోపియా తరపున క్యూబా రంగంలోకి దిగడమూ చెప్పుకోదగ్గ విషయం. అలాగే జైర్, అంగోలాల మధ్య స్నేహం మటుమాయమయిపోతోంది.

ఈ వాతావరణంలో బెల్‌గ్రేడ్‌లో జరిగిన అలీన దేశాల విదేశాంగ మంత్రుల సమావేశానికి ఎంతో ప్రాధాన్యం లభించింది. 85 దేశాల విదేశాంగ మంత్రులు ఈ సమావేశంలో పాల్గొన్నారు. ప్రపంచంలో స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలకి వున్న విలువకు ఈ సమావేశంలో గుర్తింపు లభించడమూ, ప్రపంచ శాంతి కోసం పాటుపడి యుద్ధ ప్రమాదాన్ని పూర్తిగా అరికట్టే ప్రయత్నంలో 85 దేశాల ప్రతినిధులు కలుసుకోవడమూ హర్షించదగ్గ విషయాలు.

## శ్రీలంకలో మార్పు

భారతదేశంలో కనిపించిన రాజకీయ వాతావరణం పొరుగుదేశం శ్రీలంకలోనూ కొన్ని సంవత్సరాలు కనిపించింది. ఆరు సంవత్సరాల కాలం అక్కడ అత్యయిక పరిస్థితి అమలులో వుంది. అప్పటి ప్రభుత్వం ప్రజల ప్రాథమిక హక్కులను పూర్తిగా అణచిపెట్టింది. అయితే సాధారణ ఎన్నికలు జరిగి ప్రజల ప్రాథమిక హక్కులు పునరుద్ధరించబడ్డాయి. యునైటెడ్ నేషనల్ పార్టీ అధిక మెజారిటీతో అధికారంలోకి వచ్చింది. శ్రీమతి బండారనాయకే ఫ్రీడమ్ పార్టీ పూర్తిగా తుడిచి పెట్టుకుపోయింది.

కోటిన్నర ప్రజలుగల శ్రీలంకలో 25 లక్షల మంది మాతృభాష తమిళం. తమకు జరుగుతోన్న అన్యాయాలని అరికట్టమనీ, అధిక సంఖ్యలో తాము నివసించే ప్రాంతానికి ప్రత్యేక రాష్ట్ర హోదా ఇవ్వమనీ శ్రీలంక తమిళులు ఎప్పటినుంచో పోరాటం జరుపుతున్నారు. అన్ని జాతుల ప్రజలూ, అన్ని మతాలవారు, సమానంగా బ్రతకడానికి రాజ్యాంగంలో కావలసిన సవరణలు తీసుకురావడానికి ప్రస్తుత ప్రభుత్వం కృషి చేస్తున్నది. అలా అక్కడి తమిళ ప్రజలకు ఇకపై ఎలాంటి ఆటంకాలు లేకుండా అర్హతలనుబట్టి ఉద్యోగావకాశాలు లభించవచ్చు. శ్రీలంకలోనూ తమిళ భాషకు తగిన గుర్తింపూ రావచ్చు.

ఒక చిన్న విషయం చిలికి చిలికి గాలివాన కాకుండా యునైటెడ్ నేషనల్ పార్టీ అవలంబించిన విధానం ఇరుగు పొరుగు దేశాలయిన భారత శ్రీలంకల మధ్య మైత్రి పెరగడానికే దోహదం చేస్తుంది.

## సముద్రంలో సైనిక కేంద్రం

హిందూమహాసముద్రంలో 13 మైళ్ళ పొడవు, నాలుగు మైళ్ళ వెడల్పు గల 'డిగోగార్షియా' దీవి ఇప్పుడు అమెరికా చేతుల్లో వుంది. ఒకప్పుడు బ్రిటిష్ మారిషన్ ఆధీనంలో ఈ దీవి వుండేది. 1970 నుంచీ ఈ దీవిని తన సైనిక వ్యూహంలో భాగంగా పెద్ద సైనిక కేంద్రంగా చేయడానికి అమెరికా ప్రయత్నిస్తోంది. అందుకే ఐక్యరాజ్య సమితి సమావేశాలలో శాంతిని అభిలషించే దేశాలన్నీ హిందూమహాసముద్రాన్ని శాంతి మండలంగా వుంచాలని తీర్మానం చేయగలిగాయి. అయితే అమెరికా డిగోగార్షియాని సైనిక స్థావరంగా చేయడంలో ఏ మాత్రమూ వెనకడుగు వేయలేదనే విషయం రుజువయిపోయింది. హిందూ మహా సముద్ర తీరస్థ దేశాలు ఈ విషయంలో ఆందోళన వ్యక్తపరచినా, ఆసియా ప్రాంతంలో పెరిగిపోతున్న రష్యా ప్రాబల్యం అరికట్టడానికి తను తీసుకుంటున్న చర్యగా దీనిని అమెరికా అభివర్ణిస్తోంది.

డిగోగార్షియా 'సైనిక కేంద్రం'లో ప్రచండ వేగంతో వెళ్ళగల యుద్ధ విమానాలు, బ్రహ్మాండమయిన యుద్ధ నౌకలు, అతి ప్రమాదకరమైన ఆయుధాలు వుంటాయి।

## సైన్యంలో వనితలు

ఇజ్రాయెల్‌లో రాజకీయ వాతావరణం ఎంతో అస్థిరంగా వుంటోంది. అక్కడ సైన్యంలో వనితలనూ చేర్చుకోవాలనే ప్రతిపాదన ఎన్నో సంవత్సరాలుగా వున్నా, క్రమశిక్షణకు భంగం కలుగుతుందనే ఉద్దేశంతో రాజకీయ పక్షాలు అందుకు అంగీకరించలేదు. అయితే ఇప్పుడు ఇజ్రాయెల్ సైన్యంలో వనితలు తమకు అభ్యంతరం లేకపోతే చేరడానికి అవకాశం కలిగించారు. అలా చేరడానికి ఇష్టపడని వనితలు మత కారణాల వలన తాము సైన్యంలో చేరడం లేదని చెప్పడానికి అవకాశం కలిగించారు. టాంక్‌లు నడపడంలోనూ, తుపాకులు పేల్చడంలోనూ, రేడియో సర్వీస్‌లలోనూ పురుషులతో సమానంగా అక్కడ వనితలకి శిక్షణ లభిస్తున్నది.




# "లోధ్ర" టానిక్ వనితలకు మాత్రం!

ప్రకృతి సిద్ధమైన పద్ధతి ద్వారా ఆరోగ్యంగా ఉండడానికీ
నెలలో ప్రతిరోజూ బాధలేని రోజుగా గడపడానికీ
"లోధ్ర" టానిక్ తీసుకోండి! ఏ బాధా లేకుండా ఆరోగ్య
మయమైన జీవితాన్ని గడపండి.

Sistas

75 సంవత్సరాల నుంచీ స్త్రీల విశ్వాసానికి
పాత్రమైన టానిక్.
"లోధ్ర" మందుల షాపులలో దొరుకుతుంది.

ఉచితమైన వైద్య సలహాలకు క్రింది చిరునామాకు ఈ కూపనును
పూర్తిచేసి, మీ ఉత్తరంతోబాటు జతచేసి పంపండి.

పేరు : ______________________

చిరునామా : ______________________

______________________

______________ PIN ______________

**కేసరి కుటీరం (ప్రై) లిమిటెడ్**

15, వెస్ట్‌కాట్ రోడ్, రాయపేట, మద్రాసు-600 014

ఏజంట్లు: శీతారామ జనరల్ స్టోర్స్ ఏజన్సీస్, విజయవాడ, సికింద్రాబాదు, బెంగళూరు

---







# కొత్త సై-బాన్* లోషన్ వాడండి

రాత్రికి రాత్రే
పేలనుండి విమోచనము
పొందండి!

- గుణవంతమైనది
- సురక్షితమైనది
- ఆహ్లాదకరమైన సువాసన గలది
- జిడ్డు లేనిది




* అమెరికన్ సయానమిడ్ కంపెనీవారి రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్క్.

Sista's-CY-90F/Tel/78

# ముఖచిత్రం

# "టి.వి.గర్ల్స్"

అట్ట మీద కనిపిస్తున్న అమ్మాయిలు – శ్రీమతి, అరవింద. వారిద్దరూ మద్రాసు టెలివిజన్‌లో ప్రదర్శితమయ్యే తెలుగు కార్యక్రమాలకి వ్యాఖ్యాతలుగా పని చేస్తూ వుంటారు. కంటికి యింపుగా కనిపిస్తూ విన సొంపుగా వ్యాఖ్యానించే ఈ అమ్మాయిలకు టెలివిజన్‌లో పని చేయడం సరదాగా చేస్తున్న పార్ట్-టైం ఉద్యోగం మాత్రమే.





ఇద్దరూ వేర్వేరు ఉద్యోగాలు చేస్తున్నారు. అరవింద, శ్రీమతి యిద్దరూ కూడా స్నేహితులు, సహాధ్యాయినులు, సహ ఉద్యోగినులు – కావడం విశేషం।

## శ్రీమతి

"అయితే నన్ను నేను టెలివిజన్‌లో యింతవరకు చూసుకోలేదు. స్టూడియోలో ప్రదర్శన జరుగుతున్నప్పుడే అందులో పాల్గొనే వారు చూసేందుకు అనువుగా–'విడియో' సెట్స్ అమర్చుతారు. నేను వాటిల్లో కూడా చూసుకోలేదు. అయితే అందరూ టి.వి. లో ఎనౌన్స్ చేసేటప్పుడు నేను బిగుసుకుపోతానని అంటారుమరి" నవ్వుతూ అన్నారు కుమారి శ్రీమతి.

మద్రాసు క్వీన్‌మేరీస్ కళాశాలలో గృహ శాస్త్రంలో పట్టభద్రురాలైన శ్రీమతి–మన దేశంలో జర్మన్ భాషకు సంబంధించిన కోర్సులన్నీ పూర్తి చేశారు. జర్మన్ భాష బోధించే వారికి పూనాలో ప్రత్యేకంగా శిక్షణ యిస్తారు. ఆమె ఈ మధ్య ఆ కోర్సు కూడా పూర్తిచేశారు. ప్రస్తుతం పశ్చిమ జర్మనీ సాంస్కృతిక కార్యాలయం – మాక్స్ ముల్లర్ భవన్‌లో పని చేస్తూ, జర్మన్ భాషను బోధిస్తున్నారు.

మద్రాసులో ఆగస్ట్ 15,1976 నాడు టెలివిజన్ కేంద్రం ప్రారంభించబడింది. శ్రీమతి అప్పటి నుంచీ అక్కడ ఎనౌన్సర్‌గా వుంటున్నారు. అంతే కాదు. ఆమె గత పది సంవత్సరాలుగా మద్రాసు ఆలిండియా రేడియోలో వివిధ తెలుగు కార్యక్రమాలలో పాల్గొంటున్నారు కూడా।

శ్రీమతి కళాశాలలో చదివే రోజులలో అనేక వక్తృత్వపు పోటీలలో పాల్గొని ఎన్నో బహుమతులు పొందారు. సాంస్కృతిక కార్యకలాపాలలో ఆమెకు ఉత్సాహం మరింత ఎక్కువ. చెన్నపురి ఆంధ్ర విద్యార్థి సమితి, యువవాహిని వంటి తెలుగు విద్యార్థుల సాంస్కృతిక కార్యకలాపాలలో ఉత్సాహంతో పాల్గొనేవారు. ఆమె కొంతకాలం అభ్యుదయ రచయితల సంఘం, మద్రాసు శాఖ కార్యాచరణ సంఘ సభ్యురాలుగా కూడా వున్నారు.

"పెయింటింగ్ చెయ్యటం నా హాబీ....అది నేను చేస్తున్న ఉద్యోగంలో ఒక భాగం కూడా" అంటారు శ్రీమతి. ప్రసిద్ధ రచయిత, సాహితీ విమర్శకులూ ఆయిన బాలాంత్రపు నళినీకాంత రావు కుమార్తె – కుమారి శ్రీమతి – ఈ నెలలో శ్రీమతి శ్రీమతి అవుతున్నారు.

## అరవింద

మద్రాసు క్వీన్‌మేరీస్ కాలేజీ ద్వారా బి. ఎస్సీ పట్టభద్రురాలైన కుమారి అరవింద – ఆ తరువాత ఏడాదిపాటు కల్చరల్ అకాడెమీలో 'హోమ్ మేకింగ్' కోర్స్‌లో శిక్షణ పొందారు. అప్పుడే జర్మన్ భాష కూడా సంవత్సరంన్నరపాటు నేర్చుకున్నారు.

ప్రస్తుతం అరవింద మద్రాసులోని తాజ్‌కోరమండల్ హోటల్‌లో ఉద్యోగిని. తన ఉద్యోగ నిర్వహణలో ఆమె విభిన్న సంస్కృతులకు, ఆచార వ్యవహారాలకు చెందిన దేశ విదేశస్తులను కలుసుకుంటూ వుంటారు. "ముఖ్యంగా వివిధ దేశాలకు చెందిన వ్యక్తులను కలుసుకోవడం, వారి పద్ధతుల గురించి, జీవన విధానం గురించి తెలుసుకోవడం వల్ల – ఈ ఉద్యోగం ఎప్పటికప్పుడు కొత్తగానూ, ఉత్తేజితంగానూ వుంటుంది" అంటారు అరవింద.

"నేను టెలివిజన్ కార్యక్రమంలో మొదటిసారిగా పాల్గొన్నప్పుడు నన్ను నేను పక్కనే వున్న 'విడియో'లో చూసుకున్నాను. అంతే। ఆ కంగారులో ఒక్కక్షణం స్క్రిప్ట్ మరచిపోయాను," అన్నారు ఆ సంఘటన తలచుకుని నవ్వుతూ.

అరవిందకు హిందూస్థానీ సంగీతంలో ప్రవేశముంది. కొంతకాలం హిందూస్థానీ సంగీతం నేర్చుకున్నారు. ఆమె చక్కని గాయని.

టెలివిజన్ కార్యక్రమాలలో పాల్గొనడం ఎంతో ఉత్సాహంగానూ, ఉత్తేజితంగానూ వుంటుందనే అరవింద- కుటుంబ సభ్యులు చాలామంది అమెరికాలో వున్నారు. అందుకే అమె వివాహమయ్యాక ఉద్యోగం కొనసాగించడంపై ప్రస్తావన రాగా – "అప్పటి పరిస్థితులనిబట్టి ఆ విషయం ఆధారపడి వుంటుంది. అయినా వివాహమయ్యాక విదేశాలకు వెళ్ళకుండా వున్నట్లయితే" అని అన్నారు.

భవిష్యత్ కార్యక్రమాల గురించి ప్రశ్నించగా "పెళ్ళి చేసుకోవడమే" నవ్వుతూ అన్నారు అరవింద. □

# పంజాబీ వారి శెనగల కూర

ఈ శెనగల కూర పంజాబీ దేశస్తులు రొట్టెల్లోకి చేసుకుంటారు.

**దీనికి కావలసిన సరుకులు:** పావు కిలో శెనగలు, పావు కిలో బంగాళా దుంపలు, 2-పెద్ద ఉల్లిపాయలు, చిన్న అల్లం ముక్క, పచ్చిమిరపకాయలు-8, మిరియాలు-15, పెరుగు 4-టేబుల్ స్పూనులు, చిటికెడు పసుపు, ½ స్పూను ఆవాలు, నూనె 4 టేబుల్ స్పూనులు.

**చేసే విధానం:** మొదట శెనగలు రాళ్ళు లేకుండా ఏరుకొని తొలిరోజు రాత్రి శెనగలు బాగా కడిగి మంచి నీటిలో నానబెట్టాలి. మరునాడు ఉదయం బంగాళా దుంపలు చెక్కు తీసుకుని కొంచెం పెద్ద సైజులో ముక్కలు తరుగుకోవాలి. తరువాత ఉల్లిపాయలు, అల్లం, మిరియాలు, పచ్చి మిరపకాయలు కలిపి మెత్తగా నూరుకోవాలి. 4 టేబిల్ స్పూనుల నానిన శెనగలు కూడా కలిపి మెత్తగా నూరుకోవాలి. ఇవి అన్నీ తయారు చేసుకొన్న మీదట పొయ్యి మీద దళసరి గిన్నె పెట్టి అది వేడెక్కిన మీదట, నూనె వేసి, ఆవాలు చిటపటలాడిన మీదట, అల్లం, ఉల్లి, మిరప, మిరియాలు కలిపి నూరిన ముద్ద వేసి దోరగా వేయించాలి. తరువాత బంగాళాదుంప ముక్కలు, శెనగలు, పెరుగు, పసుపు, తగినంత ఉప్పు వేసి రెండు నిమిషాలు వేయించాలి. నూరిన శెనగల ముద్దలో ఒక అరగ్లాసు నీరు పోసి కలిపి, పైకి తేలిన శెనగ ముద్ద నీరు కూరలో పోసి అడుగున మిగిలిన పొట్టు తీసెయ్యాలి–ఈ నీరు కాక మరి రెండు గ్లాసుల మంచినీరు కూడా కూరలో వేసి ఉడికించాలి. శెనగలు, బంగాళాదుంప ముక్కలు మెత్తగా ఉడికిన తరువాత దింపి కావలసిన వారు కొత్తిమిరి కూడా వేసుకొనవచ్చును. ఈ కూర రొట్టెలలోకే కాకుండా, అన్నంలోకి కూడా చాలా బాగుంటుంది.

ఎన్. కామేశ్వరి, దుర్గాపూర్

# ఉత్తర ప్రదేశ్ వంటకాలు

ఈసారి ఉత్తర ప్రదేశ్‌లో చేసుకునే మూడు వంటకాల గురించి తెలియజేస్తున్నాము:

## ఉసల్:

ఇది తయారు చేసుకునేందుకు కావలసిన పదార్థాలు: 500 గ్రాముల పెసలు, రెండు ఉల్లిపాయలు, ¼ టీ స్పూను ఆవాలు, ¼ టీ స్పూను జీలకర్ర, ¼ టీ స్పూను ధనియాలు, రెండు పచ్చిమిరపకాయలు, ¼ టీ స్పూను పసుపు, ఒక టీ స్పూనుడు కారం, ఒక టీ స్పూను జీలకర్ర, ధనియాలపొడి మిశ్రమం, ½ టీ స్పూను గరం మసాలాపొడి, కరివేపాకు, చిటికెడు ఇంగువ, 4 టీ స్పూనుల నూనె, 2 టీ స్పూనుల కొబ్బరి కోరు, ఉప్పు (తగినంత)

మొదట పెసలు శుభ్రంగా కడిగి ఒక గిన్నెలో నీరు తీసుకుని అందులో పొయ్యాలి. ఈ విధంగా తీసుకున్న పెసల్ని దాదాపు పన్నెండు గంటలసేపు నానబెట్టాలి. ఆ తరువాత గిన్నెలోని నీటిని తీసివేసి ఆ పెసలుని ఒక గుడ్డలోకట్టి ముడి వేయాలి. ఈ విధంగా మరో పన్నెండు గంటలసేపు వుంచితే పెసలు మొలకలు వేస్తాయి. ఉసల్ తయారు చేయడానికి కావలసిన ప్రధానమైన పదార్థం మొలకలు వేసిన పెసలన్న మాట. అవి తయారు చేసుకున్న తరువాత ఒక బాణలి తీసుకుని అందులో నూనె వెయ్యాలి. నూనె కాగిన తరువాత బాణలిలో ఆవాలు, ధనియాలు, జీలకర్ర, పచ్చిమిరపకాయలు, ఇంగువ వేసి సన్నగా తరుక్కున్న ఉల్లిపాయ ముక్కలను వాటికి చేర్చాలి. అన్నీ కలిపి రెండు నిముషాలపాటు వేయించాలి.

ఇప్పుడు దీనికి మొలకలెత్తిన పెసలు, నీరు, ఉప్పు, కారం, పసుపు, గరం మసాలాపొడి, జీలకర్ర, ధనియాలపొడితోపాటు కరివేపాకు, కొబ్బరికోరు కలపాలి.

ఈ మిశ్రమాన్ని దాదాపు అరగంటసేపు స్టవ్ మీద వుంచి బాగా ఉడికిన తరువాత క్రిందకి దింపాలి. ఈ విధంగా తయారు చేసుకున్న ఉసల్ రొట్టెలలోకి, పూరీలలో ఎంతో బాగుంటుంది. అలాగే తిన్నా రుచికరంగానూ బలవర్ధకంగానూ వుంటుంది.

ఈ ఉసల్‌ని మొలకలువేసే పప్పు దినుసులు వేటితోనైనాగానీ, చేసుకోవచ్చును.

## పతల్ భాజి:

500 గ్రాముల బంగాళదుంపలు, 225 గ్రాముల టమేటాలు, ¼ స్పూను జీలకర్ర, ¼ స్పూను ఆవాలు, రెండు పచ్చిమిరపకాయలు, 1 స్పూను కారం, ½ స్పూను గరం మసాలాపొడి, 1 స్పూను జీలకర్ర, ధనియాలపొడి, ¼ స్పూను పసుపు, చిటికెడు ఇంగువ, 4 స్పూనుల నూనె, 2 స్పూనుల కొబ్బరికోరుగాని మారిన కొబ్బరిగాని, 2 ఉల్లిపాయలు, కరివేపాకు, ఉప్పు (తగినంత)- ఉంటే ఈ పతల్ భాజి తయారుచేసుకోవచ్చును.

మొదట బంగాళాదుంపలను ఉడకబెట్టి వాటిని త్రికోణాకారంలో పెద్ద పెద్ద ముక్కలుగా కోసి ఉంచుకోవాలి. బాణలిలో నూనె వేసి నూనె కాగిన తరువాత అందులో జీలకర్ర, ఆవాలు సన్నగా తరుక్కున్న పచ్చిమిరప ముక్కలు, ఉల్లిపాయముక్కలు, వేసి వాటికి ఇంగువ చేర్చి వేయించాలి. రెండు నిముషాలసేపు ఈ విధంగా వేయించిన తరువాత బాణలిలోకి టమేటాలు, బంగాళదుంపముక్కలూ, కారం, ఉప్పు, జీలకర్ర ధనియాలపొడి మిశ్రమం, గరం మసాలాపొడి, పసుపు, కరివేపాకు, కొబ్బరికోరు తీసుకోవాలి. దీనికి రెండు గ్లాసుల నీరు కలిపి ఉడకబెట్టాలి. స్టవ్ మీద దాదాపు ఇరవైఅయిదు నిముషాలసేపు ఆ విధంగా వుంచితే 'పతల్ భాజి' తయారవుతుంది. ఇది కూడా రొట్టెలలో తినడానికి ఎంతో బాగుంటుంది. అన్నంలో కలుపుకుని తిన్నా కూడా రుచికరంగా వుంటుంది.

## దహి మిశాల్:

ఉసల్, పతల్ భాజి చేయడం ఎలాగో తెలుసుకున్నారుగదా. అవి కేవలం రొట్టెలలోకి, అన్నంలోకి ఉపాహారంగానే ఉపయోగపడటమేకాకుండా, వాటి రెండింటి మిశ్రమంతో ఒక రుచికరమైన ఫలహారాన్ని తయారు చేసుకోవచ్చని చెబుతుంది-'దహి మిశాల్.' ఇప్పుడు ఈ 'దహి మిశాల్' ఏ విధంగా తయారు చేసుకోవాలో తెలుసుకుందాం.





దహి మిశాల్ ▼



▲ పతల్ భాజి:



ఉసల్ ▶

ఇది తయారు చేయడానికి కావలసిన పదార్థాలు: 500 గ్రాముల ఉసల్, 500 గ్రాముల పతల్ భాజి, 250 గ్రాముల ఖారామిక్చ్సర్, (కారపూస, బూంది, వేయించిన అటుకులు, వేయించిన సెనగ పప్పు మిశ్రమం) 500 గ్రాముల పెరుగు, 100 గ్రాముల ఉల్లిపాయముక్కలు, (పెరుగు లేకపోతే ఒక నిమ్మకాయ) ఉప్పు, కారం, కొత్తిమిర.

ఈ 'ధహి మిశాల్' ఎవరి అభిరుచికి తగ్గట్టుగా వారు చేసుకోవచ్చును. కాని ఉసల్, పతల్ భాజి సరిసమానమైన పాళ్ళలో తీసుకుంటే 'దహి మిశాల్' బాగా కుదురుతుంది. ముందుగా ఒక గాజుపాత్రలోగానీ, స్టెయిన్‌లెస్‌స్టీల్ గిన్నెలో గానీ పెరుగు వేసుకోవాలి. దానికి పతల్ భాజి, ఉసల్‌లు రెండూ సమానమైన పాళ్ళలో చేర్చాలి.

ఈ మిశ్రమాన్ని బాగా కలియబెట్టిన తరువాత ముందుగా తీసి వుంచుకున్న ఖారామిక్స్చర్‌ని దీని మీద చల్లాలి. ఈ ఖారామిక్స్చర్ ఇళ్ళల్లో చేసుకోవచ్చును. లేదా బజారు నుంచీ తెచ్చుకోవచ్చును. దీనికి కారం, ఉప్పు, ఉల్లిపాయ ముక్కలు, కొత్తిమిర కలిపితే రుచికరంగా వుంటుంది. ఇలా చేసుకున్న 'దహి మిశాల్' ఎనిమిదిమందికి సరిపోతుంది.

ఒకవేళ ఏ కారణాన్నయినా మీకు పెరుగు లభించలేదనుకోండి. అంత మాత్రంచేత నిరుత్సాహం చెందక ఉసల్, పతల్ భాజీలకి పెరుగు తప్ప తక్కినవన్నీ చేర్చి పైన ఖారా మిక్స్చర్ చల్లి ముందుగా సిద్ధంచేసి వుంచుకున్న నిమ్మరసం తగినంత వాటి మీద పిండుకోండి. ఆ విధంగా చేసుకున్న 'మిశాల్' కూడా కొత్త రుచితో తినడానికి బాగుంటుంది. □



సుధాకర్ కెమెరా కొన్నాడు. ఆ విషయం దాచడానికి అతడేమీ ప్రయత్నించలేదు. పైగా, వీలైనంతగా ఎదుటివారికి తెలియపర్చాలనే ప్రయత్నంలోనే ఉన్నాడు. బొంబాయి మహానగరం నుంచి, దాదాపు ఆరడుగుల సమున్నత విగ్రహం, అందమైన వర్చస్సు, ఉంగరాల జుట్టు, చిలిపి కళ్ళు కల సుధాకర్, తన రంగుకు మాచ్ అయ్యేటట్లు వేసుకున్న నీలం రంగు స్వెటర్, కూలింగ్ గ్లాసస్, ఎయిర్ బాగ్‌తో పాటు, పెట్టెలో ఖాళీ ఉన్నా, అందరికీ తెలియజెప్పే ఉద్దేశ్యంతోనే కెమెరా మరో భుజానికి తగిలించుకుని, వీలైనంతమందికి దార్లో దాని గుణగణాలు తెలియజెప్పి, సిరిపురం లాంటి చిన్న ఊర్లో దిగాడు. మొనాటనీతో విసిగిపోయిన అతని పాతికేళ్ళ వయస్సు, ఆకుపచ్చ చీరకట్టుకున్న అందగత్తె లాంటి ఆ ఊరిలో పాదం మోపగానే ఏదో తెలియని అడ్వంచర్ కోసరం ఉరకలు వేసింది.

"ఇన్ని వేలుపోసి ఇప్పుడివి కొనకపోతే ఏమిటిరా?" మెల్లగా మందలించే అక్కగారి మాటలకు సమాధానం వెంటనే చెప్పలేదతను. చింతగింజ మునగని చిక్కటి కాఫీ తాగుతూ, తనకు చిన్నప్పటినుంచీ ఉన్న కెమెరా, ఫొటోగ్రఫీ పిచ్చి గురించి మరోసారి చెప్పాడు అతను. సంపాదన పరుడు, స్వతంత్రుడు అయిన తమ్ముణ్ణి మరేమీ అనలేక—

"మా ఫొటోలు తీయరా! నాదీ బావగారిదీ కలిపి ఒక్కటి కూడా లేదు" అంది అక్క.

"తప్పకుండా అక్కయ్యా!" అని అక్కకు, అలా అడిగిన చాలా మందికి ప్రామిస్‌లు చేసేశాడు సుధాకర్.

"నీ ఫొటోలు తీద్దామనే తెచ్చాను కెమేరా!" అని అతనన్నప్పుడు ఎంకి లాంటి మామయ్య కూతురు అనూరాధ అంతంత కళ్ళేసుకుని 'అలాగా బావా' అనలేదు. హాయిగా నవ్వేసింది. నీరెండలో తళుక్కుమన్న ఆనవ్వు, మెరిసిన ఎర్రరాయి ముక్కు పుడక అతణ్ణి ముగ్ధుణ్ణి చేశాయి. "ఎలాగైనా ఈ అందం వేరు" అనుకున్నాడు— బొంబాయిలో నీతా మెహతా గుర్తుకు వచ్చి. బిగించి వేసిన కుప్పెలు పెట్టిన జడలో, వాడిన కనకాంబరాలు, ఏమాత్రం మాచింగ్ లేకుండా కట్టుకున్న లేత ఆకుపచ్చ పూల పరికిణీ, నీలం రంగు ఓణీ, ఎర్ర రంగు జాకెట్టు, చామనచాయ ఇచ్చిన మరింత కళతో, నూతి దగ్గరనుంచి నీళ్లు తీసుకువస్తున్న అనూను అలాగే ఫొటో తీశాడు. అలా అందంగా కనిపించిన ప్రతి మనిషినీ, దృశ్యాన్నీ ఫొటో తీస్తూ తను ప్రతి ఏడూ చూసే ఈ ఊరిలో ఇన్ని అందాలున్నాయని కెమెరా పట్టుకుంటేనే కానీ అర్థం కాలేదే—అనుకున్నాడు.

పాలు తీసే పల్లెపడుచులు, రంగుల రంగవల్లుల మధ్య బంతిపూల గొబ్బెమ్మలు, తాటాకులతో కట్టిన దేముడి రథం, అన్నీ అందంగానే కనిపించాయి అతనికి. జీవితంలో అస్తమయానికి వచ్చి, సహం నెరసిన జుట్టుతో—అలంకరించుకుని తిరిగే మునసబుగారి భార్య "నా ఫొటోలు తీయవు బాబూ!" అని వయ్యారంగా అడిగేటప్పటికి మతిపోయి చూశాడు అతను. "తప్పదు మునసబుగారి భార్య." అన్నట్లు అక్క చేసిన సౌంజ్ఞ చూసి "హత విధీ" అనుకున్నాడు సుధాకర్. సాయం సంధ్యలో నిర్మానుష్యంగా ఉన్న దారిలో, దేముడి ధ్వజస్థంభం దగ్గర నిలబడి ఏం చేద్దామా అని నాలుక వేలాడేసి చూస్తున్న ఊరకుక్క, పెద్ద వేదాంతిలా అనిపించింది అతని కళా హృదయానికి. 'ఇలాంటి దృశ్యాలకే ఫొటోగ్రఫీ ప్రైజ్ వచ్చేది' అని నూటొక్కసారి అనుకుని కెమేరా క్లిక్ మనిపించబోయాడు. కుక్క కళ్ళలో సుధాకర్‌కు కనబడ్డ వేదాంతం తారుమారై, అది మీదకొచ్చి పడేటప్పటికి ఒక్క పరుగుతో రోడ్డు ఎక్కాడు. దారిలో పైట చెంగులు అడ్డం పెట్టుకుని నవ్వుతున్న ఆడపిల్లల్ని కూడా లెక్క చెయ్యకుండా ఒక్క ఉరుకులో ఇంటికి వచ్చిపడి, "డామ్ ఇన్సల్ట్" అని ఉడుక్కున్నాడు. కొబ్బరి చెట్ల చాటున సూర్యాస్తమయం దగ్గర నుంచి చిన్నారి పాపల బోసి నవ్వుల వరకూ అన్ని ఫొటోలు తీశాడతను. ఖరీదైన కలర్ ఫిలిం ఉన్న కెమెరాను పక్క పట్నానికి తీసుకువెళ్ళి మరోసారి లోడ్ చేసుకు వచ్చాడు సుధాకర్. ఫొటోలు తీసే మోజులో అతనికి దానికయ్యే ఖరీదు జ్ఞాపకం రాలేదు.

సుధాకర్ అడిగి తీసిన ఆడపిల్లల ఫొటోలు చాలా ఉన్నాయి. కానీ, అతన్ని అడక్కుండా అతని చేత ఫొటోలు తీయించుకోవాలని అతను కెమేరాతో మేడమీదకు వచ్చినప్పుడల్లా అలంకరించుకుని, అవతల మేడ మీద గుడ్డలారేసే నెపంతోనూ, ఒడియాలు తీసే నెపంతోనో వచ్చి, చూపుల బాణాలు విసిరే కరణంగారి కొత్త కోడలు లాంటి వారిని చూస్తే చాలా నవ్వొచ్చేది

సుధాకర్‌కు. అతను కెమెరా తీసుకుని ఎదరపడితే చాలు, వీలైనంత అందమైన భంగిమలో అతనికి కనబడాలనే ప్రయత్నించే వాళ్ళను చూసి.

"ఈ ఆడవాళ్ళు...." అనుకునే వాడు సుధాకర్.

"బావా! ఇవ్వాళ ఒంట్లో బాగా లేదు. రేపు చూద్దాం తోట...." ఇంకా ఏమిటేమిటో రాసి పంపింది అనూ ఆ రోజు పాలేరు చేత. కెమేరా లోడ్ చేసుకుని అనూ వాళ్ళ మామిడి తోటలో రకరకాల ఫొటోలు తీయాలనుకున్న సుధాకర్‌కు "బాబూ నన్ను కూడా....ఏదీ... ఫొటో...." అంటున్న పాలేరు మాట వినబడ గానే "ఛా! ఫో! వెధవా!" అని తిట్టి పంపిం చేశాడు. ఆ రోజు ఇంకెక్కడికీ వెళ్ళాలనిపించ లేదు సుధాకర్‌కు. ఇంట్లో అంతా బయటకు వెళ్ళడం వల్ల అంతగా అలికిడి లేదు. డబ్బాలో నించి చేగోడీలు తెచ్చి నములుతూ కెమెరా వంక చూస్తూ పడక్కుర్చీలో జారగిలబడ్డాడు అతను.

"ఏమండీ!" ఏదో బొంగురు గొంతు వినబడి ఉలిక్కిపడి చూశాడు. వాకిలికి కట్టిన రంగురంగుల గాజు గొట్టాలు, పూసలతో అల్లిన తెర అల్లల్లాడింది. వాటి సందునుంచి తొంగి చూస్తున్నారు ఎవరో.

"ఎవరది?"

"నేనేనండీ! శ్యామలను. నా ఫొటో తీస్తారేమోనని అడుగుదామని వచ్చాను...."

ఆ వ్యక్తి ఎదురుగా వచ్చి నిలబడింది. ఆ అమ్మాయిని, ఆ ఆకారాన్ని, ఆ గొంతుకను విని ఉలిక్కి పడ్డాడు సుధాకర్. నల్లటి చాయ, బక్కచిక్కిన శరీరం, లోతు బుగ్గలు, మెల్ల కన్ను, బిగించి కట్టిన ఉంగరాల జుట్టు.... కరణంగారి అమ్మాయి శ్యామల. "ఖర్మరా బాబూ." అనుకున్నాడు సుధాకర్. ఎలాంటి ఎలాంటి వాళ్ళో ఫొటోలు తీయించుకుందామను కుంటారుగాని, ఇలాంటి పిల్ల కూడా ఫోటో తీయించుకుంటుందని అతని ఊహకు తట్టలేదు.

"మాట్లాడరేమండీ....నేను ఫోటోకు బావుండ ననేగా! అందరూ అందంగా ఉంటారా ఏమిటీ! నా కెన్నాళ్ళబట్టో ఫోటో తీయించుకోవాలని ఉంది....'నీ ముఖానికి అద్దొకటే తక్కువ అంటుంది' మా అమ్మ. ఏమండీ....నేను బావుండనా?" వెలిసిపోయిన వాయిలు ఓణీ వేలుకు మెలిపెడుతూ, మెల్లకన్నుతోనూ,

# నీడ వెనక నిజం

—జలంధర

రాజస్థాన్‌లోని మార్వార్ ప్రాంతంలో 'అఖాతీజ్' అనే రోజు ఎంతో పవిత్రమయినదట. ఆ రోజున పార్వతీదేవి పరమశివునితో పునస్సమాగమం పొందిన రోజని వారి విశ్వాసం. అందుకని స్త్రీలకి— ముఖ్యంగా వివాహాలకు అది పర్వదినమని మార్వారీలు భావిస్తారట. అలా భావించినంత మాత్రానగానీ, వివాహాలు చేసినంత మాత్రానగానీ తప్పులేదు. రైటే. కాని ఇటీవల అందిన వార్తలను బట్టి మొన్నీ మధ్య 'అఖాతీజ్' రోజున మార్వార్ ప్రాంతంలో మూక ఉమ్మడిగా ఒకేసారి పదివేల పెళ్లిళ్లు జరిగాయ్యిట! సరే— సామూహిక వివాహాలా - అదీ అభినందనీయమే. కాని ఇంతకీ ఆ పదివేలమందీ



ఎవరనుకున్నారు?

ముక్కు పచ్చలారని పసికందులు!

తమ వివాహాలు జరుగుతున్నప్పుడు ఆ చిన్నారి పాపలు తలిదండ్రుల ఒళ్లోనూ, భుజాల మీదా హాయిగా నిద్రపోతున్నారట!

భయంకరమైన గొంతుతోనూ మాట్లాడే ఆ అమ్మాయిని చూసి దడుసుకున్నంత పనైంది అతనికి.

'అబ్బెబ్బే....అదేం లేదు....తప్పకుండా తీస్తాను....' అన్నాడు తడబడుతూ.

"ఎప్పుడు తీస్తారూ?" అంది గొంతు సాగదీస్తూ.

"ఎప్పుడేమిటి? ఎప్పుడైనా తీద్దాం...రేపు...లేకపోతే...." ఎవరైనా తనను చూస్తారేమో, నవ్వుతారేమోననిపించి అతను తత్తరపడ్డాడు.

"అయితే ఎల్లుండి తీయండి. సాయంత్రం వస్తానేం...ఎల్లుండి మంచిరోజు. ఏం?" అంటున్న ఆ అమ్మాయిని చూసి నవ్వాలో ఏడవాలో అర్థం కాలేదు అతనికి.

"అలాగే....అలాగే...." అంటుండగా వాళ్ళక్క లోపలికి వచ్చింది. 'హమ్మయ్య' అనుకున్నాడు.

"ఏమిటే శ్యామలా ఇలా వచ్చావు?" అంది నవ్వుతూ ఆమె. ఆ పిల్లను చూడగానే ఎవరికైనా నవ్వూ వేళాకోళం విసుగు అన్నీ అనిపిస్తాయి.

"ఏం లేదు పిన్నిగారూ! మీ సుధాకర్ ఫోటో తీస్తాడేమోనని...." ఆపకుండా ఏదేదో మాట్లాడుతోంది శ్యామల. అక్కడి నుంచి మెల్లిగా దాటుకున్నాడు సుధాకర్.

"ఏమిటక్కయ్యా! ఆ అమ్మాయి...." భోజనాల దగ్గర కదిలించాడు మెల్లిగా. ఎందుకో ఎంత మర్చిపోదామన్నా ఆ అమ్మాయే గుర్తుకు వస్తోందతనికి.

"ఆఁ! ముది వయసులో పుట్టిన పిల్లరా! ఎదుగూ లేదు, బొదుగూ లేదు. పైగా అనాకారి తను....పోనీ కాస్త శుభ్రంగా అన్నా ఉంటుందా అంటే ఆ తల్లికే లేదు శ్రద్ధ. వచ్చిన కొత్త కోడల్ని చూసి మురిసిపోవడంతోనే సరిపోతోంది. సాయంత్రం అయ్యేసరికి తట్టెడు మల్లెపూలు ఇంటిల్లిపాదీ పెట్టుకుంటారు. ఆ పిల్లకు తలన్నా దువ్వరు. పోనీ, 'ఏ టానిక్కన్నా ఇవ్వరాదా వదినా' అని చెప్పానురా! శ్రద్ధేదుస్తేనా? ఆస్తి ఉంటే చాలనుకుంటున్నారు. కాస్త అందమన్నా ఇవ్వకూడదా భగవంతుడు! అబ్బే....పగలు చూస్తే రాత్రి కల్లోకి వచ్చేటట్లుంటుంది. ఏం రాత రాసుందో ఆ పిల్లకు...." పులుసు వడ్డిస్తూ అక్క చెప్పిన విషయాలకు జాలేసింది సుధాకర్‌కు.

"ఇంతకూ నీ దగ్గర కెందుకు వచ్చింది మామయ్యా!" పిల్లలు అడిగిన ప్రశ్నకు 'ఫోటో కోసమర్రా' అని సమాధానమిచ్చారు. ఫకాల్న నవ్వారు పిల్లలు.

"ఆఁ! దాని ముఖానికి ఫోటో ఒకటి తక్కువ." అంది కంచాలెత్తుతూ అక్కయ్య.

"అయితే బావా! శ్యామల నిన్ను ఫోటో అడిగిందా?" మర్నాడు మామిడి తోటలో నవ్వాపుకుంటూ అడిగింది అనూ. ఆమె వెనకాల వున్న మిత్రబృందం ఆశ్చర్యంగా చూశారు. అంతమంది ఆడపిల్లలు తనను అలా చూసేటప్పటికి రెచ్చిపోయి నిన్నటి దృశ్యాన్ని చిలవలు పలవలు కలిపించి చెప్పి వాళ్ళను నవ్వించాడు సుధాకర్. ఇంక ఆ మర్నాడు శ్యామలను ప్రత్యేకంగా పిలిపించి, కూర్చోబెట్టి, అతి అమాయకత్వం నటిస్తూ, "మా బావ నిన్ను ఫోటో తీస్తానన్నాడటగా..." అంటూ ప్రారంభించి చాలాసేపు శ్యామలను వాగించి, వాగించి ఆనందించారు అనూరాధ, ఆమె స్నేహితురాళ్ళు.

అదే రోజు సాయంత్రం లేతాకు పచ్చని పట్టు పరికిణీతో, సోగకళ్ళతో సంపెంగ దండలాంటి అనూ దూసుకు వచ్చింది తోటలోకి.

"బావోయ్! నీకో విషయం తెలుసా! నీకొక ఆరాధకురాలుంది ఈ ఊళ్ళో...." ఫకాల్న నవ్వుతూ అంది.

ఎవరబ్బా! ఆలోచిస్తూ మెల్లగా, "నువ్వా!" అన్నట్లు కొంటెగా చూశాడు సుధాకర్.

"ఆశ పాపం....నిన్నెవరు నమ్మార్లే....నవ్వులాటకాదు నిజంగా...."

"నీ ముఖం...."

"నిజం...ఎవరో తెలుసా? ఊర్వశి శ్యామల.." ఉలిక్కిపడ్డట్టు నటించాడు సుధాకర్. "పాపం శమించుగాక" అని చెవులు మూసుకున్నాడు.

"నిజం. మేము నిన్ను గురించి బాగా ఉన్నవీ, లేనివీ నమ్మేట్లు చెప్పేశాం. పిచ్చిది కదా, నిజం అనుకుంది. ఇంక చూడు. రోజూ నువ్వు తననే చూస్తున్నావుట. పొద్దున్న ముఖం కడుక్కునే సాకుతో మేడ మీదకు వస్తావట. అసలు నువ్వే 'ఫోటో తీస్తాను శ్యామలా' అని అడిగావట. నిజమా బావా?" చక్రాల్లా కళ్ళుతిప్పుతూ అమాయకత్వం నటిస్తూ అడిగింది శ్యామల.

"ఛా! నోర్ముయ్యి. అసలు ఆ అమ్మాయితో నేను...."

"నాకు తెలుసులే బావా! ఏడిపించడానికి అన్నాను వినుమరి.... ఇంకా చాలా చెప్పింది. విని విని మన పూజారిగారి రాధకు

ఒళ్ళుమండి 'నువ్వేం పెద్ద ఊర్వశి ననుకుంటు న్నావా? జరిగింది మాకు తెలియదా ఏమిటి? మొన్న ఆయనే చెప్పాడులే' అని నువ్వు మొన్న ఆ అమ్మాయి ఫోటో తియ్యమని అడిగిన పార్సంతా చెప్పావే—అదంతా నీ భాషలోనే వర్ణించింది. ఇంకచూడు, దాని నల్లటి ముఖం మరీ మాడిపోయింది. పారిపోయిందనుకో....'' ఇంకా ఏదో చెప్పుతోంది అనూ.

ఎందుకో సుధాకర్ మనస్సు కలుక్కుమన్నది. పాపం ఏమనుకుందో అమాయకురాలు—అనిపించింది. అందవికారమైన ఆడపిల్ల తన 'గొప్ప' వుందని తృప్తిపరచుకోడానికి ఊహించుకున్న తీయని ఊహలన్నీ నిజాలుగా బైటకు చెప్పిందనే విషయం తెలియకపోయినా, ఎందుకో జాలేసిందతనికి.

''అయినా ఆ పిల్ల కెన్నేళ్ళుంటాయి అనూ. నాలుగడుగులు కూడా ఉండదు?'' అన్నాడతను.

''ఎన్నేళ్ళేమిటి బావా! నా వయసే పద్దెనిమిది. నేను కార్తీకంలో పుట్టాను. అది పుష్యమాసంలో పుట్టింది. ''అయినా బావా నువ్వు మేడెందుకు ఎక్కుతున్నావో నాకు తెలియకనా? కిరణంగారి కొత్తకోడల్ని చూట్టానికేగా!....'' అంది నవ్వుతూ.

''ఏయ్ అనూ! తంతాను. వాళ్ళ మావ విన్నాడంటే మక్కెలిరగగొడతాడు మనని'' అన్నాడు చెయ్యెత్తుతూ.

నాలుకతో ఎక్కిరించి, గోరింటాకు చేతులతో టాటా చెప్పేసి, అందకుండా దూసుకుపోయింది అనూ.

మర్నాడు మధ్యాహ్నం, నిన్న సాయంత్రం మర్చిపోయిన నవల కోసరం భోజనం చేసి మేడెక్కాడు సుధాకర్. ఎర్రని ఎండలో నోరూరించేటట్లున్న వడియాలు తీసుకుని రెండు నోట్లో వేసుకుని వెనక్కి తిరగబోయి ఆగిపోయాడు సుధాకర్. అవతల మేడ మీద ఎర్రటి ఎండలో, గోడ కానుకుని కూర్చుని మోకాళ్ళలో తల దాచుకుని ఏడుస్తోంది శ్యామల. ఆశ్చర్యపోయి ఇవతలి గోడ కానుకుని ''శ్యామలా!'' అని పిలిచాడు తనను తాను మర్చిపోయి.

తలెత్తి చూసింది. ఎంతసేపటి నుంచి ఏడుస్తోందో కళ్ళు ఎర్రబడి వాచి ఉన్నాయి.

''మీరా! పోండి! నాతో మాట్లాడకండి.'' అంది బెక్కుతూ చేతుల్లో ముఖం దాచుకుంటూ.

''ఏం? ఎందుకని? ఏమైంది?'' మెల్లిగా అడిగాడు. అతనికి తెలియకుండానే అతని గొంతు మృదువుగా మారిపోయింది.

మరి కాసేపు బ్రతిమాలించుకుని అసలు విషయం చెప్పింది శ్యామల.

''మీరు నన్ను గురించి ఇష్టం వచ్చినట్లు మాట్లాడారటకదా! నిన్న అనూ దాని స్నేహితురాళ్ల నన్ను గుళ్ళో ఎలా ఏడిపించారో తెలుసా? నేను ఫోటో తీయించుకుంటానని దానికెందుకు చెప్పారు? ఇష్టం లేకపోతే అప్పుడే చెప్పాల్సింది. అందరికీ తెల్సిపోయి నన్ను ఏడిపిస్తున్నారు. మా అమ్మ 'సిగ్గు లేనిదానా? నీ ముఖానికి ఫోటో ఒకటే తక్కువ. సిగ్గూ, ఎగ్గూ లేకుండా పరాయి మొగాడ్ని అడుగుతావా?' అని కొట్టింది. ఏమండీ! నేను ఫోటోకు అంత పనికిరానిదాన్నా?'' బెక్కుతూ చేత్తో కళ్ళు నులుపుకుంటూ అడుగుతున్న ఆ పిల్లను చూడగానే, అతనికి ఆ అమ్మాయి అందవికారం కానీ, బొంగురు గొంతుకానీ వినిపించలేదు. కనిపించలేదు. గుండె తరుక్కుపోయినట్లనిపించింది. వెంటనే తనను తాను మర్చిపోయి—

''ఛీ! ఛీ! అదేం లేదు శ్యామలా! ఎవరన్నారు అలా? అదంతా అబద్ధం. ఇంకా నువ్వు ఇవ్వాళ

# పాలమారడం



పాలు తాగుతున్నప్పుడు పిల్లలకు పాలమారుతుంది. పాలు, నీళ్ళులాంటి ద్రవ పదార్థాలు మాత్రమే కాకుండా తినుబండారాలు, అన్నం మొదలైనవి తింటున్నప్పుడు కూడా కొన్ని సమయాల్లో పిల్లలకు పాలమారుతూ వుంటుంది. అలాంటప్పుడు, 'ఎవరో తలుచుకుంటున్నారు' అంటూ తల్లి-తల మీద తట్టడం మనం తరచూ చూస్తువుంటాం.

నిజానికి, పాలమారడానికీ, ఎవరైనా తలచుకోడానికీ అసలు సంబంధం లేదు. అయితే మరి ఎందుకిలా పాలమారుతుంది? అంటే-నోటినుంచి జీర్ణాశయానికి పోయే ఆహార నాళానికి ప్రక్కనే శ్వాసకోశ నాళం కూడా వుంటుంది. ఈ నాళాన్ని ఒక కవాటం మూస్తూ తెరుస్తూ వుంటుంది. ఆ కవాటం తెరచుకుని ఉండేప్పుడు ఏదైనా మింగితే అది శ్వాసకోశనాళంలో ఇరుక్కుంటుంది. అందువల్ల పాలమారడం జరుగుతుంది. ఆ విధంగా ఘనపదార్థాలేవైనా అలా తగుల్కుంటే పిల్లలు ఊపిరి పీల్చడానికి కూడా తడబడుతూ వుంటారు. అలాంటప్పుడు కేవలం తల మీద తట్టడం మాత్రమే చాలదు. మరి ఏం చెయ్యాలి?

వెంటనే ఒక కుర్చీ-లేదా స్టూలు మీద కూర్చుని-పాపాయిని తలక్రిందులుగా తిప్పి, తల మన మోకాళ్ళమీద ఆనే విధంగా పాపాయి కాళ్ళ దగ్గర ఒక చేత్తో పట్టుకుని రెండో చేత్తో తలకు క్రింది భాగంలో అంటే వీపుకు పైన-రెండు మూడుసార్లు తట్టాలి. శ్వాసకోశ నాళంలో ఇరుక్కున్న పదార్థం బయటపడిపోతుంది.

కొంచెం పెరిగిన అబ్బాయో, అమ్మాయో అయితే — అలాంటప్పుడు వాళ్ళను పై విధంగా తలక్రిందులుగా పట్టుకోడం అంత సులభం కాకపోవచ్చు. అంచేత తలక్రిందకు వచ్చేట్టుగా, మోకాళ్ళ మీద బోర్లా పడుకోబెట్టి రెండు భుజాలకు మధ్య భాగంలో వీపుపై రెండు మూడుసార్లు గట్టిగా తట్టాలి. ఐతే, ఇలా చేసినా కూడా పాపాయి వూపిరి పీల్చుకోడానికి అవస్థపడితే మాత్రం వెంటనే డాక్టర్ దగ్గరకు తీసుకు వెళ్ళడం చాలా అవసరం!

పిల్లలు ఆహారం బాగా నమిలి తినేట్టు చూడాలి. భోంచేసేటప్పుడు అధికంగా మాట్లాడకుండా చూడాలి. ఇకపోతే నాలుగేళ్ళయినా దాటని పిల్లలకి బఠానీలు, పాప్‌కార్న్‌లాంటి తినుబండారాలు యివ్వకుండా వుండడం మంచిది. ఎందుకంటే వాటిని నమలడం కాస్త కష్టం. అదీగాక, పిల్లలు తొందర తొందరగా తింటూ వుంటారు-అందువల్ల కూడా పాలమారవచ్చు.

—డాక్టర్

పోటో తీయించుకుండానికి రెడీ అవుతావను కుంటున్నాను. వాళ్ళ ముఖం........వాళ్ళ మాట లేమిటి? రేపు నీ ఫోటో చూడు. ఎంత బావుం టుందో...'' అన్నాడు.

నమ్మనట్లు తలెత్తి చూసింది శ్యామల. ''నిజం....అబద్ధం కాదు....సాయంత్రం మరి రెడీగా ఉంటావా? పో! ముఖం కడుక్కో.... అన్నం తినలేదుకదూ....పిచ్చిపిల్లా....వెళ్ళు'' అన్నాడు.

మెల్లిగా లేచి పరికిణీతో ముఖం తుడుచుకుని, వెనక్కి తిరిగి చూసుకుంటూ వెళ్ళిపోయింది శ్యామల. ఆమె వెళ్ళిన అయిదు నిమిషాలకు కానీ, తను చేసిన పనేమిటో అర్థం కాలేదు అతనికి. ''ఇదెక్కడి కొత్త జంజాటం పెట్టుకున్నానురా దేముడా!'' అనుకుంటూ కిందికి వెళ్ళాడతను.

''ఏమండోయ్....'' సాయంత్రం పడకగది కిటికీ దగ్గర నుంచి శ్యామల గొంతు వినబడి ఉలిక్కిపడి నిద్రలేచాడు.

''నేనేనండీ! మా ఇంట్లో అందరూ పన్లలో ఉన్నారు. మీ అక్కావాళ్ళు మామయ్యగారింటి కెళ్ళారు. మరి నేను తయారవ్వనా? ఫోటో తీస్తారా?'' ఆ గొంతులో ఆశ, ఆ వికృతమైన ఆకారం రెండు చూసి ఏం మాట్లాడలేక 'ఊఁ!' అని, ఖర్మరా బాబూ అనుకుంటూ కెమేరా తీసుకుని మేడెక్కాడు అతను. అంత ఖరీదైన కలర్ ఫిలిం శ్యామల మీద దండగ చెయ్యడం ఏ మాత్రం ఇష్టం లేదతనికి. 'ఊరికే క్లిక్ మనిపిస్తే సరి!....నమ్మేస్తుంది....పిచ్చిది....' అనుకున్నాడు. భగవంతుడా! ఈ ఫోటో తీసే సమయానికి మా అనూ, దాని బృందం రాకుండా చూడు–అని మనస్సులోనే దేముణ్ణి ప్రార్థించాడు. అయినా అతనికి బెరుకు వదల్లేదు.

''ఏమండీ!'' ఆ గొంతు మళ్ళీ వినబడగానే ఉలిక్కిపడ్డాడు. ఎదురుగా శ్యామల. ఆమెను, ఆమె అలంకరణనూ చూస్తే నోటమాట రాలేదతనికి. ముదురు ఎరుపురంగు పరికిణీ, కనకాంబరం రంగు ఓణీ, వాళ్ళ అమ్మది కాబోలు లూజుగా ఉన్న పట్టు జాకెట్టు, మెళ్ళో ఏవేవో రకరకాల నగలు, చేతినిండా నానా రంగుల గాజులు, ముఖానికి అరంగుళం పౌడరు, కళ్ళు మూసుకు పోయేలా కాటికా, ఎర్రటి అమ్మవారి బొట్టు.... అసలే అందవికారమైన శ్యామల. ఆ అలంకరణలో ''బావున్నానా అండీ?'' అని నవ్వేసరికి దడుసుకున్నాడు సుధాకర్. ఉన్నపళంగా చేతిలో ఉన్న కెమేరా కిందకొట్టి పారిపోవాలనిపించింది అతనికి.

''ఏమండీ! మాట్లాడరేం....నేను బాగా లేనా....'' ఆ గొంతు వినగానే మధ్యాహ్నం ఎండలో కూర్చుని ఏడుస్తున్న శ్యామల జ్ఞాపకాని కొచ్చింది. ఒక్కసారిగా జాలేసిందతనికి!

''ఏమండీ! ఫోటో తీయరూ!'' ఏడుపు గొంతుకతో అంది శ్యామల.

అటూ, ఇటూ చూశాడు అతను.

''నేను ఎవరికన్నా చెప్తానని భయపడు తున్నారా? నేనెవరికీ చెప్పను లెండి. ఒట్టు....'' ఆశగా అంటున్న ఆమె గొంతు వినగానే—

''ఛా! ఛా! అదేం లేదు. అదిగో ఆ పిట్ట గోడకానుకుని నించో'' అని తోచిన అయిడియా చెప్పి నిజంగానే ఫోటో తీశాడు సుధాకర్. కెమెరాలో రీలు తిప్పుతున్న అతన్ని చూస్తూ ''ఏదండీ ఫోటో....'' ఆశగా చెయ్యి చాచింది.

''ఇప్పుడే రాదు. మా ఊరు వెళ్ళిం తరువాత పంపుతాలే. సరే నువ్వెళ్ళు ఇంక....'' అని వెనక్కి తిరగబోయాడు అతను.

''ఏమండీ!''

మళ్ళీ ఏమిటన్నట్లు వెనక్కి చూశాడు.

''అందర్నీ ఫోటో తీస్తారు. మీరు తీయించు కోరా! మీరు ఫోటోలో ఎంత అందంగా ఉంటారో తెలుసా?....''

ఆ అమ్మాయి మాటలకు అదిరిపోయాడు. ఇంతవరకు కెమేరా కొన్న తరువాత ఫోటో తీయించుకునే వాళ్ళే కానీ, అతన్ని గురించి ఆలోచించిన వాళ్ళు లేరు. ఈ శ్యామల.... ఈ అనాకారి పిల్ల, నా ఫోటో గురించి ఆలో చిస్తోందా? అనిపించింది. ఏదో చెప్పాలని మాట్లాడబోయాడు.

''శ్యామలా!'' అని వాళ్ళమ్మ గొంతు విన గానే పరుగెత్తింది శ్యామల. దూరమౌతున్న ఆమె పాంజేబు పట్టీల సవ్వడి వింటూ అలాగే చాలాసేపు నిలబడి కిందికి వచ్చేశాడు సుధాకర్.

ఆ తరవాత రెండు రోజులు అతనికి ప్రయాణ సన్నాహాలతోనూ, బంధువుల ఇళ్ళల్లో భోజనాలు, అనూ వాళ్ళతో వన భోజనం.... వీటితోనే సరిపోయింది. ఆ మూడో సాయంత్రం గూడు బండిలో రైల్వే స్టేషనుకు వెడుతున్న అతనికి కరణంగారి వాకిట్లో తారాడిన నీడ శ్యామలలా అనిపించినా, మిగతా అనేక విష యాలలో ఆ దేం పట్టించుకోలేదతను.

బొంబాయి వచ్చిన నెలరోజులకు—

''బావా! నీకీ విషయం తెలుసా! కరణంగారి శ్యామల చచ్చిపోయింది. ఏదో డిఫ్తీరియాట. పాపం ఇరవైనాలుగు గంటల్లో ప్రాణం పోయింది. అది పోయినందుకు వాళ్ళింట్లో ఎవరికీ విచారం లేదనుకో. పోయే ముందు నన్ను పిలిచి, 'మీ బావను నా ఫోటో అడుగు' అని రాసి చూపిం చింది. దానికి నువ్వు ఫోటో తీశావా? మాకెవరికీ చెప్పలేదేం బావా! పాపం అమాయకురాలు....'' ఈ రకంగా ఉన్న ఆ ఉత్తరం చూడగానే కళ్ళు నీళ్ళు తిరిగాయి అతనికి. ఆరోజే ప్రింటు అయి వచ్చిన ఫోటోల కవరు తీసి మెల్లిగా అన్ని ఫోటోలు చూస్తూ శ్యామల ఫోటో దగ్గర ఆగి పోయాడతను. చాలా క్లియర్‌గా వచ్చింది బొమ్మ! శ్యామలలాగే ఉంది. ''ఏమండీ! నా ఫోటో బావుందా?'' ఎవరో అన్నట్లనిపించింది. అలాగే దాన్నే చూస్తూ కూర్చున్నాడతను చాలాసేపు.

*

''ఇంత అందవికారమైన అమ్మాయి 'ఫోటోకి ప్రైజ్ ఎలా వచ్చిందా అని చూస్తున్నావా? ఆ ఫోటో పరిశీలించి చూడు. అందులో ఏం కనబడుతోంది? లైఫ్....జీవితం. జీవితం మీద ఆశ....ఆ అలంకరణం, ఆ శ్రద్ధ చూడు. అదొక విచిత్రమైన అనుభూతి....ఆ కళ్ళు.... ముఖ్యంగా ఆ కళ్ళు చూడు....ఎంత తృష్ణ? ఎంత కోరిక? ఎంతో ఇష్టమైన వ్యక్తిని ఎవర్నో ఎంత ఆరాధనగా చూస్తోందో చూడు ఆ పిల్ల.... అందుకే అన్నారండీ 'కెమేరా ఐ' అని. జీవితంలో మామూలుగా ఉండేవాటిని కెమేరా అద్భుతంగా కనిపెడుతుంది. ఏం ఫోటో అండీ? ఊరికే ఇచ్చారటండీ ప్రైజు?'' ఎవరో ఇద్దరు నడి వయస్సు వ్యక్తులు ఇలా ఆ ఫోటో ముందు నిలబడి మాట్లాడుకుంటున్నారు.

అక్కడే కొద్ది దూరంలో ఒక స్తంభానికి ఆనుకుని, చేతులు కట్టుకుని నిలబడి, వారి మాటలే వింటూ ఆ ఫోటో వంకే చూస్తున్నాడు ఒక యువకుడు.

అది ఫోటో ఎగ్జిబిషన్.

ఆ యువకుడు సుధాకర్. □

ఆ రోజుల్లో మనదేశంలోని వివిధ రాజ్యాలను తమ మేధా సంపదతో, ధైర్య సాహసాలతో ఏలిన వనితలు ఎందరో వున్నారు. వారిలో అగ్రగణ్యులుగా పేర్కొనదగినవారు- ఝాన్సీ లక్ష్మీబాయి, రాణి రుద్రమదేవి, రాణి చెన్నమ్మ, మంగమ్మ మొదలైన వారు. ఆ కోవకు చెందిన వీర వనితే – హోల్కర్ రాజ్యాన్ని పరిపాలించిన అహల్యాబాయి. ఆగస్ట్ 13న జరిగిన ఆమె వర్ధంతి సందర్భంగా ప్రచురిస్తున్న వ్యాసం యిది:

1725లో మహారాష్ట్రలోని ఔరంగాబాద్ జిల్లా చౌండీ గ్రామంలో జన్మించింది అహల్యాబాయి. ఆమె తండ్రి మనకోజీ షిండే, తల్లి సుశీలాదేవి.



# అహల్యాబాయి హోల్కర్

ఆమెది సామాన్య కుటుంబం. దైవభక్తి పరాయణులైన తలిదండ్రుల సాంగత్యం వల్ల ఆమెకూ చిన్నప్పటి నుంచి భక్తి ప్రపత్తులు ఏర్పడ్డాయి.

ప్రతిరోజూ ఆ గ్రామంలోని శివాలయానికి వెళ్ళి దేవుణ్ణి దర్శించుకోవడం ఆమెకు అలవాటు. అలా క్రమం తప్పకుండా గుడికి వెళుతున్న అహల్యాబాయి జీవితంలో ఒకరోజు ఒక విచిత్రమైన సంఘటన జరిగింది. అది ఆమె భావి జీవితాన్నే మార్చివేసింది. అప్పుడామె వయసు ఎనిమిదేళ్ళు!

ఒకరోజు హోల్కర్ రాజ్యాధినేత అయిన మలహర్‌రావు హోల్కర్ ఆ దేవాలయానికి రావటం తటస్థించింది. ఆ బాలిక దైవభక్తి పరాయణత, నమ్రత చూసి ఆయన ముగ్ధుడయ్యాడు.

మలహర్‌రావుకి ఖండేరావు అనే పుత్రుడున్నాడు. హోల్కర్ రాజ్యానికి వారసుడు అతనొక్కడే. కాని ఖండేరావు విషయలోలుడై భోగవిలాసాలకు తప్ప మరెందుకు పనికిరాని వాడుగా తయారయ్యాడు. మలహర్‌రావుకి అతను ఒక పెద్ద సమస్యగా పరిణమించాడు.

చాలాకాలంగా ఆయనలో ఒక ఆలోచన గూడు కట్టుకుని వుంది. కుమారుడికి వివాహం చేస్తే బాగుపడతాడేమోనని. అహల్యాబాయిని చూడగానే ఆమే తనకు కోడలుగా రావడానికి అర్హతగలది అని అనిపించింది మలహర్‌రావుకి. 'రాజు తలుచుకుంటే....' అన్నట్లు వెంటనే ఆమె గురించి వివరాలు సేకరించి అహల్యాబాయిని కోడలుగా తెచ్చుకున్నాడు.

అహల్యాబాయి అంత పిన్న వయసులో అత్తింట అడుగుపెట్టినా – అందరి ఆదరాభిమానాలూ చూరగొంది. అంతేకాదు; భర్తను చెడు అలవాట్ల నుంచి తప్పించి సన్మార్గంలోకి మళ్ళించడంలో చాలావరకు కృతకృత్యురాలు కాగలిగింది. ఆమె రాకతో అదృష్టదేవత ఆ యింట అడుగు పెట్టిందని భావించారు అందరూ. ఆమెకు ఒక కుమారుడు, కుమార్తె జన్మించారు. వారు మాలెరావు, ముక్తాబాయి.

మలహర్‌రావు ఆమె బుద్ధికుశలతను, విషయగ్రహణశక్తినీ చూసి ముగ్ధుడై ఆమెకు రాచకార్యాలలోనే కాక రణరంగ విద్యలో కూడా శిక్షణ యిచ్చాడు. మామగారు రాజధానీ నగరంలో లేనప్పుడల్లా అహల్యాబాయి రాచకార్యాలు చక్కబెట్టేది. ఆమె ఆయనతోపాటు యుద్ధాలలో పాల్గొని తన ధైర్యసాహసాలు, నేర్పరితనం ప్రదర్శించేది. తీరిక లభించినప్పుడల్లా తన దైవ చింతన, తీర్థయాత్రలూ కొనసాగిస్తూనే వుండేది.

ఇలా వుండగా 1754 మార్చి నెలలో సూరజ్ కోట ముట్టడిలో యుద్ధం చేస్తూ ఆమె భర్త ఖండేరావు వీరమరణం చెందాడు. అతని మరణం మలహర్‌రావుని, అహల్యాబాయినీ దుఃఖ సాగరంలో ముంచింది. అప్పటి ఆచారం ప్రకారం అహల్యాబాయి సతీసహగమనం చెయ్యబోయింది. కాని మలహర్‌రావు ఆమె కూడా లేకపోతే తన రాజ్యం, గృహం ఏమవుతుందో ఊహించుకుని శతవిధాల ప్రాధేయపడ్డాడు. చనిపోయి సాధించేది ఏమీలేదని, బ్రతికి తన కర్తవ్యాన్ని నిర్వహించడం వివేకమనీ ఆమె భావించి అందుకు అంగీకరించింది. తన భౌతిక కాయం తప్ప యితర సుఖ సంతోషాలను, ఆభరణాలను భర్త చితికి ఆహుతి చేసింది. శ్వేత వస్త్రాలు

# వేపుడు కూరలు....జాగ్రత్త

మామూలుగా ఉడకబెట్టిన కాయగూరలకన్న నూనెలో దోరగా వేయించిన వేపుడు కూరలంటే ప్రతి వొక్కరికి యిష్టంగా వుంటుంది. రుచికరమైన ఈ వేపుడు కూరలను అమితాసక్తితో భుజించడం ఆ తర్వాత అజీర్ణంతో బాధ పడటం మామూలే. ఈ వేపుడు కూరలు కేవలం అజీర్ణానికే కాకుండా అనేక వ్యాధులకు హేతువులు.

వేడి నూనెలు, గాలిలో వున్న ఆమ్లజనితో కలిసి హానికరమైన పెరాక్సైడులను తయారు జేస్తాయి. ఈ పెరాక్సైడులు కూరలతోపాటు శరీరంలోనికి పోయి, ఇతర అంశాలతో కలిసి మరిన్ని విషపూరితాలను తయారుచేసి మానవుని శరీరంలో అవక తవకలను కలిగిస్తాయి.

వేపుడుకు వుపయోగించే మూకుడు, పెనం లాంటి లోహ పాత్రలు బాగా వేడెక్కిన తర్వాత వాటిలో నూనెను పొయ్యడం చాలామందికి అలవాటు. నూనెలు ''ఫ్యాటీ ఆసిడ్స్'' అను అంశాలతో తయారైనవి. వేడివలన విడివిడిగా వున్న ఈ అంశాలన్నీ గొలుసు కట్టువలె అల్లుకొని సాచ్యురేటెడ్ నూనెలుగా మారతాయి. ఈ నూనెలు సులువుగా జీర్ణం కావు. అంతేగాక సాచ్యురేటెడ్ నూనెలలో గల ''కొలెస్టరాల్'' అనే క్రొవ్వు పదార్థం రక్తనాడులలో పేరుకొని రక్త ప్రసరణనికి అడ్డుపడి రక్తపు పోటు, చివరికి గుండె జబ్బులను కలిగిస్తుంది.

అప్పుడప్పుడు కూరగాయలు, వడియాలు, అప్పడాలు నూనెలో వేయించినప్పుడు మాడి నల్లగా మారవచ్చును. పచ్చళ్ళకై వంకాయ, బీర, దోస, కాకర లాంటి కూరగాయలను, షర్బత్తులకై మామిడికాయలను చేపల కూరలకు ఉల్లిగడ్డను ఎర్రని నిప్పుపైననో లేక కుమ్ములో వుంచి కాల్చడం పరిపాటి. ఈ విధంగా నల్లగా మాడిన పదార్థాలను తింటే క్యాన్సర్ వ్యాధి రావచ్చునని డాక్టర్ల అభిప్రాయం.

ఈ విషయాల దృష్ట్యా మనం వేపుడు కూరలను మాని వాటి స్థానంలో నీటి ఆవిరిలో ఉడికించిన కాయ కూరలను తీసుకుంటే అందులోని విటమినులు వృధా కాకపోవడమే కాకుండా ఆరోగ్యాభివృద్ధి కూడా జరుగుతుంది.

—స్వరూపా సాగర్

---

ధరించింది.

గోరు చుట్టపై రోకటిపోటులా కుమారుడి మరణం తరువాత కోలుకోని మలహరరావు. ఆ తరువాత మాలెరావు మరణించారు. మాలెరావుకి వివాహమయినా సంతానం లేదు. దాంతో హోల్కర్ రాజ్యాన్ని చుట్టుపక్కల రాజులు కబళిద్దామని ప్రయత్నించారు.

ఆ ప్రయత్నంగానే రఘోభా, చంద్రచూడ్ అనే సామంతులు హోల్కర్‌ను ముట్టడించడానికి తమ సైన్యాలతో వచ్చారు. అహల్యాబాయికి ధైర్య సాహసాలు, ప్రజల అండదండలు అయితే వున్నాయి కానీ యుద్ధానికి సిద్ధమయ్యేటంత వ్యవధీ, వారితో సరితూగగల అంగబలమూ లేవు. ఆమె తన రాజనీతి చతురత ప్రదర్శించ దలచి రఘోభాకి ఒక ఉత్తరం పంపింది.

''మీరు నా రాజ్యాన్ని కబళించాలని వస్తున్నట్లు తెలిసింది. నేను స్త్రీని అన్న నిర్లక్ష్య భావం మీలో వున్నట్లు వుంది. మా రాజ్యంలోని ప్రజల కొన వూపిరి వున్నంత కాలం మీరీ రాజ్యాన్ని ఆక్రమించలేరు. పైపెచ్చు మీరు ఒక స్త్రీ నాయకత్వం వహించే సైన్యంతో పోరాడబోతున్నారు. ఓడిపోతే నాకు వాటిల్లే నష్టం కన్నా నేను గెలిస్తే మీకు వాటిల్లే అవమానం అధికంగా వుంటుంది. ఒక స్త్రీ చేతిలో ఓడిపోయారనే అపవాదు తరతరాలుగా మీ వంశానికి మాయని మచ్చగా నిలుస్తుంది. బాగా ఆలోచించుకోండి'' – ఇదీ ఆ ఉత్తరం సారాంశం.

దాంతో రఘోభా హడలిపోయాడు. ఎందుకొచ్చిన గొడవ అనుకుని ''మీకు కలిగిన పుత్ర శోకానికి సానుభూతి తెలుపుకుందామని వస్తున్నాను కాని, యుద్ధానికి కాదు'' అని కబురంపించాడు.

ఆ తరువాత అహల్యాబాయి కోరిక మేరకు సైన్యాన్ని పొలిమేరలలో విడిచిపెట్టి తనొక్కడే వెళ్ళి ఆమెను పరామర్శించి వెళ్ళాడు. ఈ విషయం తెలిసిన చంద్రచూడ రాజు కూడా యాత్రా నెపంతో వచ్చినట్టుగా వచ్చి ఆమెను దర్శించి వెళ్ళాడు.

ఈ విధంగా ఆమె తన రాజనీతి చతురతతో ఒక ఘోర యుద్ధాన్ని ఆపగలిగింది.

ఆమె తన రాజధానిని ఇండోర్ నుంచి ప్రశాంతమైన యాత్రాస్థలం – మహేశ్వర్‌కు మార్చింది. అహల్యాబాయి జీర్ణావస్థలో వున్న దేవాలయాలను పునరుద్ధరించడమే కాక నూతన దేవాలయాలను నిర్మించింది.

ఒక సందర్భంలో ఆమె, తన కుటుంబం కన్న రాజ్యం మిన్న అని నిరూపించింది. ఆమె రాజ్యంలో బందిపోటు దొంగల బెడద అధికమైంది. అప్పుడామె ఈ విధంగా ప్రకటన చేసింది– 'ఎవరైతే ఆ బందిపోటు దొంగలను అరికడతారో వారికి–నా కుమార్తెనిచ్చి వివాహం చేస్తాను'– యశ్వంతరావు అనే సుందర యువకుడు ఆవిధంగా ముక్తాబాయిని వివాహమాడాడు!

ఆమె దర్బారులో వేదాంత, సాహిత్య వేత్తలు, పండితులు అనేకులు వుండేవారు. వారిలో మరాఠీ కవి మోరోపంత్, సంస్కృత కవి ఖుషాలిరామ్ ప్రఖ్యాత గాయకుడు అనంతపాందే పేర్కొనదగ్గ వారు. ఖుషాలిరామ్ 'అహల్యా కామధేను' పేరిట ఒక గ్రంధాన్ని రచించాడు.

ప్రజలను కన్న బిడ్డలలాగా పాలించిన అహల్యాబాయి ఆగస్టు 13, 1795న దివంగతురాలయింది.

సామాన్య కుటుంబంలో జన్మించడం వల్ల ప్రజల కష్ట సుఖాలు ఆమెకు బాగా తెలుసు. వారి సంతోషమే తన భాగ్యంగా భావించి రాజ్యమేలిన అహల్యాబాయిని ఆమె ప్రజ మరువలేదు. అందుకు నిదర్శనం–ఆమె జ్ఞాపకార్థం గయ, మహేశ్వర్‌ల లోని శివ, విష్ణు దేవాలయాలలో ఆమె ప్రతిమలను కూడా ప్రతిష్ఠించి నేటికీ పూజించడం!

—కోలారు నాగరత్నమ్మ



# ఖైదులో స్త్రీల జీవితం ఎలా వుంటుంది?

'ఆమె భర్త ఆమెను అంత క్రూరంగా హింసించకపోతే ఆమె అతన్ని హతమార్చి వుండేది కాదుకదా' — ఇది మనస్తత్వశాస్త్ర వేత్తల వాదం.

'ఏ మనిషికీ మరో మనిషి ప్రాణం తీసే అధికారం లేదు'—ఇది న్యాయశాస్త్ర వేత్తల తర్కం.

'ఏది ఏమైనా చేసిన నేరానికి శిక్ష అనుభవించక తప్పదు'—ఇది లోకం రివాజు.

నిజమే. కాని వారు ఆ నేరాలు చేయడానికి కారణం ఏమిటి? అందులో ముఖ్యంగా స్త్రీలు కూడా ఘోర నేరాలు చేస్తున్నారూ – అంటే, దాని వెనుక ఏదో బలవత్తరమైన కారణమే వుండి వుండాలి గదా.

అత్తగారి అమానుషం భరించలేక ఆమెను ఉద్రేకంలో హతమార్చడం, భర్త హింసా ప్రవర్తనకు వెగటుపుట్టి ఆవేశంలో అతన్ని పరిమార్చడం, దారిద్ర్యం భరించలేక పిల్లలతో పాటు ఆత్మహత్య చేసుకోబోవడం, వాళ్ళను కోల్పోయి, తను బ్రతకడం – యావజ్జీవ శిక్ష అనుభవిస్తున్న యిటువంటివారి గురించి అడపా తడపా వార్తా పత్రికలలో వస్తూనే వుంటాయి.

వీరేకాదు – పతితలు, భ్రష్టులు, బాధాసర్ప దష్టులు – ఇలా వివిధ వర్గాలకు చెందిన స్త్రీలు పరిస్థితుల ప్రాబల్యంతో నేరం చేయడం, జైలు పాలు కావడం జరుగుతోంది.

ఇటువంటివారు చేసిన నేరాలకు శిక్ష విధించే ముందు, సామాజిక దృష్ట్యా వీరు చేసిన నేరాలు పరిశీలించాలని అంటారు-మనస్తత్వశాస్త్ర వేత్తలు.

నేరాలు చేసిన వ్యక్తులు—స్త్రీలుగానీ పురుషులు గానీ—వారికి తాము చేసిన తప్పులు సరిదిద్దుకునే అవకాశం లేకపోలేదు. కాని సమాజం దృష్టిలో వారు దుర్మార్గులు, దుష్టులు. అలా కాకుండా వారి నడవడికలో మార్పుతెచ్చి సన్మార్గానికి తిప్పి వారిని మామూలు మనుషులుగా చేసి పంపించడానికి మార్గం లేదా?—అంటే వుంది.

వారి జీవితాలు సరైన పంథాలోకి దిద్దుకునే అవకాశం కల్పించేవే – రాజమంద్రి జైలు వంటి జైళ్ళు!

"ఇక్కడి ఖైదీలు చేసిన నేరాన్ని, వాళ్ళు ఆ నేరం చేయడానికి దోహదం చేసిన పరిస్థితుల గురించి ముందు మేము తెలుసుకుంటాము. మళ్ళా ఎటువంటి నేరమూ చేయకూడదని వాళ్ళకి బోధిస్తాము. అంతేకాదు. వాళ్ళల్లో పరివర్తన తేవడానికి కావలసిన ప్రయత్నాలు అన్నీ చేస్తాము. జైలులో కొందరికి వారి సత్ప్రవర్తననుబట్టి శిక్షా కాలం తగ్గించగం కూడా జరుగుతుంది. వారి శిక్షాకాలం పూర్తయిన తరువాత–వారి జీవితాలు సుగమం కావడానికి వీలుగా కొన్ని వృత్తి విద్యలలో శిక్షణ యిప్పిస్తాము. అలా అవి నేర్చుకోవడం వల్ల జైలు గోడలు దాటి వెళ్ళిన తరువాత వారు ఉపాధికోసం వెతుక్కోవల్సిన అవసరం ఏర్పడదు. తాము నేర్చిన విద్యని ఆలంబనగా చేసుకుని వారు తమ భావి జీవితాన్ని సక్రమమార్గంలో గడపవచ్చును" అని చెప్పారు 'వనిత'కు సి. ఎన్. సరోజిని. ఆమె రాజమంద్రి స్త్రీల జైలు సంక్షేమ అధికారిణి.

ఒకప్పుడు దాదాపు రెండు వందలమంది దాకా వుండే ఈ జైలులో ప్రస్తుతం 36 మంది ఖైదీలు వున్నారు. వారిలో 17 మంది యావజ్జీవ శిక్ష అనుభవిస్తున్నారు.

'జైలు అంటే స్వర్గధామం కాకపోవచ్చును. కాని అది నరకం మాత్రం కాదు. నేరస్తులు కూడా సాధారణమైన జీవితాన్ని గడపగలరు. శిక్షా పరిమితి పూర్తయి విడుదలైన ఖైదీలు–తమ గత జీవితానికి స్వస్తి చెప్పి, సజ్జనులుగా జీవించడానికి దోహదం చేసే విధంగా ఉపాధి పథకాలు కల్పించేందుకు కొన్ని ప్రణాళికలు అమలు జరిపాము. మరి కొన్ని త్వరలో ప్రారంభించబోతున్నాము' అని రాజమంద్రి సెంట్రల్ జైలు పర్యవేక్షణాధికారి శ్రీ కృష్ణాజిరావు చెప్పారు.

అక్కడ యావజ్జీవ శిక్ష అనుభవిస్తున్న 50 మంది మగ ఖైదీలు గత సంవత్సరం తుపాను బాధితుల సహాయార్థం దివి సీమకు వెళ్ళారు. ఆ విధంగా అక్కడకు వెళ్ళిన మొదటి బృందం ఖైదీలు కావడం విశేషం!

రాజమంద్రి జైలులో, ఖైదీల వ్యవహారాలు చూసేందుకు-జైలు సూపరింటెండెంట్, అసిస్టెంట్ మాట్రన్, వెల్‌ఫేర్ ఆఫీసర్ కాక పదిహేను మంది వార్డర్లు కూడా వున్నారు.

అక్కడి జైలులోని ఖైదీల నిత్యకృత్యాలు ఉదయం 5–50 కి ప్రారంభమవుతాయి. జైలు పరిసరాలు పరిశుభ్రపరచిన తరవాత ఖైదీలకు ఏడుగంటలకు అల్పాహారం యివ్వబడుతుంది. ఆ తరువాత జైలులోనే వున్న వర్క్‌షాప్‌కి వెళ్ళి రాట్నాలు తిప్పి దారం వడికేవారు ఆ పని చేస్తారు. వీరికి పని నేర్పించడానికి-తర్ఫీదుపొందిన వార్డర్స్ వున్నారు. యావజ్జీవ శిక్ష అనుభవిస్తున్న ఖైదీలు మాత్రం రాట్నం విధిగా వడికితీరాలి!

అలాగే చదువుకోవాలన్న ఆకాంక్ష గలవారికి అక్షరజ్ఞానం కల్పించడానికి అనువుగా ఒక విద్యాలయం వుంది. గత సంవత్సరం ఈ జైలు నుంచి మెట్రిక్ పరీక్షలకు ఒక యువతి హాజరై ఉత్తీర్ణురాలైంది కూడా. ఈ సంవత్సరం మరో యువతి ఆ పరీక్షలకు హాజరైంది. ట్రైనింగ్ పొందిన టీచర్లు అక్షరం రానివారికి కూడా

చదువు నేర్పించి — వారు విడుదల అయ్యే సమయానికి శుభ్రంగా పుస్తకాలు చదవగల జ్ఞానాన్ని కలిగిస్తున్నారు.

లేసులు అల్లి అందమైన పువ్వులు అల్లేవారు కొందరైతే, ప్లాస్టిక్ వైర్‌తో రకరకాల బుట్టలు అల్లేవారు మరి కొందరు.

పదకొండు గంటలకల్లా ఈ పనులు ముగించుకుని—మధ్యాహ్నం భోజనం పూర్తయిన తరువాత రెండు గంటలవరకు విశ్రాంతి తీసుకుంటారు. ఆ తరువాత ఎవరి పనులలోకి వాళ్ళు వెళతారన్న మాట.

కొందరు ఖైదీలు నేరం చేసి పట్టుబడ్డప్పుడు గర్భవతులుగా వుంటే జైలులోనే వారికి పురుడు పోయడం జరుగుతుంది—అందుకు తగ్గ ఏర్పాట్లన్నీ ఈ జైలులో వున్నాయి. గర్భవతులైన ముగ్గురు ఖైదీలు ఈ జైలులోనే ప్రసవించారు కూడా!

అలా పుట్టిన పిల్లలను ఐదు సంవత్సరాలు వచ్చేవరకు జైలులోనే తల్లి దగ్గర వుంచుతారు. వారికి కావలసినవి చూసే బాధ్యత జైలు అధికారులే స్వీకరిస్తారు. ఆ పిల్లలకు ఉదయం, సాయంకాలం — పాలు, గ్రుడ్లు, అరటి పళ్ళు, బిస్కత్తులు, పెరుగుతో భోజనం, బలానికి మందులు యిస్తారు. వారు ఆడుకోవడానికి జారుడు బల్ల, సీ-సా, ఉయ్యాల, రంగులరాట్నం, చెక్క గుర్రాలు, హంసలు—యిలా అనేక రకాల బొమ్మలు జైలు ఆవరణలోనే అమర్చబడ్డాయి.

ఈ పిల్లల సంరక్షణకు ఒక స్టాఫ్ నర్స్ వున్నారు. వారికి ఎటువంటి రోగాలూ రాకుండా ఎప్పటికప్పుడు వారి ఆరోగ్య విషయాలు చూసుకుంటూ వుండడానికి లేడీ డాక్టర్ వున్నారు.

ఐదు సంవత్సరాలు నిండిన పిల్లల్ని తమ తల్లులతో బాటు జైలులో వుంచడం చట్టవిరుద్ధం. అందువల్ల, వారి తల్లుల అనుమతితో ఆ పిల్లల్ని వాళ్ళ బంధువులకు అప్పగించడం జరుగుతుంది.

రోగగ్రస్తులైన ఖైదీల బాగోగులు చూసుకునేందుకు జైలు లోపలే ఒక మెడికల్ వార్డ్ వుంది. ఈ మెడికల్ వార్డ్ నిర్వహించేందుకు ఒక లేడీ డాక్టరు, స్టాఫ్ నర్స్, ఇద్దరు నర్సింగ్ ఆర్డర్లీలు వున్నారు. వ్యాధి గ్రస్తులకు మామూలుగా యిచ్చే 'ఆహారం కాకుండా—ప్రత్యేకంగా పాలు, గ్రుడ్లు, పళ్ళు మొదలైనవి యిస్తారు.

రాజమండ్రి జైలు చూసిన వారికి — జైలు వాతావరణానికి, ఆశ్రమ వాతావరణానికి చాలా దగ్గర పోలికలు వున్నాయి అనిపిస్తుంది. అందుకు కారణం—జైలు లోపల అందమైన గులాబీలు, చామంతులు, రకరకాల ఫలవృక్షాలు—చూడడానికి అందంగానూ, కన్నుల పండువగానూ వుండడమే. ఇక్కడి తోటలో పండించిన కాయగూరలు, ఆకుకూరలు ఖైదీలు తమ వంటకు ఉపయోగిస్తూ వుంటారు.

ఖైదీల మానసికోల్లాసానికి అడపా దడపా చక్కటి చలనచిత్రాలను జైలు ఆవరణలోనే ప్రదర్శించి చూపుతూ వుంటారు. అంతేకాక సాయం సమయంలో వారికి ఇండోర్ గేమ్స్, అవుట్‌డోర్ గేమ్స్ ఆడుకునేందుకు కూడా వసతి కల్పించబడింది.

ఈ ఆటలు అయిన తరువాత స్నానాలు ముగించుకుని భోజనానికి వెళతారు. ఆరున్నరకంతా ఖైదీలందరూ లాకప్‌లోకి వెళతారు. ఆ తరువాత ఎవరికి వచ్చిన పాటలు, కథలతో రాత్రి నిద్ర ముంచుకు వచ్చేవరకు గడుపుతారు.

ఇక తమ బంధువుల యోగ క్షేమాలు కనుక్కునేందుకు వారికి నెలకు రెండుసార్లు ఉత్తరాలు రాసుకునే వీలు కల్పించబడుతుంది. బంధువులు, స్నేహితులు వారిని చూడటానికి జైలుకు రావచ్చును. అలా ఎవరూ రాని వారు మాత్రం వారానికో ఉత్తరం రాసుకోవచ్చును.

ఇక్కడి జైలులోని ఖైదీల రోజువారీ జీవితం ఈ విధంగా వుంటుంది—బాగానే వుంది. కాని వారు జైలు నుండి విడుదలై బయటకు వచ్చిన తరువాత సంగతేమిటి?

''వివిధ రకాల, ప్లాస్టిక్ వైర్ బ్యాగులు, బుట్టలు, లేసులు అల్లడంలోనూ, ఎంబ్రాయిడరీ, స్పాంజితో బొమ్మలు చేయడంలోనూ, ఈత చాపలు అల్లడంలోనూ, చర్ఖా వడకడంలోనూ — వీరికి శిక్షణ గరపుతున్నాము. త్వరలో చాక్‌పీస్ యూనిట్ కూడా ప్రారంభిస్తున్నాము. ఈ మధ్యనే ఖాదీ బోర్డు వారు ఆధునిక పద్ధతిలో తయారు కాబడిన చర్ఖాలను బహూకరించారు. ఆ విధంగా యిక్కడ తయారైన నూలు కూడా ఖాదీ బోర్డు వారే కొనుగోలు చేస్తూ వుంటారు'' అన్నారు సరోజిని అందుకు సమాధానంగా.

ఇలా వీరు తయారు చేసిన వస్తువులు మార్కెట్‌లో లభించేటట్లు చేయడంవల్ల వాటిని అనేకులు కొనుక్కుంటూ వుంటారు.

వీరు తయారు చేసిన ప్లాస్టిక్ వైరు బ్యాగులు కాని, స్పాంజి బొమ్మలు, లేసులు — ఏవీ కూడా నాణ్యతలోగానీ, ఆకర్షణలోగానీ, బజారులో వస్తువులకు ఏమాత్రం తీసిపోవు.

ప్రభుత్వం జైలులో ఖైదీలకు వివిధ వ్యాసంగాలలో శిక్షణ యివ్వడంతో ఊరుకోక — వారు విడుదలైన తరువాత వారి పునరావాసానికి తగ్గ పథకాలు రూపొందించాలి. వారికి ప్రభుత్వ యంత్రాంగాలలో ఉద్యోగావకాశాలు కానీ, స్వయం ఉపాధి కల్పనకు కుటీర పరిశ్రమలు వంటివి స్థాపించుకునేందుకు రుణాలుగానీ యివ్వాలి.

ఆ విధంగానే మహిళా సమాజాలు, స్త్రీ జన సంక్షేమ సంస్థలూ, జైలునుంచి విడుదలయి వచ్చిన వారిని చీడ పురుగులుగా భావించి చీదరించుకోకుండా మానవతా దృష్టితో చూడాలి. అసలు వనితా లోకానికి, సమాజానికి సేవచేసే ఉద్దేశ్యంతోనే తాము ఈ సంక్షేమ సంస్థలను ప్రారంభించామన్న విషయాన్ని వారు మరువకూడదు.

మహిళా మండలులు — వీరు తయారు చేసిన వస్తువులకు విరివిగా ఆదరణ లభించేటట్లు చెయ్యాలి. అప్పుడే ఈ ఖైదీలకు ఉత్సాహం కలుగుతుంది; తమ శక్తి ' సామర్థ్యాల మీద నమ్మకం ఏర్పడుతుంది.

అలా జరిగిననాడు — వారు జైలు నుండి విడుదలైన తరువాత, ఏదో కొత్త ప్రపంచంలోకి — తమను వెలివేసేటట్లు చూసే ప్రపంచంలోకి — అడుగుపెడుతున్న అనుభూతికి లోను కావడం జరగదు. □





# బామ్మగారి పేజీ

## ప్రశ్నలకు జవాబులు

**జి. జానకి, విజయవాడ**

**మా తమ్ముని ఇల్లు కింద వేసిన బొమ్మలోలా వున్నది. ఈ మధ్యనే ఈశాన్యం మూల బోరింగ్ పంపు వేయించాడు. తప్పనిసరి పరిస్థితుల్లో ఇలా ఇల్లు కట్టక తప్ప లేదంటాడు. ఇందులో దోషాలు వుంటే చెప్పగలరా?**




బొమ్మ ప్రకారం ఇది త్రికోణాకారపు స్థలం. తూర్పు వైపుకు పొడుగ్గా పెరిగింది. ఉత్తర దక్షిణ భుజాలు పొడవుగా వున్నాయి; పడమర కురచగా వుంది. ఉత్తర దక్షిణ భుజాలు సమంగా వుండడం మంచిది. ఇలాంటి స్థలంలో తూర్పు భాగంలో ఎక్కువ వైశాల్యం వుండేలా చూసుకోవాలి. ఉత్తర లేక దక్షిణాభిముఖంగా కట్టుకోవాలి. దక్షిణం, పడమర దిక్కులవేపు తక్కువ ఖాళీని, ఉత్తరం, తూర్పు దిక్కులవేపు ఎక్కువ ఖాళీని వుంచి, ఇల్లు కట్టుకోవాలి. ఈశాన్యంలో బోరింగు పంపు వెయ్యడం కొంత వరకూ మంచిదే. స్థలం, ఇంటికి సంబంధించిన—కచ్చితమైన కొలతలు, వివరాలూ చెబితే—ఇంకా వివరంగా చెప్పగలను.

**వి. సుబ్బరత్నం, కడప**

**బామ్మగారూ! మీ కాలం స్త్రీలు చిన్నతనంలోనే పెళ్ళిళ్ళు చేసుకుని, పిల్లల్ని కన్నా — ఇప్పటికీ పుష్టిగానే కనిపిస్తున్నారు. కాని, ఈకాలం స్త్రీలు ఆలశ్యంగా పెళ్ళిళ్ళు చేసుకుంటున్నారు; తక్కువ మంది పిల్లల్ని కంటున్నారు. అయినా బలహీనంగానే వుంటున్నారు. దీనికి కారణం ఏమిటి? ఆహార లోపాలా? ఆరోగ్య విధుల్లో తీసుకునే అజాగ్రత్తా?....**

కాలం మారిపోతోంది గదర్రా. కాలంతోపాటే విధానాల్లో, పద్ధతుల్లో తేడాలు వచ్చేశాయి. ఆహారంలో అప్పుడున్న పుష్టి ఇప్పుడు వుండడం లేదు. ఇప్పుడు మరీ, సుఖానికి అలవాటుపడిపోయి, అప్పట్లో మేము చేసినంత పని ఇప్పుడు ఎవ్వరూ చెయ్యడం లేదు. శరీరానికి వ్యాయామం వుండడం లేదు. ప్రతి చిన్న అనారోగ్యానికీ డాక్టర్లు, మందులూ! దానికితోడు పౌష్టికాహారపు కొరత; గాలిలోనూ, ధూళిలోనూ ఎక్కువగా కలుస్తున్న కాలుష్యం! వీటన్నింటికీ కారణం — జనాభా పెరుగుదల. అందుకే చెబుతున్నారు—ఇలాగే ఈ లెక్కన జనాభా పెరుగుతూ వుంటే, తర్వాత తర్వాత పుట్టే పిల్లలు మరీ బలహీనంగా పుడతారని!

**కె. జి. సరళకుమారి, కువ్వం**

**పత్తి చెట్టు ఇంట్లో పెంచితే, పత్తి పూచినట్లు ఇల్లు పూస్తుందంటారు. ఎందుకనండీ?**

ఏమీలేదు—పత్తిచెట్టు సులభంగా, ఎక్కడైనా పెరుగుతుంది. పత్తినుంచి నూలు వస్తుంది. నూలుతో గుడ్డ తయారవుతుంది. మనిషికి కావలసిన కూడు, గుడ్డల్లో ఒకటైన 'గుడ్డ' రావడానికి దోహదం చేస్తుంది గదా — అని పత్తిచెట్టు వుండడం మంచిదన్నారు పెద్దలు. పైగా పత్తిపువ్వు, గింజలూ — అనేక ఔషధాలకు పనికొస్తాయి.

**బి. గౌరి, గుంటూరు**

**మనలో చాలామంది, ఎవరికి ఏ కాస్త నలతగా వున్నా 'దిష్టి' తగిలిందంటారు. పసిపిల్లలకు, వధూవరులకూ 'దిష్టి' చుక్కలు అని పెడుతూ వుంటారు. వీటివల్ల ఫలితం వుంటుందంటారా? అసలు దిష్టి తగలడం అంటే ఏమిటి?**

ఒకరి దృష్టి ఇంకొకరి మీద పడి 'ఆహా!' అనిపించడమే దిష్టి. దృష్టి తగలడమే— దిష్టి తగలడం. ఆరోగ్యంగా పెరుగుతున్న పిల్లల్ని చూసినప్పుడు, అవతలి వాళ్ళు 'ఎంత బాగున్నారో' అంటే — ఆ పిల్లలు చిక్కిపోతారు అని అంటారు. అంచేత, పిల్లల్ని చూసినప్పుడు వాళ్ళనే ఛట్టున చూడకుండా వుంటారని, నల్లగా బొట్టుపెడితే దృష్టి, ముందు దానిమీదికి వెళ్తుందనీ నమ్మకం! ఈ నమ్మకమే వధూవరుల విషయంలోనూ వర్తిస్తుంది. ఇది కేవలం ఒక నమ్మకమే గాని — శాస్త్రీయమైన కారణం ఏమీ లేదు. ఇంటి ముందు, పంట ముందు దిష్టి బొమ్మలు పెట్టడం కూడా అందుకే! చూసేవారి దృష్టి ముందుగా దాని మీద పడడంతో—'మెచ్చుకోలు' కాస్త తగ్గడానికి అవకాశం వుంటుందని!

**బి. పద్మావతి, గుడివాడ**

**చిన్నపిల్లలకి పువ్వులు ఇవ్వకూడదని, ఇస్తే పువ్వులు వాడినట్టుగా వాడిపోతారనీ అంటారు. నిజమేనా?**

చిన్న పిల్లలకి పువ్వులు ఇవ్వకూడదు; పెట్టకూడదు. ఎంచేతంటే పిల్లలకి అవేమిటో తెలీక, నోట్లోనూ, కంట్లోనూ, చెవిలోనూ పెట్టేసుకుంటారు. పువ్వుల జాతుల్లో కొన్ని విషకరమైనవి వుండొచ్చు. లేదా, పువ్వుల్లో ఏవైనా చిన్న చిన్న పురుగులుండొచ్చు. ఇవి పిల్లల ఆరోగ్యాన్ని తొందరగా నాశనం చేస్తాయి. కొన్ని పువ్వుల వాసన పిల్లలకి పడదు. పడకపోవడం వల్ల దగ్గు, తుమ్ములూ రావడం; దాంతో ఊపిరి పీల్చడానికి అవస్థ పడడం జరుగుతుంది. ఈ కారణంగానే పిల్లలకి పువ్వులు పెట్టకూడదన్నారు; ఇవ్వకూడదన్నారు.











పాలు !

తెల్లవారి లేవగానే అవసరమయ్యే ముఖ్యమైన ఆహార పదార్థం—పాలు. సాధారణంగా పాల కేక తోనే తెల్లవారడం, నిద్రలేవడం జరుగుతుంది. పాలు ఇవాళ పట్టణాల్లో సీసాల ద్వారా లభ్యమవుతున్నాయి. ఈ పాలు వంటికి మంచివి కావనీ, త్వరగా జీర్ణంకావనీ—పట్టణ వాసులకే కొందరికి కొన్ని అనుమానాలూ సందేహాలూ వున్నాయి. ఆరోగ్య సూత్రాలకు అనుగుణంగా ఈ పాలు ఎలా సేకరింప బడతాయి? ఎలా శుద్ధి చెయ్యబడతాయి? ఎలా సరఫరా చెయ్యబడతాయి?— ఈ విషయాలను తెలియజేసేదే ఈ వ్యాసం. మన రాజధానీ నగరంలోని 'పాడి పరిశ్రమాభివృద్ధి సంస్థ' ద్వారా జరుగుతున్న పాల సేకరణ, సరఫరాల కార్యక్రమాన్ని, ఛాయాచిత్రాలతో— ఇక్కడ పొందుపరుస్తున్నాము:



# పాడిపరిశ్రమ

ఆహారం, వస్త్రం, ఇల్లు–ఇవి మనిషికి జీవితావసర వస్తువులు. ఆహారంలో మంచినీళ్ళ తర్వాత అతిముఖ్యమైన భాగం పాలు.

చంటి పిల్లలు మొదలుకొని వృద్ధులవరకు అందరికీ తెల్లారితే పాలుకావాలి. ఆవు పాలో, గేదెపాలో, మేకపాలో ఏవో ఒకటి కావాలి. చంటి పిల్లలకి తల్లిపాలు లేకపోతే, చాలకపోతే గ్లాక్సో పాలో, అముల్ పాలో, గొల్లభామ డబ్బాపాలో, మరో డబ్బాపాలో కావాలి. పెరుగుకు మజ్జిగకి, వెన్నకి, నెయ్యికి పాలుకావాలి. వీటి అన్నిటికంటే ముఖ్యంగా కాఫీకి, టీకి పాలు కావాలి. అత్యధిక సంఖ్యాకులకు బియ్యం లేకపోయినా రోజు గడుస్తుంది కాని, పాలు లేకపోతే, కాఫీయో, టీయో తాగకపోతే రోజు గడవదు. ఆ మధ్య మన జంట నగరాలలో డైరీ సిబ్బంది రెండు రోజులు సమ్మెచేస్తే ప్రజలు హాహాకారాలు చేశారు. కాఫీ గతప్రాణులు విలవిల్లాడిపోయారు.

అందుకే–పాల సరఫరాకి ఎప్పుడు ఏ అవాంతరం వస్తుందోనని, కలవారు ముందు జాగ్రత్తతో పాలపొడి డబ్బాలు స్టాకు కొనిపెట్టుకుంటారు. మొన్న సిబ్బంది సమ్మె ప్రారంభించగానే నగరంలోని అన్ని దుకాణాలలోనూ పాలడబ్బాలు ఒక్కపూటలో అమ్ముడుపోయాయి. ఇదే మంచి అదను అని ప్రైవేటు డైరీల వారు ప్రజలను యథాశక్తిని దోచివేశారు. ఆఫీసుల్లో పనులు 'చురుకు'గా

సాగలేదు. కాఫీ చుక్క పడకపోయే సరికి తిక్క తిక్కగా ఉంది. ఉద్యోగులు తలలు పట్టుకు కూర్చున్నారు. కొందరికి తలనొప్పి. కొందరికి కళ్ళు బైర్లు కమ్మి ఫైళ్ళలో అక్షరాలు కనిపించ లేదు. అంచేత, చెప్పొచ్చేదేమిటంటే — ఒక వస్తువు విలువ అది అందుబాటులో లేనప్పుడు మరీ బాగా తెలిసి వస్తుంది. అందులో నిత్యావసర వస్తువులలో కెల్లా అత్యవసర వస్తువైన పాలు లేకపోతే ఇక చెప్పాలా!

మన రాష్ట్రంలో ఓ పది పన్నెండేళ్ళ క్రితం వరకు డైరీ ఫారాలు ఎరగం. ఆవులు, గేదెలు కలవాళ్ళు ఇళ్ళకు తీసుకొచ్చి పోసేవాళ్ళు. వాళ్ళు పోసినవి పాలు, చెప్పింది ధర. పోసేవాళ్ళకి







పోయించుకునే వాళ్ళు లోకువ. పాలలో ఎన్ని నీళ్ళు కలిపినా, ధర ఎంత పెంచినా చేయగలిగిం దేమీ లేదు. ''ఏమిటయ్యా పాలు ఇలా నీళ్ళగా ఉన్నాయి?'' అని అడిగితే, ''గేదెలు ఈ మధ్య నీళ్ళు ఎక్కువ తాగేస్తున్నాయండమ్మగారూ'' అని అతగాడు సమాధానమిస్తే నోరు మూసుకుని ఊరుకోవలసిందే. గేదెలు కలవారు లేనివారిని దోచేస్తే, గేదెలు కలవారిని దళారీలు దోచేసేవారు. పట్టణాలలోని హోటళ్ళకు పాలు సరఫరా చేసే దళారీలు పల్లెల్లో రైతుల దగ్గర చౌకగా పాలు కొని, పట్టణాలలో హెచ్చు ధరకి అమ్మి లాభాలు ఆర్జించేవారు.

డైరీ ఫారాలూ, పాడి ఉత్పత్తుల ఫ్యాక్టరీలు వచ్చిన తర్వాత ఈ రకమైన దోపిడీకి అవకాశం తగ్గిపోయింది. హైదరాబాద్‌లో పాడి ఉత్పత్తుల ఫ్యాక్టరీని 1967లో ప్రారంభించారు. విజయ వాడలో ఇటువంటి ఫ్యాక్టరీని 1969లో ప్రారంభించారు. ఆ తర్వాత రాష్ట్రంలో చాలాచోట్ల పాడి ఉత్పత్తుల ఫ్యాక్టరీలు, పాల శీతలీకరణ కేంద్రాలు, చిన్న డైరీలు వెలిశాయి. ఇలా దేనికదిగా, విడివిడిగా పనిచేయడం కంటే అన్నింటినీ ఒక కేంద్ర సంస్థకు అనుబంధింప చేసి, పరస్పర సమన్వయంతో పనిచేయించడం మంచిదని భావించి రాష్ట్రప్రభుత్వం 1974 ఏప్రిల్ 2వ తేదీన ఆంధ్రప్రదేశ్ డైరీ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ (పాడి పరిశ్రమాభివృద్ధి సంస్థ)ను నెలకొల్పింది. ఈ కార్పొరేషన్‌ను నెలకొల్పక ముందు రాష్ట్రంలోని పాల పథకాలను రాష్ట్ర







ప్రభుత్వపు పాడి పరిశ్రమాభివృద్ధి విభాగం నిర్వహిస్తూ ఉండేది. కార్పొరేషన్ అవతరించిన తర్వాత పాడి పరిశ్రమకు సంబంధించిన అన్ని పథకాలు, ఫ్యాక్టరీలు, శీతలీకరణ కేంద్రాలు ఈ సంస్థ నిర్వహణ క్రిందకు వచ్చాయి.

ఈ సంస్థను నెలకొల్పడంలో ప్రభుత్వ లక్ష్యాలు ఇవి: పాల ఉత్పత్తిని పెంపొందించడం; సరఫరాను క్రమబద్ధం చేయడం; ఎటువంటి దోపిడీకి ఆస్కారం లేకుండా ఉత్పత్తిదారులకు, వాడకం దారులకు కూడా న్యాయం చేకూర్చడం.

ఉత్పత్తి పెంచడానికి కార్పొరేషన్ ఏం చేస్తుంది? దళారీలు తన దగ్గర చౌకగా కొని, పట్టణాలలో హెచ్చు ధరలకు అమ్మి లాభపడుతుంటే, తనకు గిట్టుబాటు ధర లభించకపోతే ఉత్పత్తి పెంచాలన్న ఆసక్తి రైతుకు ఎందుకు ఉంటుంది? అందుచేత దళారీలతో నిమిత్తం లేకుండా కార్పొరేషన్ నేరుగా రైతుల నుంచి న్యాయమైన ధరలకు పాలు కొంటున్నది. ఎప్పటికప్పుడు డబ్బు చెల్లిస్తుంది. ప్రతిరోజూ ఇన్ని పాలు ఇచ్చి తీరాలన్న నిబంధన లేకుండా ఎన్ని పాలు ఇచ్చినా స్వీకరిస్తుంది. ఎన్ని ఎక్కువ పాలు ఇచ్చినా సంతోషంగా పుచ్చుకుంటుంది. రైతులు ఇంకా ఎక్కువ గేదెలను, ఆవులను కొనుక్కునేందుకు బ్యాంకుల ద్వారా అప్పులు ఇప్పిస్తుంది. పాడి పశువులను ఎలా పోషిస్తే అవి పాలు ఎక్కువగా ఇస్తాయో బోధపరుస్తుంది. వాటి మేత గురించి సలహాలు ఇస్తుంది. మేలి రకం మేతలను ఉత్పత్తి చేయడానికి దానా మిశ్రమ కర్మాగారాలను నిర్వహిస్తున్నది. శేషమైన పోషక పదార్థాలతో శాస్త్రీయ పద్ధతిలో సమగ్ర ఆహారాన్ని ఆ కర్మాగారాలు ఉత్పత్తి చేస్తున్నాయి.

ఇక పాల సరఫరాను క్రమబద్ధం చేయడం సంగతి చూద్దాం. మామూలుగా పాడి పశువులు అన్ని కాలాల్లో ఒకే విధంగా పాలు ఇవ్వవు. వర్షా కాలంలో, శీతాకాలంలో – పచ్చగడ్డి సమృద్ధిగా లభించే సీజన్లలో-పశువులు పాలు సమృద్ధిగా ఇస్తాయి. పాల చిక్కదనం ఎక్కువగా ఉంటుంది. వేసవికాలంలో పశువులకు పచ్చగడ్డి దొరకదు. ఎండు మేతపై ఆధారపడవలసి వస్తుంది. అందుచేత ఆ కాలంలో పాల దిగుబడి తగ్గుతుంది. పాల చిక్కదనం తగ్గుతుంది. అందువల్ల పాల కొరత ఏర్పడుతుంది. ధర పెరుగుతుంది. ప్రజలు ఇబ్బంది పడతారు. కార్పొరేషన్ ఈ ఇబ్బంది లేకుండా చేస్తుంది. పాలు సమృద్ధిగా లభించే సీజన్‌లో రోజు వారీ సరఫరాకు పోగా మిగిలిపోయే పాలను పొడిగా మార్చి వేసి, ఆ పొడిని వేసవిలో – పాల ఉత్పత్తి తక్కువగా ఉండే సీజన్‌లో – పాలుగా మార్చి, మామూలు పాలతో చేర్చి, సరఫరా తగ్గకుండా, నాణ్యం తగ్గకుండా, ధర పెరగకుండా చేస్తుంది. కార్పొరేషన్ తన ఫ్యాక్టరీలలో మిగులు పాలతో వెన్న, నెయ్యి, చీజ్ (జున్ను), శిశు ఆహారం, ఐస్ క్రీములు, తియ్యని ఫ్లేవర్డ్ మిల్క్, ఉప్పు చేర్చిన కమ్మని మజ్జిగ కూడా ఉత్పత్తి చేస్తున్నది. వీటినన్నింటినీ మామూలు బజారు ధరలకంటే చౌకగా లభింపజేస్తున్నది. నాణ్యంలో ఇవన్నీ వంకపెట్టడానికి వీలులేనివి.

మామూలుగా అన్ని గేదెలపాలు ఒకే చిక్కదనం కలిగి ఉండవు. కాని, కార్పొరేషన్ తాను సరఫరా చేసే పాల చిక్కదనం ఎప్పుడూ ఒక కనీస ప్రమాణానికి తగ్గకుండా చూస్తుంది. కార్పొరేషన్ సరఫరా చేసే పాలలో వెన్న శాతాన్నిబట్టి ఐదు రకాల పాలు ఉన్నాయి. వెన్న తీసిన పాలను స్కిమ్ మిల్క్ అంటారు. ఈ పాలలో 0.5% మాత్రమే వెన్న మిగిలి ఉంటుంది. టోన్డ్ మిల్క్‌లో మూడు శాతం





నె ప్న ఉంటుంది. డబుల్ టోన్డ్ మిల్క్‌లో 1.5 శాతం మాత్రమే ఉంటుంది. స్టాండర్‌డైజ్డ్ మిల్క్‌లో 4.5 శాతం, హోల్ మిల్క్‌లో ఆరు శాతం వెన్న ఉంటుంది. జంట నగరాలలో రోజూ ఉదయం పూట సరఫరాచేసే పాలు టోన్డ్‌మిల్క్. ఈ పాలలో కొంత పొడి కూడా కలుపుతూ ఉంటారు. మధ్యాహ్నం పూట సరఫరా చేసే పాలు స్టాండర్‌డైజ్డ్ మిల్క్. అందుకే పొద్దుటి పాలకంటే మధ్యాహ్నం పాలు ఎక్కువ రుచిగా ఉంటాయి. ధర కూడా లీటరుకు 30 పైసలు ఎక్కువ.

ఆంధ్రప్రదేశ్ డైరీ డెవలప్‌మెంట్ కార్పొరేషన్, రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలలోగల ఐదు వేల గ్రామాలకు చెందిన మూడు లక్షల మంది




ఉత్పత్తిదారుల నుంచి ఏడాదికి పదికోట్ల లీటర్ల పాలు సేకరిస్తున్నది. రాష్ట్రంలోని 37 పట్టణాలు, నగరాలలోని ఐదు లక్షలమంది వాడకం దారులకు రోజుకు 2.7 లక్షల లీటర్ల పాలు సరఫరా చేస్తున్నది. రాష్ట్రంలోని మొత్తం 51 శీతలీకరణ కేంద్రాలు, డైరీల ద్వారా ఈ సేకరణ, పంపిణీ కార్యక్రమం సాగుతున్నది. కార్పొరేషన్‌లో ఇప్పుడు సుమారు ఎనిమిదివేల మంది పని చేస్తున్నారు. ఈ సంస్థ సాలుసరి వ్యాపార పరిమాణం 35 కోట్ల రూపాయలు.

పాడి ఉత్పత్తుల ఫ్యాక్టరీలు రాష్ట్రంలో మూడు ఉన్నాయి. ఒకటి హైదరాబాద్‌లో, మరొకటి విజయవాడలో, ఇంకొకటి సంగం (గుంటూరు జిల్లా)లో ఉన్నాయి. మిగిలినవి–జిల్లా డైరీలు, చిల్లింగ్ సెంటర్లు (శీతలీకరణ కేంద్రాలు), మినీ చిల్లింగ్ సెంటర్లు, మినీ డైరీలు, కూలింగ్ సెంటర్లు, మినీ కూలింగ్ సెంటర్లు.

జంట నగరాలలో ఈ మధ్య కొత్తగా పాలిథీన్ సంచులలో పాలు సరఫరా చేయడం ప్రారంభించారు. అయితే మామూలుగా సీసాలలో కూడా సరఫరా చేస్తూనే ఉన్నారు. సీసా పాలకంటే పాలిథీన్ సంచులలో పాలు లీటరుకు పదిపైసలు ఎక్కువ. చాలా మంది గృహస్థులు స్వయంగా పాల బూత్‌కు వెళ్ళి తెచ్చుకోలేక నెలకి—సీసాకు రెండు రూపాయల చొప్పున, మూడు రూపాయల చొప్పున ఇచ్చి ఇంటికి తెప్పించుకొంటూ ఉంటారు. అలా సీసాలు తెచ్చి పెట్టడమే వృత్తిగా పెట్టుకున్నవారు జంట నగరాలలో చాలామంది ఉన్నారు. వాళ్ళు తెచ్చి పెట్టే పాలు చిక్కగా ఉండడం లేదని చాలామంది ఫిర్యాదు చేస్తున్నారు. అంటే తెచ్చి పెట్టేవాళ్ళు మధ్యలో నీళ్ళు కలుపుతున్నారన్నమాట. పైన ఉండే పల్చని రేకుమూత తీసి, కల్తీచేసి, మళ్ళీ మూతపెట్టేసే పద్ధతి ఏదో వాళ్ళు కనిపెట్టారు. ఈ పని చేయడానికి ఏవో యంత్రసాధనాలున్నాయట. పాలిథీన్ సంచులలో ఈ రకమైన కల్తీకి ఆస్కారం లేదు. ఇకముందు వాటికి కూడా ఏదైనా పద్ధతి కనిపెడతారేమో తెలీదు. త్వరలో మన రాష్ట్రంలోని మరి ఐదు ముఖ్య నగరాలలో, పట్టణాలలో పాలిథీన్ సంచుల పద్ధతిని ప్రవేశ పెట్టబోతున్నారు.

కార్పొరేషన్ ఆవుపాలనీ, గేదెపాలనీ విడివిడిగా సరఫరా చేయదు. అన్నింటినీ కలిపేస్తుంది. అయితే సేకరించేటప్పుడు మాత్రం ఆవుపాలకు ఒక ధర, గేదెపాలకు ఒక ధర చెల్లిస్తుంది. పాలలో వెన్న శాతాన్నిబట్టి, పోషకపదార్థాల శాతాన్నిబట్టి ధరను నిర్ణయిస్తుంది. గేదెపాలలో కనీసం 5·5 శాతం వెన్న ఉండాలి. అంతకంటే తక్కువ వెన్న ఉండే పాలను స్వీకరించదు. సేకరణ కనిష్ఠధర లీటరుకు 1·47 రూపాయలు. 7·9 శాతం వెన్న ఉంటే ధర లీటరుకు 2·06 రూపాయలు. 8 శాతం, అంతకంటే ఎక్కువ శాతం వెన్న ఉంటే 0·1 శాతానికి ఒక పైస చొప్పున ధర పెంచుతూపోతారు.

ఆవుపాలలో కనీసం మూడు శాతం వెన్న ఉండాలి. అంతకు తక్కువ ఉంటే స్వీకరించరు. సేకరణ కనిష్ఠధర లీటరుకు 1·36 రూపాయలు. 4 శాతం వెన్న ఉంటే లీటరుకు 1·68 రూపాయలు చెల్లిస్తారు. ఇవన్నీ హైదరాబాద్‌లోని డైరీప్రాజెక్టు చెల్లిస్తున్న ధరలు. ఇతర ప్రాంతాలలోని డైరీలు చెల్లించే ధరలు కొంచెం హెచ్చు తగ్గులుగా ఉండవచ్చును. 1974లో కార్పొరేషన్ అవతరించి నప్పటి నుంచి ఇప్పటికి – నాలుగేళ్ళలో – పాల సేకరణ ధర లీటరుకు 50 పైసలు పెరిగింది.

రాష్ట్రంలో పాడిపరిశ్రమను అభివృద్ధి పరచడం, ప్రజలకు సేవచేయడమే తప్ప, కార్పొరేషన్‌కు లాభాపేక్షలేదు. అయితే అభివృద్ధిచెందిన ప్రాంతాలలో కొంత లాభసాటిగా ఉంటుంది. వెనుకబడిన ప్రాంతాలలో నష్టంగానే ఉంటుంది.





వెనుకబడిన ప్రాంతాలలో పాడిపరిశ్రమను ప్రోత్సహించడానికి కొంత డబ్బు ఖర్చు పెట్టవలసి వస్తుంది. మొత్తం మీద చూస్తే ఈ సంస్థ ఆదాయం, ఖర్చులు బొటాబొటీగా సరిపోతాయి. కాని యంత్రాలు మొదలైనవాటి తరుగు (అరుగుదల)ను లెక్కలోకి తీసుకుంటే కొద్దిగా నష్టమే కనిపిస్తుంది.

1974 – 75 నుంచి ఇప్పటివరకు డైరీల ఉత్పాదక సామర్థ్యాన్ని పెంచడం కోసం, క్రొత్త డైరీలను ప్రారంభించడం కోసం కార్పొరేషన్ ఎనిమిదికోట్ల రూపాయలు ఖర్చు చేసింది. ఈ ఏడాది మరి ఎనిమిదికోట్ల రూపాయలు ఖర్చు పెట్టబోతున్నది. ఈ ఏడాది పాల సేకరణ లక్ష్యం 12 కోట్ల లీటర్లు. రోజు వారీ వాడకానికి పోగా మిగిలే పాలతో రెండువేల టన్నుల స్కిమ్ పాలపొడి, 800 టన్నులు హోల్‌మిల్క్ పౌడర్, 550 టన్నులు వెన్న, మూడువేల టన్నులు నెయ్యి, రెండువేల టన్నులు శిశు ఆహారం (బేబీఫుడ్), 50 టన్నులు చీజ్–ఉత్పత్తి చేయాలని లక్ష్యాలు నిర్దేశించారు.

కార్పొరేషన్ అతిత్వరలో 'విజయ' బ్రాండ్ పేరుతో బేబీఫుడ్‌ను ఉత్పత్తి చేసి, మార్కెట్లో ప్రవేశపెట్టబోతున్నది. దక్షిణాదిని బేబీఫుడ్ ఉత్పత్తి చేస్తున్న మొదటి రాష్ట్రం మనదే. చిత్తూరు డైరీ త్వరలో దేశం మొత్తం మీద ప్రప్రథమంగా ఆవుపాలతో చీజ్ ఉత్పత్తి ప్రారంభించబో తున్నది. 'విజయ' నెయ్యి ఒక కిలో డబ్బాలలోనూ, విడిగా పాలిథీన్ సంచులలోనూ లభిస్తున్నది. ఈ నెయ్యిని కొన్ని ఇతర రాష్ట్రాలకు కూడా సరఫరా చేస్తున్నారు. ఈ నెయ్యి మిక్కిలి శ్రేష్ఠమైనదిగా పేరు తెచ్చుకున్నది. 'విజయ' ఐస్‌క్రీము, కుల్ఫీ, ఫ్లేవర్డ్ మిల్క్, మజ్జిగ, కోవా, పాలకాండీ జంటనగరాలలోని అన్ని ముఖ్య స్థలాలలోనూ, విజయ డైరీ పార్లర్స్‌లో దొరుకుతాయి. వీటికి మంచి గిరాకీ ఉంది. కార్పొరేషన్ నిర్వహణ క్రింద జంటనగరాలలో ఇటువంటి పార్లర్స్ ఇరవై ఉన్నాయి. ఇవికాక, వీటిని అమ్మే కమిషన్ ఏజెంట్లు 200 మంది ఉన్నారు. హైదరాబాద్‌లో లాలాపేట వద్ద గల పాడి ఉత్పత్తుల ఫ్యాక్టరీలో ఇవన్నీ తయారవుతున్నాయి. డైరీ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ కేంద్ర కార్యాలయస్థానం కూడా అదే.

హైదరాబాద్ ఫ్యాక్టరీని 1967 లో రోజుకు 50 వేల లీటర్ల పాల నిర్వహణ శక్తితో ప్రారంభించారు. ఇప్పుడు అది రోజుకు లక్షయాభై వేల లీటర్ల పాలను నిర్వహిస్తున్నది. పాల ఉత్పత్తి గరిష్ఠస్థాయి అందుకున్న రోజుల్లో, రోజుకు లక్ష తొంభైఐదువేల లీటర్ల పాలను నిర్వహించింది. ఈ ఫ్యాక్టరీ రోజుకు పది టన్నుల పాల పొడి, ఆరు టన్నుల వెన్న, నాలుగు టన్నుల నెయ్యి ఉత్పత్తి చేస్తుంది.

**పాల సేకరణ :**

గ్రామాలలోని ఉత్పత్తిదారులు పాలను తమకు అతి సమీపంలో గల శీతలీకరణ కేంద్రాలకు చేర్చుతారు. శీతలీకరణ కేంద్రాలలో పాలను పరీక్షించి, అవి నాణ్యమైనవైతేనే స్వీకరిస్తారు. పాలలో నీళ్ళు కలిశాయేమో లాక్టోమీటరుతో చూస్తారు. స్వీకరించిన పాలను పాశ్చరైజ్ చేసి, చల్లబరచి సమీపంలో గల జిల్లాస్థాయి డైరీకి పంపుతారు. 'పాశ్చరైజేషన్' అంటే—పాలను

16 సెకన్లపాటు 172 డిగ్రీలు ఫారెన్‌హీట్‌వరకు వేడి చేసి, తర్వాత 40 డిగ్రీలకు చల్లబరచడం. ఈ ప్రక్రియవల్ల పాలలోని హానికరమైన సూక్ష్మ జీవులు నశిస్తాయి. పాలు తోడుకోవడానికి అవసరమైన సూక్ష్మజీవులు, పోషక పదార్థాలు మాత్రం మిగిలి ఉంటాయి. జిల్లా డైరీకి చేరేలోగా పాలు విరిగిపోకుండా, పులిసిపోకుండా ఉండడానికి ఇలా చేస్తారు. 1977 సంవత్సరాంతానికి మన రాష్ట్రంలో మొత్తం 35 శీతలీకరణ కేంద్రాలు (చిల్లింగ్, మినీ చిల్లింగ్, కూలింగ్ సెంటర్స్) ఉన్నాయి. జిల్లా డైరీలు పది ఉన్నాయి. జిల్లా డైరీలు గాని, భారీ డైరీలు గాని దగ్గర్లో ఉంటే ఉత్పత్తిదారులు పాలను సరాసరి వాటికే పంపుతారు. జిల్లా డైరీలకు సాధారణంగా 30, 35 మైళ్ళవరకు చుట్టుప్రక్కల గల గ్రామాల నుంచి పాలు చేరుతూ వుంటాయి. హైదరాబాద్‌లోని భారీ డైరీకి 70 కిలో మీటర్ల దూరం నుంచి కూడా పాలు వస్తాయి.

జిల్లా డైరీలు తాము సేకరించి, పాశ్చరైజ్ చేసిన పాలను స్థానికంగా పంపిణీ చేసి, ఇంకా మిగిలితే వాటిని భారీ డైరీలకు పంపుతాయి. భారీ డైరీలు ఆ పాలను పొడిగా మార్చుతాయి. లేదా వెన్నగానో, నెయ్యిగానో మార్చుతాయి.

డైరీ పాలు పొద్దున కొన్నవి సాయంత్రం కాచితే విరిగిపోతూ ఉంటాయని కొందరు ఫిర్యాదు చేస్తూ ఉంటారు. అలా విరిగిపోకుండా ఉండాలంటే పాలను మధ్య మధ్య వెచ్చబెడుతూ ఉండాలి. పాలు పితికిన సమయానికి, వాడకందారునికి చేరే సమయానికి మధ్య వ్యవధి చాలా ఎక్కువగా ఉంటుంది కనుక, మధ్యలో డైరీవద్ద పాశ్చరైజ్ చేసినప్పటికీ, శీతలీకరణ జరిపినప్పటికీ కొంతసేపటికి పాలలో మళ్ళీ బాక్టీరియా (సూక్ష్మజీవులు) పెరిగే అవకాశం ఉన్నది. అంచేత పాలు విరిగిపోకుండా ఉండాలంటే మధ్య మధ్య వెచ్చచేయడం అవసరం. లేదా రిఫ్రిజిరేటర్‌లో పెట్టాలి.

హైదరాబాద్ డైరీలో పాలను స్వీకరించే దశ నుంచి నగరంలో పంపిణీకై వ్యానులలోకి ఎక్కించేవరకు జరిగే కార్యకలాపమంతా చూడడానికి ఆసక్తిదాయకంగా ఉంటుంది. ఈ వ్యాసంతోపాటుగా ప్రచురించిన ఫోటోలను ఒక వరుస క్రమంలో పరిశీలిస్తే అక్కడ జరిగేదంతా కళ్ళకు కట్టినట్లు బోధపడుతుంది.

1. ఒకటవ ఫొటోలో కనిపిస్తున్నది పాలను స్వీకరించే విభాగం. చుట్టుపక్కల పట్టణాల నుంచి, గ్రామాల నుంచి క్యాన్స్‌లో వచ్చే పాలను ఇక్కడ తొలి పరీక్ష చేస్తారు. దీన్ని ప్లాట్‌ఫారం టెస్ట్ అంటారు. ఇక్కడ కన్వేయర్ చైన్‌మీద క్యాన్స్‌ను ఉంచుతారు. అవి నెమ్మదిగా కదిలి ముందుకు వెడుతూ ఉంటాయి. ఒక్కొక్క క్యాన్ నుంచి కొద్ది చుక్కలు మచ్చుకు తీసుకుంటారు. ఆ చుక్కలను ప్రయోగ నాళికలో వేసి వెచ్చజేసి చూస్తారు. తుట్టెలుగా, ముద్దలుగా వస్తే పాలు చెడిపోయినవని గుర్తిస్తారు. అలా చెడిపోయిన పాలుగల క్యాన్‌లపై గుర్తులు పెడతారు. కన్వేయర్ చైన్ ఒకచోట రెండుగా చీలుతుంది. మంచి పాల క్యాన్‌లన్నీ ఒకవైపు పోతాయి. చెడిపోయిన పాలుగల క్యాన్‌లను రెండోవైపు మళ్ళిస్తారు. చెడిపోయిన పాలను తిరస్కరిస్తారు. ప్రతి క్యాన్‌మీద దానిని పంపిన వ్యక్తి పేరు, లేదా సహకార సంఘం పేరుగల చీటీ తగిలించి ఉంటుంది. క్యాన్‌లు కన్వేయర్ చైన్ మీదుగా కొంతదూరం వెళ్ళిన తర్వాత అక్కడ యంత్ర సహాయంతో తూకం వేస్తారు. ఒక్కొక్క క్యాన్‌లోని పాల బరువును, యంత్రం నమోదు చేస్తుంది. ఆ తూకాన్నిబట్టి ఉత్పత్తిదారులకు ఇవ్వవలసిన డబ్బును లెక్క కడతారు.

2. రెండవ ఫోటోలో కనిపించేది పాలను నిల్వచేసే టాంకు. ఈ విభాగంలోనే పాల ప్రాసెసింగ్ కూడా జరుగుతుంది.

3. మూడవ ఫొటోలో పాశ్చరైజేషన్ జరిగే విభాగాన్ని చూడవచ్చును. పాలు పులిసిపోకుండా, చెడి పోకుండా నిల్వ ఉండేందుకు వీలుగా ఇక్కడ పాశ్చరైజ్ చేస్తారు. ఈ విధానాన్ని లూయీ పాశ్చర్ కనుగొన్నందువల్ల ఈ ప్రక్రియకు 'పాశ్చరైజేషన్' అన్న పేరు వచ్చింది.

4. నాల్గవ ఫొటోలో ఉన్నది క్వాలిటీ కంట్రోల్ లేబరేటరీ. పాల మచ్చులను ఇక్కడే రసాయనిక పరీక్ష చేస్తారు. పాలలో వెన్న శాతం ఎంత ఉన్నదో, పోషక పదార్థాలు ఏమాత్రం ఉన్నాయో నిర్ధారిస్తారు. వాటినిబట్టే పాలకు చెల్లించవలసిన ధరను నిర్ణయిస్తారు. పాలను స్వీకరించే తొలిఘట్టంలో తీసుకునే మచ్చులనే కాక, మళ్ళీ మళ్ళీ అన్ని దశలలోనూ పాలను సీసాలలోకి ఎక్కించే వరకు మచ్చులను తీసుకొంటూ పరీక్షిస్తూ ఉంటారు.

5. ఇది సీసాలను కడిగి శుభ్రంచేసే విభాగం. ఇక్కడ సీసాలను ముందు వేడినీళ్ళతో, తర్వాత చన్నీళ్ళతో, ఆ తర్వాత ఆవిరితో శుభ్రం చేస్తారు. తర్వాత వాటిని పాలు నింపే విభాగానికి పంపుతారు. సీసాలను శుభ్రం చేసే పని కూడా యంత్ర సహాయంతోనే జరుగుతుంది. ఈ యంత్రం గంటకు 12 వేల సీసాలను శుభ్రం చేస్తుంది.

6. ఇది సీసాలలో పాలు నింపే యంత్రాంగం. కన్వేయర్ బెల్ట్ మీదుగా సీసాలు కదులుతూ ఉంటాయి. పాలు నింపే గొట్టాల క్రిందికి సీసాలు వచ్చి నించోగానే గొట్టాలలోనుంచి సీసాలలోకి పాలు కారుతాయి. సీసా నిండగానే పక్కకు కదులుతుంది. మరో యంత్రం దానికి తగరం మూత బిగిస్తుంది. సీసాలు క్యూలో ముందుకు కదిలిపోతూ ఉంటాయి. ఇక్కడి యంత్రం గంటకు 5 వేల సీసాలను నింపగలదు.

7. ఇది పాలిథిన్ సంచులలోకి పాలు నింపే యంత్రం. ఈ సంచులలో అర లీటరువి, ఒక లీటరువి ఉన్నాయి. సంచిలో పాలు నిండగానే యంత్రమే సీలు చేస్తుంది. ఫ్యాక్టరీలో ఈ విభాగాన్ని కొత్తగా నెలకొల్పారు. ఇక్కడి యంత్రం గంటకు ఐదువేల సంచులను నింపగలదు.

8. ఇది క్రీమును పాశ్చరైజ్ చేసే విభాగం.

9. ఇది స్టెరిలైజ్డ్ ఫ్లేవర్డ్ మిల్క్ తయారీ విభాగం. ఫ్లేవర్డ్ మిల్క్ తయారీలో పాలను 200 డిగ్రీల ఫారిన్ హీట్‌వరకు వేడిచేసి, తిరిగి చల్లబరుస్తారు.

10. ఇది నెయ్యి నిల్వచేసే టాంకు.

11. ఇది డైరీ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ వారి పాల టాంకు. ఇది 2 వేల లీటర్ల పాలను రవాణా చేయగలదు. ఆగ్నేయాసియాలోకెల్లా ఇది పెద్ద పాల టాంక్.

12. ఇది ఆంధ్రప్రదేశ్ డైరీ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ కేంద్ర కార్యాలయ స్థానం. పాడి ఉత్పత్తుల ఫ్యాక్టరీ కూడా ఇక్కడే ఈ భవనానికి వెనుక భాగంలో ఉన్నది.






# స్వామి అయ్యప్ప

## గ్రూప్‌లో సభ్యులుగా చేరండి!

మొదటినెల రు.18లు. తదుపరి ప్రతినెల రు.11 చొ||న 12 నెలలు. మాత్రమే చెల్లించాలి!

తదుపరి రు.10 చెల్లించిన వెంటనే స్టేట్ బ్యాంకు ఆఫ్ హైదరాబాద్ వారి కేష్ సర్టిఫికెట్ రు.150 లకు పొందండి! సభ్యులుగా చేరిన వెంటనే జిప్ టాయిలెట్ బ్యాగ్ పొందండి! ఒకేసారి రు.160 చెల్లిస్తే జిప్ టాయిలెట్ బ్యాగ్‌కు బదులు జిప్ డాక్యుమెంట్ ఫైలు పొందగలరు!

మొత్తం బహుమతులు 37,655.

మొత్తం బహుమతుల విలువ రు.6,47,425.

లక్షరూపాయిల నుండి పదిరూపాయిలవరకు బహుమతులు గలవు. ఏ బహుమతి పొందలేని వారికి స్కీము ఆఖరున రు.100 బోనస్‌గా యివ్వబడును.

స్వామి అయ్యప్ప గ్రూప్‌లో వచ్చు లాభములో 25% స్వామి అయ్యప్ప దేవాలయములకు విరాళముగా యివ్వబడును.

**ANDHRA PRADESH SAVING & FINANCE**

**J.P. ROAD - RAJAHMUNDRY**

PHONE: 4411 P.B.47 GRAMS: SAVING

Regional Office: Nampalli Station Road - HYDERABAD



# పెరటితోట పెంపకం



—లలితకుమారి

**డి. కాంత, గుంటూరు**

మార్చి 15 సంచికలో ఒక పాఠకురాలు అడిగిన ప్రశ్నకు సమాధానంగా మీరు 'నీలి, పచ్చకలువ దుంపలు' మద్రాసు లేక బెంగుళూరులలో లభిస్తాయని వాటి చిరునామాలు తెలియజేశారు. అవి ఏ విధంగా పెంచాలి? కుండీలలో పెంచవచ్చునా? వాటి వెల ఎంత వుంటుంది?

ఈ దుంపల్ని మామూలు కుండీలలో గాని ప్లాస్టిక్ బకెట్లలో గాని పెంచవచ్చును. మొదట ఒక పలుచని గోనె తీసుకుని అందులో ఎరువు వేసి ఈ దుంపను వుంచి దుంప భాగంవరకు బిగించి కట్టాలి. బొమికెల ఎరువు (Bone meal) అయితే పువ్వు బాగా పూస్తుంది. ఆకు మాత్రం కనీసం రెండు అంగుళాల మేర అయినా బయటికి వుండాలి. ప్రారంభంలో అయితే ఆకు మరీ క్రిందకే వుంటుంది కాబట్టి గోనెసంచి క్రింద ఇటుక రాళ్ళు వుంచడం మంచిది. ఇలా చేయడం వల్ల ఆకు బాగా పైకి వచ్చి దానికి సూర్యరశ్మి తగిలే అవకాశం వుంటుంది. చెట్టు పెరుగుతున్నకొద్దీ ఈ యిటుకరాళ్ళను తీసి వేయవచ్చును. ఏపుగా పెరిగి పువ్వు బాగా పూస్తున్న సమయంలో కుండీలోంచి గాని ప్లాస్టిక్ బకెట్లోంచి గాని దీన్ని తీసి భూమిలో నాటాలి. ఇక వీటి ధర అంటారా — ఈ రోజుల్లో ప్రతి వస్తువు ధర రోజురోజుకీ మారిపోతూ వుంటే ఈ ధరలు నేనెలా చెప్పగలను చెప్పండి! నేను ఇంతకుముందే చెప్పిన చిరునామాలకు రాస్తే, వాళ్ళే చెప్పేస్తారు.

**పి. సుభాషిణి, కోరుకొండ**

సాధారణంగా మరువం వలె దవనాన్ని పెంచలేకపోతున్నాము. ఎంచేత? కొనివేసిన దవనం బ్రతకలేదు. వేళ్ళతో ఎక్కడ లభిస్తుంది?

దవనం మొక్కని వేళ్ళతోనే వెయ్యాలని లేదు. కొమ్మ వేసినా మొక్క పెరుగుతుంది. కాని—మీ ప్రాంతాలలో పెరిగే మొక్కలు కావు అవి.

**జి. సుమిత్రాదేవి, హైద్రాబాదు**

మా పెరటిలోని దానిమ్మ చెట్టుకి పిందెతోపాటే పుచ్చులుపడుతున్నాయి. కాయలన్నీ పుచ్చులే. లోపలి భాగమంతా నల్లగా అయిపోతున్నది. దీనికి ఏ మందు వాడాలో తెలియజేస్తారా?

ఆ పుచ్చుపట్టడమన్నది ఫంగస్ వల్ల ఏర్పడుతుంది. మీరు హైద్రాబాదులోనే వున్నారు కాబట్టి హార్టికల్చరల్ శాఖవారికి గాని వ్యవసాయ శాఖవారి డిపోలో గాని పుచ్చుపట్టిన కాయ చూపితే దాన్నిబట్టి వారు తగిన మందు యిస్తారు. ఎందుకంటే ఈ ఫంగస్‌లో వివిధ రకాలు వున్నట్లే వాటికి తగిన మందులు కూడా అనేకరకాలు వున్నాయి.

మేము కొబ్బరిచెట్టు నాటి ఏడు సంవత్సరాలైంది. ఆకాశానికి అంటేటట్లుగా చెట్లు బాగా పెరిగాయి. కొమ్మలు కూడా బలిష్ఠంగా వున్నాయి. కాని కాయలు మాత్రం కాయడం లేదు. ఎందుచేతనంటారు? అవి కాయలు కాసేందుకు మార్గం ఏమైనా వుందా?

కొబ్బరి చెట్లలో రెండురకాలు వున్నాయి. ఒకటి పొట్టిరకం చెట్లు. దీనినే మన వాళ్ళు 'చెన్నంగి' చెట్లు అంటారు. ఇవి కాయలు కాయడానికి మూడు నాలుగు సంవత్సరాలు పడుతుంది. మరోరకంవి పొడుగు చెట్లు. అంటే మీ పెరటిలో వున్నటువంటివన్నమాట. ఈ చెట్లు కాయడానికి ఎనిమిది నుంచి పది సంవత్సరాల దాకా కూడా పడుతుంది. అందుకే ఈ మధ్య చాలామంది డ్వార్ఫ్‌వెరైటీ అదే పొట్టిరకం చెన్నంగి కొబ్బరి చెట్లనే నాటడానికి ఆసక్తి చూపుతున్నారు. ఎలాగూ మీరు ఇన్నాళ్ళు వేచి వున్నారు కదా—మరో సంవత్సరమో రెండు సంవత్సరాలో ఓపిక పట్టండి. ఫలితం కనిపిస్తుంది.

**సి. కృష్ణకుమారి, నందిగామ**

మా ఇంట్లో నందివర్ధనం చెట్టు కాడకు పురుగు పట్టడం వల్ల మొగ్గలు అన్నీ కూడా విచ్చకుండానే రాలిపోతున్నాయి. డి. డి. టి. చల్లితే కొంచెంగా విచ్చుకుంటున్నాయి. దయచేసి దీనికి ఏ మందు వాడలో తెలియజేయండి.

నందివర్ధనం చెట్టు ఎక్కడ వున్నా పురుగు పట్టక మానదు. సాధారణంగా ఆ చెట్టుకి పురుగులు పడుతూనే వుంటాయి. వాటిని నివారించడం కష్టం. మలతియాన్ వాడి చూడండి. దానికన్న ఘాటైన మందులు వున్నాయి కాని అవి హానికరమైన పరిణామాలకి దారి తీస్తాయి.

**జి. బాలప్రసూన, బొమ్మలూరు**

మా పెరట్లో ఒక గులాబి మొక్క వుంది. మొక్క నాటి సంవత్సరం కూడా కాలేదు. అది బాగా ఏపుగా పెరుగుతోంది. కాని పువ్వులు పూయటం లేదు. చివికిన పశువుల ఎరువు కూడా వేశాము. అయినా ఫలితం లేదు. ఏం చెయ్యాలో చెప్తారా?

కొన్ని చెట్లు కేవలం అంటు కట్టడానికే ఉపయోగపడతాయి. మామిడి, గులాబీలలో ముఖ్యంగా ఈ కోవకు చెందినవి వున్నాయి. వీటికి పువ్వులు పూయించడం సాధ్యం కాదు. అయినా మీ గులాబి మొక్క ఏ రకానికి చెందినదో తెలియకుండా నేనెలా సమాధానం చెప్పగలను? మీరు ఇన్ని జాగ్రత్తలు తీసు

## శాంతి వేదాంతం

ఇటీవల హైద్రాబాదులోని త్యాగరాయ గానసభ భవనంలో-ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారి సంగీత నృత్య కళాశాలల – పాఠశాలల సంయుక్త ద్వితీయ వార్షికోత్సవాలు మూడు రోజులపాటు జరిగాయి.

ఆ వేడుకలలో హైద్రాబాదులోని ప్రభుత్వ సంగీత, నృత్య కళాశాలకు చెందిన నృత్యవిభాగం వారు కూచిపూడి, భరతనాట్యం, కథక్, జానపద నృత్య ప్రదర్శనలు బహుసుందరంగా యిచ్చారు.

అందులో కూచిపూడి సాంప్రదాయ నృత్యాలు ప్రదర్శించిన నర్తకి శాంతివేదాంతం–బహుళ ప్రశంసలు అందుకున్నారు.

కూచిపూడి నాట్య శాస్త్రంలో నిష్ణాతులైన వేదాంతం జగన్నాథశర్మగారి కుమార్తె శాంతి.

ప్రస్తుతం ఆమె హైద్రాబాదు ప్రభుత్వ సంగీత నృత్య కళాశాలలో ఉపన్యాసకురాలుగా వుంటున్నారు.

"మంచి విద్యార్థులను సమీకరించి జంటనగరాలలో 'ఇండియన్ డాన్స్ థియేటర్' వంటిది ప్రారంభించాలని వుంది" అంటారు శాంతి.



కూచిపూడి, భరతనాట్యం, కథక్, జానపద నృత్యాలలో విద్య నభ్యసించినవారితో ఈ థియేటర్ స్థాపించాలన్నది ఆమె ఆకాంక్ష. —వి. వి.

కుని మొక్క బాగా పెరిగినా పువ్వులు పుయ్యలేదంటే అది తప్పకుండా అంటుకట్టే రకానికి చెందిన మొక్కే అయివుండాలి.

మా పెరట్లో ఎరుపు నూరువరహాల మొక్క, సన్నజాజి వున్నాయి. వాటి ఆకులు వంకరలు తిరిగి ముడుచుకుపోతున్నాయి. ఆకుల మడతలు తీసి చూస్తే లోపల సాలెపురుగు వుంటోంది. దీనిని నివారించాలంటే ఏం చెయ్యాలి?

అది సాలెపురుగు కాదు. మొక్కలకు పట్టే ఒక విధమైన పురుగు. దాని ఆకారం ఆ విధంగా వుండటం వల్ల సాలెపురుగులా మీకు అనిపించి వుంటుంది. మలతియాన్ మందు వాడితే ఈ పురుగు తుడిచి పెట్టుకుపోతుంది. అప్పుడు ఆకులు వంకర తిరగడం అనే సమస్యేరాదు.

అలాగే ఒక విరజాజి మొక్క వుంది. దాని వయసు నాలుగు సంవత్సరాలు. ఈ మొక్క కూడా ఏపుగా పెరిగింది కాని ప్రతి సంవత్సరం ఒకటి రెండు పువ్వులకంటె ఎక్కువ పూయడం లేదు. ఈ సంవత్సరం మొదలువరకు కొట్టి వేశాము–అప్పుడన్నా బాగా పూస్తుందేమోనని. ఈ మొక్క బాగా పుయ్యాలంటే ఏం చెయ్యాలంటారు?

సాధారణంగా అందరూ ఒక పొరపాటు చేస్తూ వుంటారు. చెట్లకి ఎరువు, నీళ్ళు పొయ్యడం బాగానే చేస్తారు. కాని తాము వేస్తున్న ఆహారం చెట్టు వేళ్ళదాకా వెడుతోందా అన్న విషయం ఆలోచించరు. చెట్టు పెరిగిన కొద్దీ నేలలో వేళ్ళ వైశాల్యం కూడా పెరుగుతుంది. మనం బోదికి నీళ్లు పోసినంత మాత్రాన అవి చివరికంటా వేళ్ళకి చేరవు. ఆ కారణం వల్లనే మీ జాజి మొక్క కూడా పువ్వులు సరిగా పుయ్యడం లేదు. మీరు చెట్టు చుట్టూ కందకంలా తవ్వి బాగా ఎరువు, పుష్కలంగా నీరు పొయ్యండి. అప్పుడు వేళ్ళకి సక్రమంగా ఆహారం అందుతుంది. పువ్వు కూడా బాగా పూస్తుంది.

**తులసి, మద్రాసు**

మద్రాసులో మేము ఉన్న ప్రాంతంలో ఉప్పుగాలి అధికంగా వుంటుంది. ఈ వాతావరణంలో బాగా పెరిగే మొక్కలు ఏవో చెబుతారా?

మీరు ట్రిప్లికేన్ ప్రాంతంలో వుంటున్నారంటే ఆ ప్రాంతంలో ఇసక భూమి అధికంగా వుంటుంది-అవునా? అటువంటప్పుడు మీరేం చెయ్యాలంటే ఆ మట్టి రెండడుగుల లోతు వరకు తీసేసి సారవంతమైన మట్టిని అందులో వేసి నింపాలి. మందార, మల్లి, గన్నేరు మొక్కలు బాగా పెరుగుతాయి. గులాబీలు, జినియా మొక్కలు పెరగడం కష్టం. ఉప్పుగాలి వల్ల మొక్కలకి అంతగా ప్రమాదం లేదు కాని, ఆ మట్టి మంచిది కాదు.

**వసంత, భీముని పట్నం**

క్రోటన్ మొక్కలు పెంచాలంటే ప్రత్యేకమైన నేల ఏదైనా కావాలా? లేక ఎక్కడైనా పెరుగుతుందా?

క్రోటన్ మొక్కలు బాగా పెరగడానికి ఎర్రమన్ను నేల అయితే శ్రేష్ఠం.

**ఎక్కరాల సరస్వతి, ఏలూరు**

రాజమండ్రిలో కాసే వంకాయలు తింటే బోదకాలు వస్తుందంటారు. నిజమేనా? అసలు ఇలా ఎందుకు జరుగుతుంది?

అది వట్టిమాట, అపోహ. అంతే. బోదకాలు అనేది ఫైలేరియా జాతికి చెందిన దోమ కాటు వల్ల వస్తుంది కాని, వంకాయలు, బెండకాయలు తింటేరాదు.

**ఏ. ఆర్. అరుణ, అత్తూరు**

బీర పాదు నాటడానికి అనుకూలమైన సమయం ఏది?

ఆగస్ట్, సెప్టెంబరు నెలలు బీరపాదు నాటడానికి అనుకూలమైన సమయం. అసలు ఏ కూర మొక్కలు నాటడానికైనా ఈ నెలలే అనువైనవి. మీది చిత్తూరు జిల్లా ప్రాంతం కదూ–బీర పాదు అమోఘంగా పెరుగుతుందక్కడ! □



# వాయులీన విద్వాంసురాలు ద్వారం మంగతాయారు

"నేడు సంగీతం స్థాయి దిగజారిపోతోంది. అందుకు కారణం కళాకారుల కొరత కాదు. వారికి తగిన ప్రోత్సాహం లేకపోవడమే. సంగీత నాటక అకాడెమీలు స్థాపించినా అవి ఔత్సాహిక కళాకారులకు చేస్తున్న సహాయం అంతంత మాత్రంగానే వుంది. అసలు ఆనాటి ప్రముఖ సంగీత విద్వాంసులు సంగీతంలోని వివిధ శాఖలలో జరిపిన కృషిని యువతరానికి పరిచయం చెయ్యాల్సిన బాధ్యత ఈ అకాడెమీల మీద వున్నది. కాని అవి అందుకు ఏ మాత్రం దోహదకారిగా లేవు. అంతెందుకు – మా నాన్నగారైన ద్వారం వెంకటస్వామినాయుడుగారు స్వదేశంలోనే కాక విదేశాలలో కూడా ప్రముఖ వయొలిన్ విద్వాంసుడుగా కీర్తిగడించారు. కాని నేడు ఆయన ఎవరో చాలామందికి తెలీదు" అంటూ తన ఆవేదనను వ్యక్తం చేశారు ద్వారం మంగతాయారు.

సంగీతానికే తమ జీవితాన్ని ధారబోసిన వారు అరుదుగా కనిపిస్తారు. అటువంటి అరుదైన వారిలో మంగతాయారు ఒకరు. తండ్రిగారి లాగానే ఆమె కూడా వయొలిన్ వాద్యంలో సిద్ధహస్తురాలు. ప్రస్తుతం - మద్రాసు ఆలిండియా రేడియోలో ఆమె నిలయ విద్వాంసురాలు.

కళలకు పుట్టినిల్లనదగ్గ విజయనగరంలో జన్మించిన మంగతాయారు–చిన్నతనంలో చదువు మీద కన్న వయొలిన్ మీదనే శ్రద్ధ ఎక్కువగా చూపేవారు. ఆ ఉత్సాహంతో ఆమె విజయనగరంలోని ప్రభుత్వ మహారాజ సంగీత నాట్య కళాశాలలో చేరారు. అక్కడ ఆమె రెండేళ్ళలో పూర్తి చెయ్యవలసిన డిప్లొమాని ఒక సంవత్సరంలోనే పూర్తి చెయ్యగలిగారు!

సరిగ్గా ఆ సమయంలోనే అప్పటి విజయవాడ ఆకాశవాణి కేంద్రం నిర్వాహణాధికారి అయిన విజయకృష్ణగారు విజయనగరం రావడం, ఆమె వాద్యం విని ముగ్ధులవడం జరిగింది. తత్ఫలితంగా ఆమె 1952లో విజయవాడ ఆలిండియా రేడియోలో చేరారు. ఆ తరువాత 1954 లో మద్రాసుకు బదిలీ అయ్యారు.

ఆ రోజుల్లో తన జీవితంలో మరపురాని సంఘటన గురించి ప్రస్తావిస్తూ–'1957లో అనుకుంటాను. మా నాన్నగారు నన్ను పిలిచి 'అమ్మా....నువ్వు రేడియో ఆర్టిస్ట్‌వి కదా....నీకు నేను సంగీతం నేర్పించవచ్చునా' అని అడిగారు. అంతవరకు ఆయన వాయిస్తూంటే వినడం, శిష్యులకు నేర్పిస్తూంటే చూడడం తప్పించి ఆయన వద్ద విద్య నభ్యసించే భాగ్యం నాకు కలగలేదు. ఆయన ప్రథమ శిష్యులైన జనార్దనాచార్యులుగారే నాకు అంతవరకు వయొలిన్, గాత్రం నేర్పించారు. మా నాన్నగారు ఆ మాట అనగానే సంతోషంతో పొంగిపోయాను. దాదాపు మూడు సంవత్సరాలు ఆయన వద్ద నేర్చుకున్నాను'' అన్నారు మంగతాయారు.

కేంద్ర ప్రభుత్వం వారి ఉచిత వేతనాన్ని వరుసగా మూడు సంవత్సరాలపాటు పొందారు మంగతాయారు. ఆ మూడు సంవత్సరాలు ఆమె ముత్తుస్వామి అయ్యర్ వద్ద సంగీత సాధన చేశారు.

ద్వారం వారితోపాటు-బాబూ రాజేంద్రప్రసాద్, సర్వేపల్లి రాధాకృష్ణన్, జవహర్‌లాల్ నెహ్రూ వంటి ప్రముఖుల సమక్షంలో సంగీత కచ్చేరీలలో పాల్గొన్న మంగతాయారు విదేశాలు కూడా పర్యటించారు. 1973 లో ఆమె స్విట్జర్లాండు, పశ్చిమ జర్మనీ, హాలండ్ మున్నగు దేశాలలో జరిగిన సాంస్కృతిక కార్యక్రమాల్లో పాల్గొని పలువురి ప్రశంసలు పొందారు. ఇంతవరకు ఆమె దాదాపు మూడువందల కచ్చేరీల్లో పాల్గొన్నారు. 'కాని మా నాన్నగారుచేసిన చివరి కచ్చేరీలో పాల్గొన లేకపోయాను. అదే నా జీవితంలో తీరని లోటు.'' అన్నారామె.

విశేషమేమంటే ఆమె కుటుంబంలోని ప్రతి ఒక్కరూ కూడా సంగీతంలోని ఏదో ఒక అంశంలో ప్రవీణులే! ఆమె అన్నగారైన భావనారాయణగారు విజయనగరం సంగీత నాట్యకళాశాల ప్రధానాచార్యులుగా వుండేవారు. మరో ఇద్దరు సోదరులలో ద్వారం సత్యనారాయణ ఫిడేలు వాద్యంలోను, ద్వారం శ్రీనివాసులు మృదంగంలోను నిష్ణాతులు. ఆమె సోదరి ద్వారం శ్యామల పాశ్చాత్య సంగీత రీతిలో వయొలిన్ వాయించడంలో సిద్ధహస్తురాలు. జర్మనీలో విద్య నేర్చుకున్న శ్యామల ప్రస్తుతం మద్రాసులోని మాక్స్‌ముల్లర్ భవన్‌లో జర్మను భాషలో ఉపన్యాసకురాలుగా వుంటున్నారు.

1964 లో తండ్రిని కోల్పోవడంతో మంగతాయారు ఆ దుఃఖాన్ని భరించలేక అస్వస్థురాలయ్యారు. అప్పుడే ఆమె అన్న గారు స్థలం మార్పు జరిగితే ఆమె మానసికంగా కోలుకుంటారన్న అభిప్రాయంతో విజయనగరంలోని తమ కళాశాలలో ఉపన్యాసకురాలిగా చేరమని ఆహ్వానించారు. ఆ విధంగా ఆమె రెండేళ్లపాటు విజయనగరం సంగీత నాట్య కళాశాలలో పని చేశారు.

మంగతాయారు కేవలం వయలిన్ వాద్యంలోనే కాక వీణ వాయించడంలో కూడా సిద్ధహస్తురాలు.

తను నేర్చిన విద్యను పది మందికీ తెలియజెప్పాలన్న తపన గల మంగతాయారు 'ఎప్పటికైనా ఒక సంగీత పాఠశాల ప్రారంభించాలని వుంది' అంటారు. □




పెద్దకథ:

# హేమంతవల్లి

'వింధ్యవాసిని'

అన్నిటికంటే నాకాశ్చర్యం కలిగించింది విజయ నాతో అంత ఆత్మీయంగా మాట్లాడటం. నా ముఖంలో ఆ ఆశ్చర్యం తనకి కనిపించిందేమో, తలవంచుకుని, "అంతా చెప్పారాయన. మిమ్మల్ని అనవసరంగా అపార్థం చేసుకున్నాను. నన్ను క్షమించరూ?" అంది. దాదాపు నలభై ఏళ్ళు దగ్గరపడుతున్న విజయ అలా చిన్నపిల్లలా అడుగుతుంటే నవ్వొచ్చింది. ఇంత బాగా అర్థం చేసుకోగలిగిన మనిషేనా అప్పుడపార్థం చేసుకున్నది అనిపించింది నాకు. మొదటే తన మనసు విప్పి చెప్పకపోవటం సత్యమూర్తి తప్పేనేమో అని తోచింది.

మేం వెళ్ళేసరికి సత్యమూర్తి తన పడకమీద పడుకుని, కళ్ళు తెరచుకుని అటూ ఇటూ చూస్తున్నాడు. ముఖమూ, పెదవులూ బాగా పాలిపోయి వున్నాయి. కళ్ళు రక్తమే లేనట్లు గాజుగోళాల్లా వున్నాయ్. చేతులూ, కాళ్ళూ—నరాలు, ఎముకలూ తేలివున్నాయి. జబ్బు—మనిషిని బాగా పీల్చేసినట్లుంది. అన్నీ తెలిసినవాడు ఎందుకింత నిర్లక్ష్యం చేసి ఇలా పీకల మీదకి తెచ్చుకున్నాడా అనిపించింది.

విజయ వెంబడి వస్తున్న నన్నుచూసి లేచి కూచోబోయాడు. కానీ వీలుకాలేదు. విజయ వెళ్ళి దిండ్లువేసి లేపి మెల్లిగా ఆన్చి కూచోబెట్టింది.

"బావున్నారా సీతా?" అనడిగాడు నీరసంగా. మేమిద్దరం ఎలా కలిసొచ్చామా అనే ఆశ్చర్యం వుంది అతని ముఖంలో. "ఒకమ్మాయిని చూడాలని హాస్పిటల్‌కి వచ్చాను. వెళ్ళిపోతూవుంటే మీ ఆవిడ కన్పించి చెప్పారు" అన్నాను.

"మాధవ ఎలా వున్నాడు?" అతనకి మాధవంటే ఎంత ప్రేమో నాకు తెలుసు. వాడు మాత్రం ఇతన్ని ఇంటికే రానియ్యొద్దని చెప్పాడు. వాడి క్షేమ సమాచారాలు ఈయనకి కావాలి. వాడికి మాత్రం ఈయన గుర్తైనా లేరు.

"బాగానే వున్నాడు. ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్‌కి సెలక్ట్ అయి జాబ్ చేస్తున్నాడు. వాడు జాబ్‌లో చేరగానే నేను పని మానేశాను. ఈ వూళ్ళోనే వుంటున్నాం" అన్నాను.

"పెళ్ళి చేశారా?"

"ఇంకా కాలేదు. చేయాలని చూస్తున్నా. అన్నట్లు మీ అమ్మాయేదీ? ఏం చేస్తూంది తను?"

"ఈమధ్యే బియ్యే పాస్ అయింది. వూరికేవుంది." జవాబిచ్చింది విజయ.

ఇంక ఆగలేదు నామనసు. "ఏమిటి మూర్తీ? ఇలా అయిపోయారు ఎందుకింత నెగ్లెక్ట్ చేశారు? మీ ఆరోగ్యాన్ని మీరు జాగ్రత్తగా కాపాడుకోకపోతే ఎలా?" అన్నాను మందలిస్తున్నట్లుగా.

"ఏమిటోలెండి సీతా! అంతా అలా అయిపోయింది. ఏదో మామూలు కడుపునొప్పే అనుకున్నాను. ప్రతి చిన్న రోగానికీ డాక్టర్ల వెంట పడటం నాకు అసహ్యం. అంతేగానీ ఇలా ముంచుకొస్తుందనుకోలేదు....పోనీలెండి... నాకూ బ్రతకాలని పెద్ద ఆశగా లేదు....ఒక్కటే నా దిగులు....నేను పోతే

విజయకి బ్రతకగల ఆధారం—నా పెన్షనూ అవీ వస్తాయి. అయితే పాప పెళ్ళి ఎలా చేస్తుందా అనే ఎప్పుడూ భయం వేస్తుంది. నేనా ఉద్యోగం చేసి నన్నాళ్ళూ జీతమే తప్ప వేరుగా సంపాదించింది లేదు. కనీసం ఈపాటికి అమ్మాయి పెళ్ళయినా అయివుంటే నాకు సంతృప్తిగా వుండేది....పోనీంది. ఏం చేస్తాం? సంతోషంగా వెళ్ళిపోయేరాత నాకు లేదు....పోయేలోగా మిమ్మల్ని, మాధవనీ చూడాలని వుండేది....దేవుడే పంపించాడు మిమ్మల్ని ఒక్కసారి మాధవని వచ్చి పొమ్మని చెప్పమ్మా?....'' అన్నాడు ప్రాధేయ పడ్తున్నట్లుగా. అతనికి మామీదున్న అభిమానానికి నా కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

అతని సంతోషం కోసం ఏమయినాసరే చేయాలన్పించింది. కానీ నేనేం చేయగలను? ఏంచేస్తే అతనికి శాంతి కల్గించిన దాన్నవుతాను? అతను పోతే, విజయనూ వాళ్ళ కూతుర్నీ నాదగ్గరుంచుకుంటానని చెప్పనా? చెబితే మాత్రం విజయ వప్పుకుంటుందా—ముందే ఆమెకి స్వాభిమాన మెక్కువ.

హఠాత్తుగా ఏంచేస్తే బావుంటుందో స్ఫురించిందినాకు. మాధవకి, సత్యమూర్తి కూతురు ఉమని చేసుకుంటే బావుండదూ? దాంతో ఉమ పెళ్ళిదిగులూ తీరుతుంది. విజయకి మా ఇంట్లోవుండే అధికారమూ ఏర్పడుతుంది. ఈ అయిడియా బావుందన్పించింది. మాధవ నామాట కాదనడని తెలుసు. అందుకే ధైర్యంగా అన్నాను.

''మీరేం దిగులు పడొద్దు. అంతా నే చూసుకుంటాను. వీలయినంత త్వరలో ఉమకీ, మాధవకీ పెళ్ళి చేసేద్దాం. ఇంక ఏ సమస్యా వుండదు మీకిద్దరికీ, సరేనా?'' అన్నాను ఒక మంచి పనిచేసే అవకాశం వచ్చింది కదా అనే సంతోషంతో.

నేనలా అంటానని ఊహించి వుండని సంభ్రమం, సంతోషం ఇద్దరి ముఖాల్లో కన్పించాయి. ''థాంక్‌యూ సీతా! నా గుండెల మీంచి పెద్ద బరువు దింపేరు....కానీ మాధవని అడగకుండా మీరు తొందరపడుతున్నారేమో....'' అర్ధోక్తిలో ఆపేశాడతను.

''వాడి సంగతి మీకు తెలీదా మూర్తీ? నామాట కాదంటాడా వాడు. మీరలాంటి సందేహాలేం పెట్టుకోకండి. ఇవాళే వాడితో మాట్లాడి, రేపు మీదగ్గరికి తీసుకొస్తా. అమ్మాయిని కూడా తీసుకురండి విజయా—రేపు సాయంత్రం ఇక్కడికే.'' అని చెప్పి సెలవు తీసుకున్నాను.

## 23

''ఒకరి ఆనందం కోసం, మీ సుఖ సంతోషాల్ని సయితం పోగొట్టుకునే అలవాటు మీరెప్పుడు మానతారు సీతా!'' అన్న సత్యమూర్తి ప్రశ్నకి ఆలోచనలనించి తేరుకుని అతని ముఖంలోకి చూశాను.

''మరుసటిరోజు మాధవని తీసుకొస్తానని వెళ్ళిన మీరు పత్తా లేకుండా పోయారేం?''

జవాబు చెప్పలేక తల వంచుకున్నాను.

''హుఁ! మీకెందుకంత అభిమానం? మీరెంతమాట ఇచ్చినా, వాణ్ణి అడగకుండా చెప్పినదేకదా. దాన్ని పట్టుకుని ఆశపెట్టుకుని, ఆ ఆశ తీరకపోతే బాధపడేంత మూర్ఖుణ్ణి అనుకున్నారా నన్ను?''

అతని ప్రశ్నలు నన్ను దోషిని చేసి నిలబెట్టాయి. నేనేం సమాధానం చెప్పను? నిజమే. ఆ రోజలా తొందరపడి అతని అమ్మాయిని మాధవకి చేసుకుంటానని అనటం పొరబాటే. దాన్ని దిద్దుకునేదెలాగో తెలియకే కదూ నేను మళ్ళీ కనిపించకుండా పారిపోయింది.

ఆవేళ ఇంటికెళ్ళాక, ఈ విషయం ప్రస్తావిస్తే మాధవ అన్న మాటలు నాకింకా గుర్తే. ఎందుకంటే అవి శూలాల్లా నా గుండెల్లో గుచ్చుకున్నాయి కాబట్టి.

సత్యమూర్తిని ఏస్థితిలో చూపినదీ, అతనికేమని మాట ఇచ్చినదీ చెప్పాను మాధవకి. వాడేమీ మాట్లాడలేదు. రెట్టించి అడిగితే.

''ఏం? ఎవర్నయినా ప్రేమించావా బాబూ?'' అన్నాను అనునయంగా.

''అబ్బే లేదమ్మా'' అన్నాడు నసుగుతూ, అసలావిషయమై చర్చించటమే ఇష్టం లేనివాడిలా. వాడలా ఎందుకు దాటేస్తున్నాడో నాకు అంతు పట్టలేదు.

నిదానంగా ఆలోచించుకునేందుకు టయిము లేదు. అవతల సత్యమూర్తి ప్రాణం ఇవాళో రేపో అన్నట్లుంది. రేపు మాధవని తీసుకుని వస్తానని మాట కూడా ఇచ్చాను. వీడిలా నాన్చుతున్నాడేమిటా అని చిరాకేసింది.

''ఏమిటిరా నీ సందేహం? పరిస్థితి వివరించాను. ఎలాంటి పరిస్థితిలో ఈ మాట ఇచ్చిందీ చెప్పాను. నా మాట కాదనవనే నమ్మకమే నన్నిలా చేయించింది. ఇందుకు నీ అభ్యంతరం ఏమిటి?'' అన్నాను కాస్త కోపంగా.

''దయచేసి ఈ విషయంలో నన్ను బలవంతపెట్టకమ్మా'' అన్నాడు తల వంచుకుంటూ.

''హుఁ! ఈ విషయంలో నిన్ను బలవంతపెట్టరాదా? ఇంతదాకా ఎన్ని విషయాల్లో నిన్ను బలవంతం చేసి వప్పించానురా? నీవు చెప్పిందేది కాదన్నాను? నీ ఇష్టం లేకుండా, నా అభిరుచుల్ని ఎప్పుడూ నీ మీద రుద్దలేదే నేను. ఈ ఒక్కసారికి, చావు బతుకుల్లో వున్న అతనికి మాట ఇచ్చాను. ఆ మాటకి కట్టుబడలేవా నువ్వు? ఆయన మాత్రం పరాయివాడా? చిన్నప్పుడు ఆయనంటే ఎంత ఇదిగా వుండే వాడివి! ఈవేళ ఆయన కూతురు నీకు చేదయిందా?'' కోపంతో ఏం మాట్లాడుతున్నానో కూడా నాకు తెలియలేదు.

నా మాటలు వాడికీ కోపం తెప్పించినట్లు ఎర్రబడ్డ కళ్ళే చెప్పాయి. మాటలు కూడబలుక్కుంటున్న వాడిలా నా ముఖంలోకి చూస్తూ—''నువ్వంతగా అంటున్నావు కాబట్టి చెబుతున్నా. చూడు మమ్మీ! ఆయనంటే నాకు అసహ్యం. నా చిన్నప్పటి మీ స్నేహాన్నిగూర్చి నలుగురూ ఏమనుకునే వాళ్ళో నాకు తెలీదనుకున్నావా? ఆయన కూతుర్ని నేనెలా పెళ్ళిచేసుకోను? మీకున్నా లేకపోయినా వావీ, వరసలు నాకున్నాయి'' అనేసి రివ్వున చెప్పులేసుకుని బయటికి వెళ్ళిపోయాడు. అవే వాడి నోటి నుండి నేను విన్న ఆఖరి మాటలు. ఆ నాలుగు మాటలు చాలవూ నన్ను జీవితాంతం శూలాల్లా పొడవటానికి?

కన్న తల్లిదండ్రులు విధిచేతిలో కీలుబొమ్మలై వీణ్ణి వంటరి చేసి

పోయినా నా ప్రాణంలా పెంచాను. చేయిపట్టి నడిపించే భర్త పోయినా, వీడికోసం ప్రాణాలు, ఆశలు నిలుపుకుని బ్రతికాను. కన్న కొడుకు కాక పోయినా, వాడితోడిదే లోకంగా జీవించాను. ఆఖరుకు ఇదీ వాడు నాకిచ్చిన ప్రతిఫలం! ఇంతకాలమూ జీవించి ఆఖరుకు కొడుకుచేత ఇంత నింద పడాల్సి వచ్చింది! నాదీ ఒక బ్రతుకేనా? అని తల బద్దలు కొట్టుకుని చచ్చిపోదామనిపించింది. వాడికి నా ప్రేమకంటే లోకులమాటలే విలువయినవని తెలిసిపోయింది. ఇంక వాడిముఖం చూడలేను. ఇవాళ్టితో వాడికీ నాకూ సరి. ఇంతవరకూ ఉన్నది చాలు. ఈరోజే వాడి జీవితం నుంచి నిష్క్రమిస్తాను అనుకుని, అందిన బట్టలు సర్దుకుని మా వూరికి బయలుదేరాను. అక్కడ ప్రత్యేకంగా నాకని రంగయ్యగారు రాసిచ్చిన ఇల్లొకటి వుంది. దాన్ని మాధవకివ్వనక్కర్లేదని వీలునామాలో రాశారు. అదిమాత్రం వుంచుకుని మిగతా ఆస్థి అంతా ఈ మధ్యే అమ్మేసి తెచ్చి మాధవ పేర బ్యాంకులో వేశాను. అక్కడ కొన్ని రోజులు గడిపి తరవాత ఏం చేయాల్సిందీ ఆలోచించుకో వచ్చని వెళ్ళాను.

"ఇవాళ్టితో నీకూ నాకూ సంబంధం తీరిపోయింది. జన్మలో మనం ఒకరి ముఖాలొకరు చూసుకోవటం జరగదు. ఒకవేళ నువ్వు నన్ను చూడాలని ప్రయత్నిస్తే నా శవాన్ని మాత్రమే చూడగలవు" అని ఒక ఉత్తరం రాసిపెట్టి బస్ ఎక్కాను. నేనెక్కడికెళుతున్నదీ రాయకపోయినా వాడు ఊహించగలిగాడు. అందుకే నేను వెళ్ళిన కొన్ని రోజులకే, "తను తొందరపడ్డాననీ తనని క్షమించి, తిరిగి రావాలని" రాశాడు. నేను దానికి జవాబియ్య లేదు.

వారం రోజుల్లోపలే మరో ఉత్తరం వచ్చింది. నన్ను చూడకుండా తను బ్రతకలేడట. తనేవచ్చి నన్ను తీసికెళతాడట. హుఁ! మాట అనటం సులభం, కానీ వెనక్కు తీసుకోవటం సాధ్యమేనా? వెంటనే రాసేశాను– నాకోసం వస్తే, నన్ను ప్రాణాలతో చూడ వీలుకాదు అని. తరవాతెన్ని జాబులు రాశాడో లెక్కలేదు. నేను వాటిని విప్పి చూడనూలేదు. జవాబులు ఇవ్వనూలేదు.

నేను మమకారం చూపుతూ వచ్చిన వారెవరూ నాకు దక్కకుండా, లోకాన్నే వదిలిపోయారు. ఆఖరికి వీడయినా వున్నాడంటే ఇలా బ్రతికుండీ లేనివాడయాడు. తల్లి అనే గౌరవమయినా లేకుండా అంతమాట అన్నాడు. అంతమాత్రం నా మనసుని అర్థం చేసుకోలేనివాడు నాకేం కొడుకు?

జీవితమంతా ఎవరో ఒకరికోసం, వారి సేవచేస్తూ బ్రతకటంలోనే గడిచిపోయింది ఇందాకా. ఇప్పట్నించయినా నాకోసం నేను జీవిస్తాను. నాకెవరితో సంబంధం వద్దు. మిగిలిన కాలమయినా ఆ పరాత్పరుడి సేవకై వినియోగిస్తాను. పుణ్యమయినా దొరుకుతుంది అనుకున్నాను. అంతే. డబ్బు కూడినప్పుడల్లా ఒకో తీర్థమూ, పుణ్యస్థలమూ, ఆశ్రమమూ దర్శిస్తూ వొచ్చాను. నా మనసుకెక్కడ ప్రశాంతంగా అనిపిస్తే అక్కడే వుండి పోవాలని నా ఉద్దేశం.

## 24

"ఏదో అలా జరిగిపోయింది. ఇచ్చిన మాట నిలబెట్టుకునే అదృష్టం నాకు లేకపోయింది. అవన్నీ ఇప్పుడెందుకుగానీ నాకు మీగురించి తెలుసుకోవాలనే ఆత్రుతగా వున్నది" అన్నాను.

"మీరలా దాచేస్తారనీ, తప్పు మీమీదే వేసుకుంటారనీ నేనెప్పుడో ఊహించాను. నాఊహే నిజమయింది."

"నేనప్పట్లో రెండుమూడేళ్ళుగా షిర్డి సాయిబాబా పూజ చేస్తుండే వాణ్ణి. ఒకసారి షిర్డికి వెళ్ళకూడా వొచ్చాను. మీరలా మాట ఇచ్చి వెళ్ళిపోయినరోజు రాత్రి సంతోషంగా ప్రశాంతంగా నిద్రపోయాను. కలలో షిర్డిబాబా కనిపించి, ఈ స్వామి దగ్గరకి వెంటనే ప్రయాణమయి వెళ్ళమని సూచనాప్రాయంగా చెప్పినట్టుగా అనిపించింది. ఉదయం ప్రయాణం పెట్టుకుందామంటే విజయ నెత్తీ నోరూ బాదుకుంది. ఈ పరిస్థితిలో ట్రీట్‌మెంట్ లేకుండా ఇలా ప్రయాణం చేస్తే నేనెక్కడ గుటుక్కుమంటానో అని తన భయం.

"నాకొచ్చిన కలవిషయం చెప్పి ధైర్యం చెప్పాను. అయేదెలాగూ కాక మానదు. అప్పుడో ఇప్పుడో పోయేవాణ్ణి ఆస్పత్రిలో పోయేబదులు, ఆశ్రమంలో ప్రశాంతంగా ప్రాణాలు వదిలితే అంతకన్నా అదృష్టం ఏముంటుంది–అని నచ్చజెప్పాను. ఆరోజు, మరుసటి రోజు మీకోసం చూశాము. మీరు రాలేదు. మీ పరిస్థితి మాకర్థమయింది. ఇక ఆలస్యం చేయకుండా ప్రయాణమయి వచ్చాము ముగ్గురం.

"వచ్చినరోజే పలకరించారుస్వామి. నా ఆరోగ్యాన్నిగూర్చి పరామర్శించి, బెంగుళూరికి వెళితే నాకు ఆపరేషన్ చేస్తారనీ అంతా సరి అవుతుందనీ చెప్పారు. ప్రాణాల మీద పూర్తిగా ఆశ వొదులుకున్న నాకు చిన్న ఆశ కల్పించారు. ఆరోజు కల రావటం, నేను ఈ ఆశ్రమానికి రావటం, బెంగుళూరులో ఆపరేషన్ చేయించుకుని మళ్ళీ మామూలు మనిషిని కావటం అంతకంటే మిరక్యులస్‌గా జరిగాయి. ఎందుకంటే నా అదృష్టమేమో నేను అక్కడికి వెళ్ళినప్పుడే ఒక ఫారిన్ స్పెషలిస్ట్ ఆ హాస్పిటల్ విజిట్‌లో వుండటం, ఆయన నన్ను చూడటం తటస్థించాయి. ఆయనే చేశారు నాకు ఆపరేషన్.

"అటు తరువాత మా వూరికి వెళ్ళి వున్న భూములూ అవీ అమ్ముకుని హైదరాబాద్ వెళ్ళి చిన్నగా ఒక బిజినెస్ ప్రారంభించాను. బతికి బట్ట కట్టేక ఉదరపోషణ, సంసార పోషణా చేయాలిగా మరి. అనారోగ్యంతోనే వున్న ఉద్యోగం నుంచీ బలవంతంగా రిటైర్ అవాల్సి వచ్చింది.

"రోజుకి ఎన్నిసార్లు మిమ్మల్నీ, మాధవనీ అనుకునే వాణ్ణి. ముఖ్యంగా మాధవని చూడాలనే కోరిక నాలో బలంగా వుండేది. దేవుణ్ణి ప్రార్థించే వాణ్ణి.

"ఒకరోజు అనుకోకుండా వీధిలో ఒకచోట తారసపడ్డాడు. చిన్నప్పుడెప్పుడో చూశానేమో నేనసలు గుర్తుపట్టనేలేదు. వాడే గుర్తుపట్టి పలకరించాడు. 'బాగున్నారా అంకుల్?' అని. వెంటబెట్టుకుని ఇంటికి తీసికెళ్తే జరిగిన విషయమంతా చెప్పి కళ్ళనీరు నింపుకున్నాడు.

"అప్పుడలా తొందరపడి మాట అన్నా తర్వాత మీ పాత డైరీలు చదివితే అన్ని విషయాలు తెలిసాయి మాధవకి. పశ్చాత్తాప పడి మీకుత్తరాలు ఎన్ని రాసినా జవాబేలేదు. ధైర్యం చేసి మిమ్మల్ని వెతుక్కుంటూ వస్తే, ఎన్నిసార్లొచ్చినా, మీరేదో ఒక తీర్థయాత్రలో వుండేవారు. ఇంక ఎక్కడని వెతుకుతాడు పాపం. ఇలా పిచ్చివాడయి తిరుగుతున్నాడు. ఆరునెలలు ఉద్యోగానికి సెలవు పెట్టేడట–మిమ్మల్ని వెతకాలని.

''మీరెక్కడున్నా చివరికి వాడ్ని క్షమించి రాకపోరని ధైర్యం చెప్పి తిరిగి ఉద్యోగంలో చేరమని పంపాను. అనుకోకుండా తనకి హైదరాబాద్‌కే ట్రాన్స్‌ఫర్ అయింది. ట్రాన్స్‌ఫర్ అయి వొచ్చిన కొద్ది రోజుల్లోనే మాధవకీ ఉమకీ. పెళ్ళిచేశాను. మీరెక్కడున్నా తనని చూడకపోయినా. కనీసం ఆఖరుగా మీరు కోరిన కోరికయినా తీర్చి. మా అమ్మాయిని పెళ్ళిచేసుకుంటానని అతనే అడిగాడు. అంతకన్నా నేను మాత్రం కోరుకునేదేముంది ?.

'' పెళ్ళికి నెలరోజులు ముందే ఈ విషయాన్ని పేపర్లో వేయించాను. కనీసం మీరది చూసయినా వస్తారని ఎంతో ఆశ పెట్టుకున్నాం. కానీ మీరది కళ్ళతో చూడనయినా చూశారో లేదో మాకు తెలీదు. పెళ్ళినాటి కయినా మీరు రాకపోయేసరికి మాధవ చాలా బాధ పడ్డాడు.

'' పెళ్ళయాక కూడా వాడు సంతోషంగా వున్నదే లేదు. మీ దిగులుతోనే మనిషిబాగా వీక్ అయిపోయాడు. ఏదో ఒక జబ్బు చేస్తుండేది తరచుగా. మొన్నామధ్య టైఫాయిడ్ వచ్చి పదిహేను రోజులు పడుకున్నాడు.

'' మీరు కనిపిస్తే తప్ప మాధవ మనలో కలవలేడు. మీ ముఖం చూస్తేగానీ మామూలు మనిషి కాలేడు. మీరెక్కడున్నారో నని నాకు బెంగగానే వుండేది. ఆఖరికి ఈ స్వామి ఏమయినా దారి చూపుతారేమో నన్పించింది. ఇలా వచ్చాను. నేను చెప్పకుండా అయనే నాకోరిక తీర్చి. మిమ్మల్ని కనిపించేలా చేశారు నాకు.'' అని ముగించాడు సత్యమూర్తి.

అంత దాకా ఊపిరి బిగించి వింటున్న దాన్నల్లా ఇక ఒక్కక్షణ మయినా ఆగలేకపోయాను. నా సంతోషానికి అవధుల్లేకపోయాయి. వెను వెంటనే నా ప్రాణం, నా మాధవ ఎలాఅయిపోయాడా నా వల్ల—అని దిగులు వేసింది.

నా జీవితంలో నేను అహ్మద్ కన్నా. శైలజకన్నా ఎక్కువగా ప్రేమించి, అభిమానించింది మాధవనే. దానిక్కారణం పెంచిన మమకారమే అనుకుంటాను. కనీసం నేను వాడి స్వంతతల్లిని కాదని తెలియటం నాకు ఇష్టం లేక, నేనెప్పుడూ ఆ విషయాలు చెప్పలేదు. ఇప్పుడు అంతా పోయి వుంటుంది. నా పిచ్చిగానీ, తెలిస్తే మాత్రమేం వాడికి నా మీదున్న ప్రేమ తగ్గుతుందా ? పిచ్చితండ్రి నాకోసం ఎంత బెంగ పెట్టుకున్నాడు ! తల్లికోసం తపించి, తల్లి దగ్గర చేసిన పొరపాటును దిద్దుకుని క్షమాపణ కోరుకునే కొడుకు వుండటం కంటే ఏ స్త్రీకయినా అదృష్టం ఏముంటుంది ? వాడి ఉత్తరాలు కనీసం చదవకుండా నేనెంత పెద్ద పొరపాటు చేశాను ?

నా మాధవని నేనే చేతులారా పోగొట్టుకునేదాన్ని—ఆదేముడి దయే లేకపోతే ! అంతా ఆయన సంకల్పం కాకపోతే, నేనిలా సత్యమూర్తినీ ఆశ్రమంలో కలవటం చిత్రం కాదూ ? స్వామి కావాలనే నన్నూ, సత్యమూర్తినీ ఒకేసారి తన దగ్గరికి రప్పించుకున్నారు. నా బాబునీ, నన్నూ కలపటానికి ఆయన చేసిన తమాషానే ఇది !

జరిగిన ఆలస్య మెలాగూ జరిగింది. చివరగా ఒక్కసారి స్వామిని దర్శించుకుని ఒకేసారి బయలుదేరదామనుకున్నాను—సత్యమూర్తి వెంట.

సాయంత్రం వెళ్ళి మందిరం దగ్గిర కూచున్నాను. ఎప్పటిలాగే చిరునవ్వులు చిందిస్తూ వెలుపలికొచ్చి అందరిమధ్యా నడుస్తున్నారు స్వామి. నా దగ్గరకొచ్చాక ''ఏం బంగారూ ? నీ కొడుకు దగ్గరికి రేపెళ్ళిపోతావా ?'' అని అడిగారు. నేను అడగకుండానే. వెళ్ళటానికి పర్మిషన్ ఇచ్చారనుకుని సంతోషించి, ''అవును స్వామీ'' అని చెప్పి. ఆయన పాదాలకి నమస్కారం చేసుకున్నాను. ఆయన మగవారి. వయిపు వెళ్ళినప్పుడు సత్యమూర్తితో ఏవో మాట్లాడటం నేను గమనించాను.

## 25

మాధవకిప్పుడో కూతురూ. కొడుకూను. నేను తన దగ్గరికి వచ్చిన కొద్ది రోజుల్లోనే బాగా కోలుకున్నాడు వాడు. ఉమ కూడా చాలా మంచి పిల్ల. నేనంటే ఎంతో గౌరవం, అభిమానం చూపుతుంది. నాకిష్టం వచ్చినన్నాళ్ళు మనవడు, మనుమరాలితో సంతోషంగా, సంతృప్తిగా గడిపాను. ఇంక ఈ జీవితం చాలు, తిరిగి ఆశ్రమానికి వెళ్ళి అక్కడే వుండిపోదాము అన్పించింది.

నా నిర్ణయం విని ఉమా, మాధవా ఎంతో బాధపడ్డారు. నేను లేని లోటు పూరించుకోలేమని, నన్ను వెళ్ళొద్దని ఎంతగానో ప్రాథేయ పడ్డారు. నేను ఏదో వాళ్ళమీద కోపంతో వెళ్ళిపోవటం లేదనీ, ఆధ్యాత్మిక జీవితం నాకీ వయసులో అవసరమని నా మనసులో కలిగిన నమ్మకమే నన్ను పంపిస్తున్నదనీ నచ్చజెప్పి ప్రయాణ మయాను.

ఆశ్రమానికి వెళ్ళి స్వామి దర్శనం కోసం కాచుకుని కూచున్నప్పుడు ఆ రోజు స్వామి అన్న మాటలు గుర్తొచ్చాయి నాకు.

''చూడు బంగారూ ! జీవి ఈ లోకంలో ఎప్పుడడుగు పెడతాడో అప్పుడే ఒక వైకుంఠపాళీ ఆట మొదలవుతుంది. అలాంటి ఆటలో పాములనోట పడినప్పుడు అతిగా క్రుంగక పోవటమూ, నిచ్చెనలు ఎక్కినపుడు అతిగా పొంగిపోక పోవటమూ యోగులు చేసేపని. మామూలు వారు చేయనిది ! చేయలేనిది మాత్రం కాదుసుమా ! అయినా నువ్వు అడుగడుగునా కొంత నిగ్రహం చూపిస్తూనే వొచ్చావు. ఒకటి మాత్రం చెప్పగలను. నీ జీవితంలో నువ్వు దాటాల్సిన పాములన్నీ అయిపోయాయి. అయితే ఆఖరి నిచ్చెనవి ఎక్కేసమయం ఇంకా రాలేదు. అప్పుడే ఆశ్రమ జీవితం కావాలని తొందరపడతావెందుకు ? ఏ పనికయినా దాని సమయం రావాలి. అప్పుడే జరగాలి'' అన్నారాయన అవాళ.

''నీ కొడుకుని పెంచి నువ్వేదో ఘనకార్యం చేశాననుకుంటావేం? నీ కన్నకొడుకయితే పెంచేదానివి కాదూ ? నువ్వు తల్లివి కావాలనే కోరిక తీర్చుకోవటం వాడికి ఉపకారమెట్లా అవుతుంది తల్లీ !'' అని మందలించి నా కళ్ళు తెరిపించి, నా అహంకారాన్ని అణిచేశారు. నిజానికారోజు సత్యమూర్తి కనిపించకపోయున్నా, నేనే మాధవని వెతుక్కుంటూ పోయుండేదాన్నేమో !

నా అదృష్టంకొద్దీ వచ్చినరోజే ఇంటర్వ్యూ దొరికింది.

వెళ్ళగానే ''నీ కొడుకూ. అతని పిల్లలూ. భార్యా బాగున్నారా తల్లీ !'' అని పరామర్శించారు.

మౌనంగా తలవూపిన నా వయిపు చూసి చిరునవ్వు నవ్వి. ''భయపడొద్దులే. ఈసారి ఇక్కడే వుండిపోదువుగానీ, నువ్వు చెయ్యాల్సిన పనులన్నీ అయిపోయాయిగా !'' అన్నారు చేయెత్తి ఆశీర్వదిస్తూ. నేను భక్తితో ఆయన పాదాల దగ్గర నాతల ఆన్చి కొన్ని క్షణాలపాటు వుండిపోయాను. ఆ క్షణంలో నిజమయిన ఆనందం అంటే ఇదేనేమో అనిపించింది నాకు.

[సమాప్తి]




మీకు యివ్వబడిన డిజైన్ ట్రేస్ తీసి, చుట్టూ చక్కగా కుట్టబడి, నలుచదరంగా (35 సెం.మీ. x 35 సెం.మీ) వున్న గుడ్డపై కేమెల్ క్రైలిన్ రంగులతో ఆ డిజైన్‌కు రంగులు వేయండి. మీరు వేసే రంగులు వీలయినంత లేతగా వుండాలి. అందుకు కేమెల్ క్రైలిన్ మీడియమ్‌తో రంగులను పలుచన చేసుకోవచ్చు. పోటీ చేసే ప్రతి ఒక్కరూ 3 ఎంట్రీలకన్న ఎక్కువ పంపరాదు.

**బహుమతులు : రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- ఇవే గాకుండా 10 మెరిట్ సర్టిఫికెట్‌లు**

మీరు రంగులు వేసిన ఎంట్రీలను ఈ క్రింది ఎడ్రసుకు పంపండి :

పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్,

**కేమ్లిన్ ప్రైవేట్ లిమిటెడ్,** ఆర్ట్ మెటీరియల్ డివిజన్, జె.బి. నగర్, బొంబాయి 400 059

పేరు, ఎడ్రసు వ్రాసిన కవర్‌ను పోస్టేజితోసహా ఎంట్రీతోపాటు పంపితే పోటీ చేసే ప్రతి ఒక్కరికీ ఒక ట్రాన్స్‌ఫర్ పంపబడుతుంది.

మీ ఎంట్రీతో జతపరిచే 'ట్యాగ్'పై మీ పేరు, చిరునామా ఇంగ్లీషులో వ్రాయండి. మీ ఎంట్రీ తిరిగి పంపబడదు.

**ఎంట్రీలు పంపవలసిన ఆఖరు తేది : 31-10-1978**

**CONTEST NO. 8**

Vision

---

**Join Camel School of Art Correspondence Course.**
**Contact the above mentioned address for details.**

# డాలీ రిజ్వీ

**'వనిత'** పాఠకులకు డాలి రిజ్వీ పేరు పరిచితమే. వివిధ రంగాలలో ఆరితేరిన 'వనిత'లను ఎందరినో ఆమె పాఠకులకు పరిచయం చేశారు. ఆమె స్వయంగా చక్కటి రచయిత్రి, జర్నలిస్టు, నటి. ఎన్నో నాటకాలు రాసి దర్శకత్వం వహించారు కూడా. వర్ణచిత్రంతో ఆమె పరిచయ వ్యాసాన్ని ఇక్కడ పొందుపరుస్తున్నాము:

పువ్వు పుట్టగానే పరిమళిస్తుందన్నట్లు డాలి రిజ్వీకి సాహిత్యంలో అభిలాష చిన్ననాటి నుంచే



కలిగింది. 'అప్పట్లో వారి కుటుంబ మిత్రుడొకాయన వీలర్స్ పుస్తకశాలను నిర్వహిస్తూ వుండేవాడు. ఆయన వారింటికి వచ్చినప్పుడల్లా ఆంగ్ల సాహిత్యంలోని ఉత్తమ గ్రంథాలను తీసుకువచ్చి యిస్తూ వుండేవాడు. డాలి ఆ పుస్తకాలను అక్షరం ముక్క విడిచి పెట్టకుండా చదివేది. అప్పుడామె వయసు పన్నెండు సంవత్సరాలు. ఆ పుస్తకాలలోని విషయ సంగ్రహాన్ని అర్థం చేసుకునే వయసుకాదది. కాని డాలి ఆ పుస్తకాలలోని భావాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తూ అలా ఎన్నో పుస్తకాలు చదివింది. వాటిలో విశ్వవిఖ్యాత రచయి(త్రు)తలైన ఎమిలి బ్రాంటే, జోలా, టాల్‌స్టాయ్, మేరీ కరోలి, షేక్స్పియర్‌ల గ్రంథాలు వున్నాయి.

ఈ పుస్తకాలు ఆమెలోని రచనాభిలాషను పెంపొందింపజేశాయి. భవిష్యత్తులో ఆమె చక్కటి రచయిత్రిగా మారడానికి దోహదం చేశాయి.

బొంబాయిలో జన్మించిన డాలి – పెరుగుదల కర్ణాటక రాష్ట్రంలోని గుల్బర్గాలో. తల్లిదండ్రులకు ఏకైక సంతానం ఆమె. అక్కడ ఆమె తండ్రి వ్యాపారం చేస్తూ వుండేవారు. ఆ రోజుల్లో గుల్బర్గాలో మంచి పాఠశాలలేవీ లేవు. ఉన్న ఒక్క మిషనరీ స్కూలులోనూ కన్నడ భాషలోనే పాఠాలు చెప్పేవారు. దాంతో ఆమెకు ఇంటివద్దనే పాఠాలు చెప్పేందుకు వీలుగా ఆమె తండ్రి ఒక ఉపాధ్యాయుణ్ణి ఏర్పాటు చేశారు. ఆమె నేర్చుకున్న విద్య అంతా అదే।

కొన్నాళ్ళ తరువాత నైజాం నవాబు మీద పోలీసు చర్యలు జరగడం, అన్ని ప్రాంతాలతో పాటు గుల్బర్గాలోనూ అల్లర్లు చెలరేగడం జరిగాయి. దాంతో గుల్బర్గాలోని తమ వ్యాపారాన్నంతా విడిచిపెట్టి వారి కుటుంబం బొంబాయికి వలస వెళ్ళవలసి వచ్చింది. కుటుంబ పరిస్థితుల దృష్ట్యా ఆమెకు తన కాళ్ళ మీద తాను నిలబడాలనే కోరిక కలిగింది. కనీసం ప్రాథమిక పాఠశాల గోడల దాకా కూడా వెళ్ళని తన విద్య అందుకు అడ్డంకిగా నిలిచింది అని బాధపడింది డాలి. కాని కృషి, పట్టుదల, దీక్ష ఆమె చేత సెక్రటేరియల్ కోర్సు చదివింపజేశాయి. ఆ కోర్సులో డిప్లొమా సంపాయించి చివరికెలాగయితేనేం ఒక ఉద్యోగం పొందగలిగింది.

రచనా వ్యాసంగం ప్రారంభించిన తొలి రోజులలో ఆమె ఏమీ తోచనప్పుడల్లా హిందీలో ప్రేమ కథలు రాస్తూ వుండేవారు. నేడు తను రాసిన ఆ కథలనే 'చెత్త' అని కొట్టి పారేస్తారు ఆమె.- అభిమానుల ఆదరణ అవి పొందినప్పటికీ.

డాలి రిజ్వీకి రచనతోపాటు చిన్నప్పటి నుండీ నటనలోనూ ఆసక్తి వుండేది. ఆ అభిలాష ఆమెను ఆలిండియా రేడియో వైపు లాక్కు వెళ్ళింది. ఆ విధంగా ఆమె గత రెండు దశాబ్దాలలో సుమారు నూటఏభయి రేడియో నాటికలలో పాల్గొన్నారు. వీటిలో చాలా నాటకాలు ఆమె స్వయంగా రాశారు కూడా. స్త్రీలకు, బాలలకు, వృద్ధులకు – ఇలా వివిధ వర్గాలకు చెందిన వారికోసం ప్రత్యేకంగా రాసిన నాటకాలు యివి.

ఆమె అంతటితో ఊరుకోలేదు. ఆమెలోని కళాతృష్ణ ఆమెను స్వయంగా ఒక నాటక సంస్థ ప్రారంభించేటట్లు చేసింది. తన సృజనాత్మక శక్తికి నిదర్శనంగా దానికి 'క్రియేటివ్ యూనిట్' అని పేరుపెట్టారు డాలి రిజ్వీ. ఆ యూనిట్ తరఫున ఆమె భారతదేశంలోని వివిధ నగరాలలో ఎన్నో నాటకాలను ప్రదర్శించారు. ఆ నాటకాలలో చాలామటుకు ఆమె రాయడమే కాక వాటిలో నటిస్తూ దర్శకత్వం వహించారు కూడా।

ప్రఖ్యాత ఆంగ్ల రచయిత ఆర్థర్ మిల్లర్ 'ఆఫ్టర్ ది ఫాల్' అనే నవల రాశారు. ఈ నవల మార్లిన్‌మన్రోతో ఆయన గడిపిన జీవితానికి సంబంధించిన స్వీయకథ. దానిని హిందీలోకి తర్జుమా చేయించి నాటకరూపంలో ప్రదర్శించారు డాలి. ఆ నాటకంలో నటించినందుకు, దర్శకత్వం వహించినందుకు ఆమెకు ఎనలేని పేరు ప్రఖ్యాతులు లభించాయి. ఆమెకు తను ప్రదర్శించిన నాటకాలలో నచ్చిన నాటకం కూడా అదే।

బొంబాయి నగరంలోని బాలబాలికలకు హిందీలో – ప్రత్యేకించి వారికోసం – నాటకాలు వేయడం కూడా ఆమెతోనే ప్రారంభమయ్యింది. ఆ విధంగా ఆమె రాసిన మొదటి నాటకం–'ఏక్ రాత్ కో'. నాట్య సంఘంవారు నాటక కళకు యిచ్చే పట్టానికిగాను ఆమె ఆ నాటకం 1962లో రాశారు. ఆ నాటకం అప్పటి నాట్యసంఘం ప్రధానాచార్యులైన శ్రీ అల్‌కాజీ ప్రశంసలు పొందింది. జనాదరణ కూడా విరివిగా లభించింది. ఆంగ్లంలో ఆమె రాసిన మొదటి బాలల నాటకం – 'టిర్ మూర్‌సింగ్ అతని చంచాలు' – ప్రస్తుతం అచ్చులో వున్నది.

అసలు ఆమె పత్రికలకు రాయడమన్నది విచిత్రమైన పరిస్థితులలో ప్రారంభమయింది. రచనా వ్యాసంగం ప్రారంభించకముందు – ఆమె పత్రికలలో వచ్చే వ్యాపార ప్రకటనలకు మోడల్‌గానూ, ఫ్యాషన్ పెరేడ్స్‌లలోనూ పాల్గొంటూ వుండేవారు. ఆ సమయంలో ఒక ఫొటోగ్రాఫర్ ఆమెను 'ధర్మయుగ్' పత్రిక సంపాదకుడు డాక్టర్ ధర్మవీర్ భారతికి పరిచయం చేశాడు. ధర్మవీర్ భారతికి ఒక మోడల్ నిత్యజీవితం గురించి తెలియజేసే వ్యాసం ప్రచురించాలన్న ఆలోచన చాలా కాలంగా వున్నది. డాలి రిజ్వీని ఆ వ్యాసం రాయమని-ఆయన కోరారు. ఆ విధంగా ఆమె మొదటి వ్యాసం అచ్చయింది. అప్పటి నుండి ఆమె ధర్మయుగ్, నవభారత్ టైమ్స్, సన్‌డే టైమ్స్, ఫెమీనా, సన్‌డే స్టాండర్డ్ వంటి ప్రముఖ, హిందీ ఆంగ్ల పత్రికలకే కాక 'వనిత'కు కూడా రాస్తూనే వున్నారు.

'భారత దేశపు ప్రఖ్యాత సంగీత విద్వాంసులు' అనే పుస్తకం బాలలకోసం ఆమె రాసిన మొదటి పుస్తకం. చిన్న పిల్లలకు సులభంగా అర్థమయ్యే శైలిలో ఆ పుస్తకాన్ని రాశారు ఆమె. ఆ పుస్తకం ఈ సంవత్సరం తృతీయ ముద్రణకు నోచుకున్నది. ఈ పుస్తకం ఆమెకు పేరు ప్రఖ్యాతలు సంపాయించి పెట్టిందనడానికి నిదర్శనం–మహారాష్ట్ర ప్రభుత్వం అందులోని ఇద్దరి జీవిత విశేషాలను ఆంగ్ల పాఠ్య గ్రంథమైన 'బాలభారత్‌లో' ఒక భాగంగా స్వీకరించడమే। డాలికి నీలోఫర్ అనే యుక్త వయస్కురాలయిన కుమార్తె వున్నది. నీలోఫర్ బొంబాయిలోనే బ్యూటిషియన్‌గా వుంటున్నది.

ఒక చెంప ఇంటిని, భర్తను, కుమార్తెను కనిపెట్టుకుని వుంటూనే–పత్రికలకు వ్యాసాలు, కథలు, రేడియో నాటికలు రాయడం, హిందీ చిత్రాలను విదేశాలలో ప్రదర్శించేందుకు అనువుగా ఆంగ్లంలో తర్జుమా చేయడం, రేడియో వ్యాపార ప్రకటనలు రికార్డు చేయడం, క్యాన్సర్ వ్యాధిగ్రస్తుల సహాయ సంస్థకు పౌర సంబంధ కార్యకలాపాలు చూడడం–యిలా ఒకటని కాక ఎన్నో వ్యాపకాలను విజయవంతంగా నిర్వహిస్తున్నారు ఆమె. ☐

విజయవాడ పట్నం నుండి, 1978 జూన్‌లో టోకియోలో జరిగిన అంతర్జాతీయ లయన్స్ మహాసభలకు 23 మందితో కూడిన ఒక బృందం వెళ్ళింది. అందులో 19 మంది పురుషులు, నలుగురు స్త్రీలు ఉన్నారు. పురుషులు లయన్స్ క్లబ్ సభ్యులుగాను, స్త్రీలు లయన్స్ లేడీస్‌క్లబ్ సభ్యులుగాను ఉన్నారు. వివిధ రంగాలలో తాయి. సుఖమయమైన జీవితాన్ని వారు గడుపుతున్నారు.

జపాన్‌లో బూట్‌పాలిష్ చేయించుకోవాలంటే ఎనిమిదిరూపాయలు, ప్లేటు అన్నం కావాలంటే తొమ్మిదిరూపాయలు, పచ్చడి కావాలంటే ఐదు రూపాయలు, ఆపిల్ తినాలంటే పదిరూపాయలు చెల్లించాలి. తినుబండారాల విషయానికి వస్తే మన దేశం ఎంతో చౌక అనిపించింది. ఐతే, వస్తువులు కనిపిస్తాయి. అందరూ కుటుంబ నియంత్రణను పాటించడం వల్ల ఇంటికి ఇద్దరు ముగ్గురు పిల్లలు మించి కనబడరు. బలవర్ధకమైన ఆహారం తీసుకుంటున్నందువల్ల ఎంతో అందంగా బొద్దుగా ఆకర్షణీయంగా బొమ్మల్లా కనిపిస్తారు. ఎక్కువ సంతానాన్ని కలిగి ఉంటే ప్రభుత్వం ఆ దంపతుల జీతంలో కోత విధిస్తుంది కూడా!

# తూర్పు దేశాలలో మూడు వారాల పర్యటన....

ఈ నలుగురు స్త్రీలు విశిష్ట సేవ చేసి పలువుర ప్రశంసలనందుకున్నారు. ఈ బృందానికి విజయవాడ లయన్స్‌లేడీస్‌క్లబ్ ఉపాధ్యక్షురాలు శ్రీమతి టి. శారదాగుప్త నాయకత్వం వహించారు. బృందంలోవిఇతరస్త్రీ సభ్యులు శ్రీమతి సి.హెచ్. లక్ష్మీసామ్రాజ్యం, జె. హైమవతి, ఎం. రత్నావతి. వారు 18 రోజులపాటు జపాన్, మలేసియా, తాయిలాండ్, హాంగ్‌కాంగ్, మనిలా, సింగపూర్ మొదలైన ప్రాంతాలను సందర్శించారు.

తూర్పుదేశాలను సందర్శించినప్పుడు—అవి చాలా తక్కువ వ్యవధిలో సాధించిన గణనీయమైన ప్రగతికి తాము అచ్చెరువు చెందామని బృందం సభ్యులు అన్నారు. తమ పర్యటన విశేషాలు 'వనిత'కు వివరిస్తూ – వారిలా తెలియజేశారు.

"మేము ఎక్కడికి వెళ్ళినా ఆయా దేశాల ప్రజలు మమ్మల్ని ఎంతో మర్యాదగా చూశారు. మేము కట్టుకున్న చీరెలు చూచి అవి ఎంతో బాగున్నాయనీ, అవి ఎలా కట్టుకుంటారనీ, బొట్టు ఎందుకు పెట్టుకుంటారు, రకరకాల బొట్లు ఎలా పెట్టుకుంటారు? అని ఎంతో ఆసక్తిగా అడిగి తెలుసుకున్నారు. ఈ దేశాలలో 5 శాతం మందికి మాత్రమే ఇంగ్లీషు తెలుసు. వారు తమ మాతృభాషలోనే మాట్లాడతారు. జపాన్‌లో ఉన్నప్పుడు మాకు భోజనం విషయంలో కొంత ఇబ్బంది కలిగింది. మిగిలిన దేశాలలో భారతీయ ఆహార పదార్థాలు దొరికాయి. కాని మన దేశంతో పోల్చి చూస్తే జపాన్‌లో జీవన ప్రమాణం చాలా ఎక్కువ అనిపించింది. అందరూ కిష్టపడి సంపాదిస్తారు. వారికి జీతాలు పెద్ద మొత్తంలో ముద



టి. శారదాగుప్త



లక్ష్మీసామ్రాజ్యం



ఎం. రత్నావతి



జె. హైమవతి

జపాన్‌లో ఒక్కొక్కరు నెలకు కనీసం రు. 8000 జీతం సంపాదిస్తారు.

ఈ దేశాలలో అందరూ 'పంక్చువాలిటీ' మెయిన్‌టైన్ చేస్తారు. టైమ్‌కు ఎక్కువ విలువ ఇచ్చి ఒక్క నిమిషం కూడా వృథాగా పోనివ్వరు. స్త్రీలు కూడా వ్యాపార రంగంలో ప్రవేశించి పురుషులతో సమానంగా ముందంజ వేస్తున్నారు.

పిల్లలకు ఆరు సంవత్సరాల వయసు వచ్చే వరకు స్త్రీలు ఉద్యోగాలు చేయకుండా ఇంటిపట్టునే వుంటారు. పిల్లలు ఎదిగిన తర్వాత వారు ఉద్యోగాలకు వెడతారు. ఈ దేశాల ప్రజలలో ఎక్కువ మంది బౌద్ధమతం మీద విశ్వాసం వున్నవారే.

వివాహానికి మన సమాజంలో లాగానే ఎంతో పవిత్రభావం ఉన్నది. విడాకులు చాలా అరుదుగా జరుగుతూ ఉంటాయి. కట్నాల పిశాచం అక్కడ కనిపించలేదు. ఎక్కువమంది ప్రేమ వివాహాలు చేసుకుంటారు. పురుషులు, స్త్రీలు సమానంగా చదువుకుని ఉద్యోగాలు చేస్తున్నందువల్ల వారిరువురికి సమాజంలో సమానమైన గౌరవం లభిస్తున్నది.

ప్రతి ఇంటిలో కలర్ టెలివిజన్, కారు, రెఫ్రిజిరేటర్, కెమెరా, కాసెట్ రికార్డర్లు మొదలైన ఎలక్ట్రానిక్ పరికరాలు, ఆధునికమైన

టోకియోలో 'ఎక్స్‌పోలాండ్' సందర్శించి సరదాగా అక్కడ తిరిగాము. గైషాస్ నిర్వహించే టీహౌస్ కూడా చూశాము. గిరజాలో డిపార్టుమెంటల్ స్టోర్స్ చూశాము.

ఈ దేశాలలో ట్రాఫిక్ పెద్ద సమస్యగా తయారయింది. ఎక్కడ చూచినా వేలకొద్ది బారులు తీరిన మోటారు వాహనాలు కనిపిస్తాయి. దుకాణాలు ఆదివారం నాడు కూడా తెరిచి ఉంటాయి. దొంగతనాలు, హత్యలు, మానభంగాలు అంటూ జపాన్‌లో ఎక్కువ జరగవు. అందరూ నిజాయితీగా మంచితనంగా ఉంటారు. అర్ధరాత్రి అయినా విదేశాల నుండి వచ్చిన స్త్రీలు సహితం, సురక్షితంగా బయటకు వెళ్ళి రావచ్చును. అక్కడ అంత భద్రత కనిపించింది మాకు"

"మలేసియాలో రబ్బర్ తోటలు, బ్యాంకాక్‌లో బుద్ధుని స్వర్ణ విగ్రహం (5½ టన్నుల బరువు) ఫ్లోటింగ్ మార్కెట్, మొసళ్ళపార్కు, హాంగ్‌కాంగ్‌లో సముద్ర గర్భంలో నిర్మించిన సొరంగ మార్గం, సముద్రంలో పార్కు, టోకియోలో టెలిమాన్ టవర్, ఫ్యూజీ పర్వతాలు, ఎక్స్‌పోలాండ్‌లో వినోదయాత్ర మా హృదయంలో చిరకాలం మిగిలిపోయే సుందర దృశ్యాలు, ఎన్నటికీ చెరగిపోని తియ్యనిభావాలు." అన్నారు వారు.

—మీరా


तमसो मा ज्योतिर्गमय
అద్భుతమైన రసమయ అనుబంధం
రమ్యమైన అనురాగ బంధం
మఫత్‌లాల్
సూటింగులు,
షర్టింగులు, చీరలు,
డ్రెస్‌మెటీరియల్స్
డెనిమ్స్.
మఫత్‌లాల్ బట్టలు: అనంతమైన భారతీయ పరంపరలో ఓ భాగంగా.


MAFATLAL
GROUP

# ఉద్యోగాలు: జీవితభీమా

నా సన్నిహిత స్నేహితుడు ఒకాయన సహకార బ్యాంక్‌కు మేనేజర్‌గా ఉండేవారు. ఉదారస్వభావం కల ఆయనకు బంధుమిత్రుల మధ్య మంచి గౌరవాదరణలు ఉండేవి. భార్య, ముగ్గురు పిల్లలతో వారి సంసారమురళి ఆనందరవళి వెదజల్లేది।

కాలం అలాగే సాగివుంటే ప్రస్తుతం ఆయన ప్రస్తావన వచ్చేదికాదేమో।

ఉన్నట్టుండి విధి వక్రించి ఆ మురళిలో అపశ్రుతి పలికించింది. హఠాన్మరణం ఆయన్ను కబళించింది. ముప్పైఐదేళ్ళు నిండిన ఆయన భార్య-ముగ్గురు పిల్లలతో ఎటు వెళ్ళడానికీ తోచక నడివీధిపాలు కావలసిన నిస్సహాయస్థితి ఏర్పడింది।

ఆ సమయంలో నేను ఆమెను కలుసుకుని ఒక సలహా యిచ్చాను. ఆమెకు సన్నిహితురాలైన ఒక ఉన్నత పాఠశాల ఉపాధ్యాయిని ద్వారా—ఆ ఉద్యోగం ఆమెకు ఇతోధికమైన చేయూత నివ్వగలదని నచ్చచెప్పాను. ఆమె పెద్దగా చదువుకోలేదు. కాని ఆ వృత్తిని స్వీకరించింది. ప్రారంభదశలో కొన్ని ఇబ్బందులు ఎదురైనాయి. రోజులు గడిచేకొద్దీ అందులో ఒక నిశ్చలమైన పరిస్థితి యేర్పడింది. ఆర్థికంగా ఆమె తన కాళ్ళపై నిలబడగలిగింది. అంతేకాదు. పిల్లలకు పెద్ద చదువులు చెప్పించి ప్రయోజకులుగా చేయగలిగింది.

అంధకార బంధురమైన జీవిత ఘట్టంలో ఆమెలో ఆశాజ్యోతులు వెల్గించి దారిచూపిన పథకం—జీవిత భీమాపథకం। ఆమెకు జీవనోపాధి కల్పించి చేయూతనిచ్చినది—జీవిత భీమా ఏజెంటు వృత్తి।

ఆమెకే కాదు—ఆమెలా ఆర్థికసమస్యలతో సతమతమయ్యే మధ్య తరగతి ప్రజానీకానికి పరిష్కారమార్గం చూపేదీ జీవిత భీమా ఏజెన్సీ పథకం। ఇక్కడో ముఖ్యమైన విశేషం ఏమంటే- ఇది పురుషులకు మాత్రమే పరిమితమైన వృత్తి కాదు. స్త్రీలు కూడా ఏజెంట్లుగా చేరి ఇరుగుపొరుగు వారి జీవితాలకు భద్రత చేకూర్చి దాని ద్వారా తమ జీవితాలు నల్లేరుపై బళ్ళలా సాగేవిధంగా జాగ్రత్తపడవచ్చు. పైగా వనితల మనోస్థితికి గృహ స్థితిగతులకు తగిన ఉద్యోగం ఇది।

ఏ ఆఫీసులోనో మరే ఆస్పత్రిలోనూ ఉద్యోగమైతే దానికి ఒక నిర్ణీతసమయం వుంటుంది. దానిని అతిక్రమించి, మనకు వీలైనప్పుడు వెళ్ళి ఉద్యోగం చేస్తామంటే ఆ క్షణమే ఉద్యోగం ఊడుతుంది. ఒక నిర్ణీత సమయానికే ఆఫీసుకు వెళ్ళాలి కనుక అవి గృహకృత్యాలకు అడ్డుపడి అవరోధం కల్గిస్తాయి. అలా కాకుండా తమ ఇష్టానుసారం తమకు తీరిక వున్న సమయాలలో చేసుకోడానికి సౌకర్యంగా ఒక ఉద్యోగం వుందంటే అది మధ్య తరగతి మహిళలకు తప్పకుండా ఆశ్చర్యం, ఆనందం కల్గిస్తాయి. అలాంటి అవకాశం ఏజెంట్లకు కలుగజేస్తుంది జీవిత భీమా పథకం।

కూతురుగా, తోబుట్టువుగా, ఇల్లాలుగా, తల్లిగా జీవితాన్ని అనుభవించేదీ, నిశితంగా పరిశీలించేదీ—స్త్రీ। నిజానికి ఇంటిని నడిపేది ఇల్లాలే కదా? అంచేత బ్రతుకుల బరువులు, జీవితంలోని లోతుపాతులు, ఒడుదుడుకులు, సుఖదుఃఖాలు ఆమెకు బాగా తెలుసు. అందువల్ల వాటిని సూటిగా, వినేవారు సులభంగా నమ్మే విధంగా వివరించి చెప్పడంలో పురుషుని కన్న వనితే సమర్థవంతంగా కనబడుతుంది.

స్త్రీలు నైజంగానే సౌమ్యంగా వుంటూ, ప్రేమతో, దయాస్వభావంతో పలకరిస్తూ వుంటారు. పిల్లలను చదివించడానికి, వారికి పెళ్ళిళ్ళు చేయించడానికి జీవిత భీమా పథకం ఎలా చేయూతనివ్వగలదో తల్లిదండ్రులకు వివరించి చెప్పడం వారికి కొట్టినపిండి. అంతేకాదు. భవిష్యత్తు భద్రతా దృష్టితో భీమా పథకానికి మొదట అంగీకరించేవాళ్ళు మామూలుగా స్త్రీలే। స్త్రీలైతే వారిని మరీ సులభంగా ఒప్పించడానికి ఆస్కారం ఎక్కువ।

జీవితభీమా పథకంలో ఏజెంటుగా చేరాలంటే దానికి ఎలాంటి పెట్టుబడీ అవసరం లేదు.

పట్టణ ప్రాంతాలలో ఎస్. ఎస్. సి. ఉత్తీర్ణులైన వారిని, పల్లె ప్రాంతాలలో ఎనిమిదవ తరగతి చదివిన వారినీ ఏజెంట్లుగా నియమిస్తున్నారు. అందువల్ల దీనికి విద్యార్హత ఒక సమస్య కాదు.

ఇకపోతే వయోపరిమితి విషయంలో కూడా కఠినమైన నియమాలేవీ లేవు. అంచేత ఏప్రాయం వారైనా ఏజెంట్లుగా చేరవచ్చు.

ఏజెంటు ఉద్యోగానికంటూ ప్రత్యేకమైన శిక్షణ పొందవలసిన అవసరం కూడా అంతగా లేదు. అయితే, ఇలా అనడంవల్ల ఈ విషయంలో శిక్షణ, అనుభవం మొదలైన వాటికి విలువే లేదని అర్థం కాదు. ప్రతి రంగంలో లాగానే శిక్షణ, అనుభవం ఈ వృత్తిలో కూడా రాణించడానికి, సామర్థ్యానికి తప్పకుండా సానపడతాయి.

జీవితం మీద విశ్వాసం కుదిరి ఉత్సాహం పెరగాలంటే భద్రత, రక్షణ కావాలి. ఆర్థిక రక్షణ మిగతా భద్రతలకన్నిటికీ తల్లి వంటిది. అలాంటి ఆర్థిక పరిరక్షణ చేకూర్చే పథకం జీవిత భీమా పథకం! అందువల్ల పల్లెలు పట్టణాలు అన్న వ్యత్యాసం లేకుండా ప్రతిచోటా జీవిత భీమా అవసరం ఎంతైనా వుంది.

తాము నివసించేది గ్రామమైనా, నగరమైనా - తమ ఇరుగు పొరుగు వారిని బంధుమిత్రులను ఈ పథకంలో చేర్పించడానికి కృషి చేయవచ్చు. ఈ పథకంలో చేరడానికి సాధారణంగా కొందరు మొదట వెనుకాడుతూ వుంటారు. కాని వారికి జీవిత పరిస్థితులను-పథకం విలువలనూ వివరించి చెప్పినట్టయితే దానికి వారు అంగీకరించక పోరు. అలా నచ్చ చెప్పడానికి సర్వ విధాలా సమర్థవంతమైన వారు వనితలే।

ప్రతి వృత్తిలో ఉన్నట్టే ఇందులోనూ ప్రాథమిక ఇబ్బందులను, ఆరంభ దశ ఆటంకాలను ఎదుర్కోవలసి వుంటుంది. కాని వాటిని సక్రమంగా అర్థం చేసుకుని - అనుభవజ్ఞులైన వారి దగ్గర సలహాలు పొంది దీక్షతో కృషిచేసినట్టయితే దక్షత పెంపొంది విజయం సుసాధ్యమౌతుంది. కావలసిందల్లా - కృషి, పట్టుదల, దీక్ష, ఆత్మ విశ్వాసం మాత్రమే। ఈ వృత్తిని స్వీకరించ దలచుకున్న వనితలు—వాళ్ళ వూళ్లో వుండే జీవిత భీమా ఆఫీసులో కనుక్కుంటే — వివరాలు చెబుతారు.

—యస్. యన్

ఆ మాటకే ఆమెకు కొంత గుండెబరువు తగ్గినట్టుంది. కాఫీ తెచ్చి యిచ్చింది.

అతని ముఖం మీద స్పష్టంగా గాయాలు కన్పిస్తున్నాయి! ఎంత ఆపుకుందామన్నా ఆమెకు కన్నీళ్ళాగలేదు. చటుక్కున ముఖం త్రిప్పుకొని చీర చెంగుకి కళ్ళొత్తుకుంది.

ఖాళీ కప్పు అందుకుంటూ "మందు రాయనా?" అంది.

'' ఊఁ!'' అన్నాడతను. అదే ఒక సుగుణం అనిపించిందామెకు. మందు రాయించుకున్నాడు. అంతే చాలనిపించిందామెకు.

తన అదృష్టం కొద్దీ చెల్లెలూ మరిదీ యింట్లో లేరు – అని అనుకుంది కృష్ణవేణి. ఆమె అలా గనుకుని పది నిమిషాలయినా కాలేదు. 'వాళ్ళిద్దరే' కాదు – వాళ్ళతోపాటు సుజాత రామచంద్రంలు....వాళ్ళ పిల్లలు వచ్చారు. కృష్ణవేణికి మతిపోయినట్లయింది.

'' ఈ రాత్రి బండికే వెళ్ళిపోతున్నాం వదినా! ఒక్కసారి చూసి పోదామని వచ్చాం!'' అంది సుజాత.

కృష్ణవేణి యింకా ఆ అఘాతం నుంచి తేరుకోలేదు.

నిర్మల సమయానికి ఆదుకుంది. '' అదేం మాటక్కయ్యా! మా యింట్లో ఒక్క రోజు ఉండకుండా ఎలా వెళ్ళిపోదామనుకుంటున్నారు?'' అంది.

'' అవునవును. మాధవి పెళ్ళిలో మాట్లాడుకోటానికి బొత్తిగా వీల్లేకపోయింది.'' అంది కృష్ణవేణి కంగారుగా నవ్వుతూ.

'' ఏమిటలా వున్నారు? మీ వొంట్లో కులాసాగాలేదా?'' అంది సుజాత పరీక్షగా చూస్తూ.

''అబ్బే. బాగానే వున్నాను....రండి అత్తగారి దగ్గరకి వెడదాం....'' అని మాట మార్చి లోపల గదిలోకి తీసుకుపోయిందామె.

సత్యనారాయణగారితో ఏదో లోకాభిరామాయణంలో పడ్డాడు రామచంద్రం.

అత్తగారు సుజాతతో మాట్లాడుతుంటే కోడళ్ళిద్దరూ దగ్గరే కూర్చుని మాటలో మాట కలుపుతున్నారు.

మురళి చెల్లెల్ని తన గదిలోకి లాక్కెళ్ళిపోయాడు. అతనేదో అనేలోపల ''ష్! అన్నయున్నాడు....'' అని గొంతు తగ్గించింది.

అతను తెల్లబోయాడు. '' అదేమిటి? ఇంకా ఆఫీసుకి వెళ్ళలేదూ?''

'' లేదు ఒంట్లో బాగాలేదు.''

'' ఏమిటి? జ్వరమా?''

'' అబ్బే. జ్వరం కాదు....నిన్న సాయంత్రం రోడ్డుమీద వస్తోంటే ఏదో రిక్షా వచ్చి గుద్దేసిందిట కొంచెం దెబ్బలు తగిలాయి. ఇప్పుడు కులాసాగానే ఉంది'' ఈ మాటలు నిర్మల గట్టిగానే అంది.

ఎవరయితే వినాలని ఆమె ఆశించి అన్నదో అతను వననే విన్నాడు! అంతేకాదు. ఆ తర్వాత నిర్మల గొంతెత్తి అన్న మాటలు కూడా అతను విన్నాడు!

మునిగిపోయిందేముంది? ఆ వేళ్టికి మరోటి కొనుక్కోవచ్చు.''

'' ఉహుఁ! వదిన్నిలా పిలు. డబ్బడిగి తీసుకు వెళ్ళి చీర తెస్తా!''

'' ఆ పనే ఆ తర్వాత చేయవచ్చుగా!'' అంది నిర్మల తొణక్కుండా.

అతనికీ మధ్య ముందు రోజు మీద నమ్మకం తరిగిపోయింది. '' ఆ టైముకి డబ్బుంటుంది– ఉండకపోతుంది.'' అన్నాడు.

'' పుట్టిన రోజు నాడే చీర కట్టుకోవాలని ఏముంది? డబ్బున్నప్పుడే కొనచ్చు. ఎప్పుడు కట్టుకుంటే అప్పుడే బర్త్‌డే!'' అని పెద్దగా నవ్వింది నిర్మల.

సశేష నవల




విమలారామం

'' సరే, వదిన దగ్గరేమయినా డబ్బుందా?'' మురళి మాత్రం తగ్గుస్వరంలోనే అడిగాడు.

నిర్మలకేం చెప్పాలో వెంటనే పాలుపోలేదు. '' ఉండే వుంటుంది. ఎందుకు? నీక్కావాలా?''

'' నాకని కాదు....అదే వాళ్ళొచ్చారుకదా! మా పెళ్ళయాక మొదటి సారి....''

నిర్మల గ్రహించింది. ''అవును. చీర పెట్టాలి. లేకపోతే బావుండదు.''

''ఈనాల్గు రోజుల్లో తన దగ్గరున్నదంతా ఖర్చు పెట్టేసింది మీ చిన్న వదిన! మరింకెక్కడయినా తెద్దామంటే టైము లేదు.''

నిర్మల బుర్ర చురుగ్గా పనిచేసింది. '' డోన్ట్ వర్రీ బ్రదర్! నా కొత్త చీరుందిగా! అది పెట్టేద్దాం!'' అంది నవ్వుతూ.

మురళి కంఠం–పక్కగదిలో వున్న విశ్వనాథం ఎక్కువ గతుక్కుమన్నాడు!

ఈసారి తనకు తెలియకుండానే మురళి స్వరం హెచ్చించాడు. '' ఛ! అదేమిటి! నీ పుట్టిన రోజుకని కొనుక్కున్న చీర!''

నిర్మల నిండుగా నవ్వింది. '' ఇంతలో

మురళి మనస్సు ఆర్ద్రితమైంది. చెల్లెలి చేతిని తనలోకి తీసుకొని ప్రేమగా నొక్కాడు. '' నిన్ను మాటల్లో గెలవటం చాలా కష్టం నిర్మలా!....''

'' ఏమిటి అన్నా చెల్లెళ్ళు రహస్యాలు చెప్పుకుంటున్నా ''రంటూ వచ్చింది మాధవి.

'' నువ్వీనాల్గు రోజులూ ఏఏ ఘనకార్యాలు చేసావో చెపుతున్నాను........అత్తింట్లో ఇంత బుద్ధిమంతురాల్లా ఉంటుందా మీ వదిన....అక్కడ అందరి ప్రాణాలు కొరుక్కు తినేసింది....ఇంత అల్లరి పిల్లని తెలిస్తే నేను పెళ్ళాడేవాడ్ని కాదు....'' అన్నాడు మురళి నవ్వుతూ.

'' ఇప్పుడయితేనేం........ఇష్టం లేకపోతే చెప్పండి. హాయిగా వెళ్ళిపోతాను!''

వాళ్ళ ప్రణయకలహం చూసి ముచ్చటపడుతున్న నిర్మల ''ష్!'' అని విశ్వనాథం గదివైపు చూపించి సంజ్ఞచేసింది.

టక్కున మాధవి నోరుమూసి సంగతి చెవిలో చెప్పాడు మురళి.

ఆ తర్వాత రామచంద్రం - పలకరించటానికి

విశ్వనాథం గదిలోకి వచ్చినప్పుడు 'దెబ్బలెలా తగిలాయో' మురళి చెప్పాడు....అసలు విషయం విడిచి, ఈ రోజుల్లో రోడ్డు ప్రమాదాలు ఎలా జరుగుతున్నాయో మాట్లాడుకుంటూ పోయారు బావమరదులు।

నిర్మలే యీ కథ సృష్టించిందని కృష్ణవేణి గ్రహించి ముందు కంగారుపడినా అది ఖండిస్తూ విశ్వనాథం ఏమీ మాట్లాడకపోవటం ఆమె గుండె బరువుని చాలవరకు తగ్గించింది. వాళ్ళొచ్చినప్పట్నించీ లోపల్లోపల అణచుకుంటున్న వేదనని-కంగారుని కరిగించివేసింది.

అందుకనే, ఆ తర్వాత సుజాతతో మనస్సు విప్పి నాల్గు మాటలు మాట్లాడగలిగింది। తర్వాత భోజనాలవేళ నిర్మల కూడా వడ్డనలో కలగజేసుకోబోతుంటే ''మనం ఆడపడుచులం...కూర్చుని తినాలేకాని....చెయ్యకూడదు.'' అంది సుజాత పరిహాసంగా.

''నీ వ్యవహారం చూస్తుంటే ప్రతి యింటికీ వెళ్ళి ఆడపడుచు గిరీ వెలిగించేలా వున్నావు।'' అని మేలమాడాడు రామచంద్రం.

''ఎవరింటి మాటో ఎందుకు? ముందిక్కడ సంగతి చూడనివ్వండి. ఏమండోయ్ వదినగారూ। మీ తమ్ముడు కనుక ఏం చేసిపెడితే అది తింటున్నారు కాని-స్వీటు లేకుండా నేను మాత్రం కంచం ముందు కూర్చోనండోయ్।'' అంది సుజాత.

నిర్మలా కృష్ణవేణులు ముఖాముఖాలు చూసుకున్నారు. క్రితం రోజు పిండివంట గుర్తుకి వచ్చి యిద్దరి ముఖాలూ వికసించాయి. ''మీ ఒక్కరికే నేమిటి? మా తమ్ముడికీ పెడతాను....'' అంటూ నిర్మలకి సంజ్ఞచేసింది కృష్ణవేణి.

నిర్మల జిలేబీ తెచ్చి వడ్డిస్తోంటే వాళ్ళందర్కీ ఆశ్చర్యమయింది.



"ఏం? యిప్పుడేమంటావ్?....తక్కినదంతా ఆ అమ్మవారికి నైవేద్యం పెట్టు నిర్మలా!" అని భార్యని ఎగతాళి చేసాడు రామచంద్రం.

సుజాతకి నిజంగానే క్షణం పాటు మాట రాలేదు. ఆ తర్వాత చిరునవ్వు నవ్వుతూ "నిజంగా మీ అక్కయ్య మంత్రకత్తే మాధవీ!" అంది.

అందరి నవ్వులతో ఆ యిల్లు పరవశించింది.

విశ్వనాధం భార్య వైపు పరీక్షగా చూసాడు. ఆమె ముఖంలో తళతళలాడే కొత్త వెలుగు తన కళ్ళల్లో ప్రతిఫలిస్తుండగా చూశాడు. ఆమె తడి కళ్ళల్లోని పరమానందాన్ని గుర్తించి '....ఈ రత్నాల రాశిని కాలదన్నుకుంటున్న నేను ఎంత దౌర్భాగ్యుడ్ని." అని తనని తాను నిందించుకున్నాడు.

అపరాధిలా తల దించుకున్న విశ్వనాధం మనసులోని సంచలనాన్ని కృష్ణవేణి గుర్తించింది. అనేక రోజులుగా అన్నగార్ని పరీక్షించి చూస్తున్న నిర్మల గుర్తించింది. కాని, అతని నరనరంలోను జీర్ణించుకుపోయిన వ్యసనం ఈ మాత్రం పశ్చాత్తాపానికే వదిలిపెట్టిపోతుందా? ఇలాంటి సంఘటనలు ఇటీవల ఎన్ని జరగలేదు! ఇక ముందేమి జరగనుంది? ఎప్పటికతనా సంకెళ్ళు త్రెంచుకు బయిటపడతాడు?....అదే వాళ్ళకి అంతుపట్టటం లేదు.

భోజనాలు అయినాక వాకిట్లో కూర్చుని అంతా కబుర్లు చెప్పుకుంటున్నారు.

"మీరంతా మా హైదరాబాదుకి రావాలి అత్తయ్యగారూ! ఇన్నాళ్లూ వస్తామంటూ అన్నారే కాని ఒక్కసారి కూడా వచ్చారుకాదు." అన్నాడు రామచంద్రం.

"అలాగేనయ్యా! ఈ సారి తప్పకుండా వస్తాము....ఇన్నాళ్ళూ మీకూ మాకూ స్నేహం మాత్రమే–ఇప్పుడు బంధువులం కూడా అయ్యాముగా! నువ్వింక పిల్చినా వస్తాము–పిలవకపోయినా వస్తాము....మీ చెల్లెలు వచ్చినా రాకపోయినా నేను మాత్రం వస్తాను సుమా!" అంది సుభద్రమ్మ గలగల నవ్వుతూ.

"పిలవందే నేను మాత్రం రాసండోయ్ బావగారూ!" అంది నిర్మల.

"ఓ పెళ్ళికొడుకుని చూడన్నయ్యా! అప్పుడు తనే వస్తుంది" అని పరిహాసమాడింది మాధవి.

"నీ కడుపు చల్లగ మంచి మాటలు చెప్పావే అమ్మాయీ!...." అని చిన్న కోడల్ని దీవించింది సుభద్రమ్మ.

"ముందొచ్చిన చెవులకన్న వెనకొచ్చిన కొమ్ములు వాడిట....మీ అత్తా కోడళ్ళు కలిసి నన్నప్పుడే యింట్లోంచి పంపెయ్యాలని చూస్తున్నారేం?...." అంది నిర్మల మూతి ముడుచుకుంటూ.

"నిన్ను పంపెయ్యటం కాదమ్మా నిర్మలా! అల్లుడ్ని తెచ్చుకోవాలని మీ అమ్మగారికాత్రుత!" అన్నాడు రామచంద్రం.

"ఇప్పుడా మాటలన్నీ నాతోయేమీ చెప్పకండి. నాకిప్పుడప్పుడే పెళ్ళి చేసుకోవాలని లేదు...."

"ఇప్పుడప్పుడే పెళ్ళి వద్దంటావు, నువ్వింకా చిన్నపిల్ల ననుకుంటున్నావేమిటే!" అంది సుభద్రమ్మ చిరుకోపంతో.

"బావుంది!....మొన్ననేగా వెనకవీధి వర్ధనమ్మగారు వచ్చి సంబంధాలు చూస్తున్నారా అంటే ఇంకా చిన్నపిల్ల కదండీ–అన్నావు. తీరా యిప్పుడు చిన్నపిల్లని కాదు పొమ్మంటున్నావు. రెండురోజుల్లో అంతపెద్దదాన్నయిపోయాననా!"

నిర్మల మాటలకి అంతా పకపక నవ్వుకున్నారు.

"మాట దాటివెయ్యడంలో నువ్వు మంచి నెరజాణవని మా కందరికీ బాగా తెల్సుకాని.... ముందు అసలు సంగతి తేల్చు!" అంది మాధవి నిర్మల చేతిమీద తట్టుతూ.

"పెళ్ళి కాకుండానే ఐదారేళ్ళపాటు మా అన్నయ్యని నీ చుట్టూ గిరగిర త్రిప్పుకున్నావే! నాకు....ఒక్కటంటే ఒక్క యేడాదయినా ఛాన్సు రానివ్వవా వదినా!"

మాధవి బుగ్గలు కెంపులయ్యాయి. "రణపెంకి!" అని నిర్మల బుగ్గల్లో పొడిచింది.

"అయితే, నీకో పెళ్ళికొడుకుని చూస్తే మీ చిన్న వదినలాగే అతన్ని నీ చుట్టూ త్రిప్పుకుంటే కాని నువ్వు పెళ్ళాడనంటావా చెల్లెలా!" అంది సుజాత.

"అహఁ! బావగారికంత శ్రమ అక్కర్లేదు కాని....మీ హైద్రాబాద్‌లో నాకో ఉద్యోగం చూసి పెట్టమనండి. కొన్నాళ్ళు సరదాగా ఉద్యోగం చెయ్యాలని వుంది!" అంది నిర్మల.

అలా కబుర్లు చెప్పుకుంటూండగా ఉన్నట్టుండి "వదినగారూ! మిమ్మల్ని ఒక టడగాలని వుంది. ఒప్పుకుంటారా?" అని అడిగింది సుజాత.

కృష్ణవేణి చిత్రంగా చూసింది. "ఏమిటో చెప్పండి." అంది నెమ్మదిగా.

"అహఁ! ముందు మాట యిస్తే కాని.... చెప్పను."

"అడుగు....మాకేమన్నా భయమనుకున్నావా?" అని మాధవి సవాల్ చేసింది.

"నువ్వు కాదు తల్లీ! నిన్నడిగితే నీ కాలేజీ పాఠాలన్నీ చెపుతావు. అందులో ఒక్క ముక్క కూడా నా బుర్రకెక్కదు. నాక్కావాల్సింది మీ అక్కయ్య దగ్గరే వుంది. అందుకే ఆవిడను అడుగుతున్నా!"

అందరి దృష్టీ కృష్ణవేణి మీదనే ఉంది. ఆమె బెదిరే చూపులు గమ్మత్తుగా ఉన్నాయి. అందర్కీ కొత్తగా ఉన్నాయి.

"అడిగితే వద్దంటారని కాదులే!....అయినా మీ కందర్కీ తెలియనిది నేనే మడుగుతాను?" అని ఓ క్షణం ఆగింది సుజాత.

కృష్ణవేణి గుండెలెందుకో దడదడలాడాయి.

"మీరంతా అదృష్టవంతులు. ఎప్పుడు కావాలంటే అప్పుడు ఆవిడ తియ్యని పాటలు వినగలరు!...."

కృష్ణవేణి ముఖం తెల్లగా పాలిపోయింది.

"ఎన్నాళ్ళో అయింది మీ పాట విని. ఒక్కసారి మళ్ళీ వినాలని నా కోరిక. ఒక్క పాట పాడండి వదినా."

"ఇప్పుడు నేను పాడలేను. మరేమనుకోకండి!" అని తల దించుకుంది కృష్ణవేణి. ఆమె ముఖం ఎర్రగా కందిపోయింది. సుజాతా రామచంద్రంలకి అది వింత శోభనిచ్చే కాంతిగా కనిపించింది. కాని, ఆమె గుండెల్లో రగులుతున్న–నిప్పురవ్వల కాంతి ముఖం మీద ప్రతిబింబిస్తోందని వాళ్ళకి తెలియదు!....తెల్సినవాళ్ళు మూగవాళ్ళలా కూర్చుండిపోయారు!

"అదేమిటి వదినా! ఎంతో ఆశపడి అడిగాను....అసలు నేనిప్పుడు వచ్చిందే మీ పాట విందామని! నన్ను నిరుత్సాహ పరుస్తారా?" సుజాత ప్రాధేయపడింది.

కృష్ణవేణి తల ఎత్తలేకపోయినా ఎలాగో గొంతు పెగల్చుకుంది. "గొంతు విప్పి ఎన్నో

రోజులయింది....అన్నీ అపశ్రుతులే పలుకుతాయని నా భయం!" అంది తడబడుతూ.

"ఫర్వాలేదు వదినా! నీ కమ్మని పాటకి శ్రుతి తప్పటమంటూ లేదు. కంఠం విప్పు....కటిక గుండెలు కరుగుతాయి." క్రీగంట విశ్వనాధాన్ని చూస్తున్న నిర్మల కంఠం ఖంగుమని పలికింది.

ఆ మాట లర్థమయిన వాళ్ళు కంగారుగా తలలు దించుకున్నారు....అర్థం తెలియని వాళ్ళు కుతూహలంగా నిర్మలనీ కృష్ణవేణినీ మార్చి మార్చి చూసారు. తన పిల్లలు అల్లరి చేస్తోంటే "అత్తయ్యగారు పాట పాడతారు. మాట్లాడకుండా కూర్చోండి." అంది సుజాత.

చిట్టి సుభద్రని తన ఒళ్ళో కూర్చోపెట్టుకుని, "అమ్మ పాడుతుంది చూడు!" అంది నిర్మల. అమ్మ పాడటం యేమిటి – ఇదేం వింత అన్నట్టు చూసింది సుభద్ర.

ఇక తప్పని సరి అయింది కృష్ణవేణికి. సర్వ శక్తుల్నీ కూడ దీసుకుంది. భావోద్వేగాన్ని అణచుకుంటూ అతి కష్టం మీద గొంతు శ్రుతిచేసుకుంది.

ఆమె కొత్తమనిషి కాదు. ఆమెపాట కొత్తది కాదు. కాని, ఆమె స్వరంలో కొత్తదనం ఉంది. ఆ స్వర కంపనంలో కొత్త శ్రుతులున్నాయి. ఆ శ్రుతుల్లో కొత్త భావాలు ఉన్నాయి. ఆ భావాలకి గుండె కుదుళ్ళని కదలించగల శక్తి ఉంది!

'ప్రియుడెక్కడికో వెళ్ళిపోయాడని – ప్రియురాలు పడే వేదన!'

అనేక సంవత్సరాలుగా అనేక మంది అనేక రకాలుగా పాటలు కట్టారు, అనేక మంది అనేక విధాలుగా గానంచేసారు. ఎంతోమంది వీనుల విందు చేసుకున్నారు....గుండెలు కరిగించుకున్నారు. హృదయగానం చేసుకున్నారు!

ఇప్పుడూ అంతే జరిగింది. కృష్ణవేణి పాటలో లీనమై సుజాత ఒళ్ళుమరిచిపోయింది. రామచంద్రం పరిసరాల స్పృహనుంచి కళ్ళప్పగించి చూసాడు. సుభద్రమ్మకి పరమానంద మయింది. ఆ కాసేపూ సత్యనారాయణగారు 'లాటరీ టిక్కట్లు' కూడా మరచిపోయాడు!

కృష్ణవేణి స్వయంగా తాననుభవిస్తున్న బాధను గొంతులో పలికిస్తోందని....తక్కిన వాళ్ళందర్కీ అర్థమయింది. మూడడుగుల దూరంలో కూర్చున్న భర్తకి తనకూ మధ్య ఎంత అగాధం వుందో ఆమె గుండె చించుకుని గొంతులో పలికించింది. అందుకనే, గానంవిన్న ఆనందం కన్న— 'గాయని' పడేవేదనే వాళ్ళగుండెల్ని కదలించి కన్నీళ్ళు చిందించింది!

'ఏ నాటికయినా తిరిగి వస్తావనే కొనప్రాణం నిలబెట్టుకుంటున్నాను,' అని పాట చివరి భాగానికి అర్థం. ఆ చరణం వచ్చేసరికి ఉద్వేగం అణచుకోలేక పోయింది. ఆమె కన్నీళ్ళు బుగ్గల మీద జారి ఆగిపోలేదు. గొంతు బొంగురుపోయి ఊరుకోలేదు. తెరలు తెరలుగా దుఃఖం పొంగి వచ్చేసింది. ఒక్క ఉదుటన లేచి నోట్లో చీరకొంగు క్రుక్కుకొని దొడ్లోకి వెళ్ళిపోయింది.

తటాలున లేచి విశ్వనాధం తన గదిలోకి వెళ్ళిపోయాడు. ఎవరికీ గొంతు పెగల్లేదు. వాతావరణాన్ని ఎలా తేలికపరచాలో ఎవరికీ తోచలేదు!

"అమ్మేలుత్తోంచేం?" అన్న సుభద్ర ప్రశ్నకి జవాబు చెప్పగల శక్తి నిర్మలకి లేకపోయింది.

## పెనుభూతం

"ఇది" మెదడులో చొరబడిందంటే
మమతను, మానవతనూ మంటగలుపుతుంది
బంధాలను అనుబంధాలనూ
బలి తీసుకుంటుంది
నిష్కల్మషమైన స్నేహాన్ని "మోహం"గా
చిత్రిస్తుంది నిర్మలానురాగాన్ని
నిష్కారణంగా అపహసిస్తుంది

సంస్కారానికి సమాధి కడుతుంది
సమస్యలకు శ్రీకారం చుడుతుంది

మనసులను విరిచి, వేధిస్తుంది
మనుషులను విడదీసి బాధిస్తుంది

ఆత్మ విశ్వాసం కొరవడితేనే
"ఇది" అంకురిస్తుంది
అసూయ ఆవరిస్తేనే "ఇది" విజృంభిస్తుంది

అపార్థం దీని నైజం–అనర్థం దీని ధ్యేయం
అజ్ఞత దీని ప్రాణం–కృతజ్ఞత దీనికి శూన్యం

అదే–అదే–
రవంత కరుణలేనిది–
అత్యంత దారుణమైనది
వస్తే తిరిగిపోని అనుమానం
వస్తే చావురాని పెనుభూతం

—కె. ఆషాలత

## 29

నిర్మల చెప్పింది అబద్ధమని ఆ మర్నాడే మురళీమోహన్‌కి తెల్సిపోయింది.

ఆ సాయింత్రం ఆఫీసు నుంచి తిరిగివస్తూ పూలకొట్టు దగ్గరకి వెడితే "ఏమోయ్ మురళీ" అని ఎవరో భుజం తట్టారు.

పక్కకి తిరిగి చూస్తే విశ్వనాధం కొలీగ్ పురుషోత్తం.

"ఓహో! మీరా! నమస్కారమండీ!" అన్నాడు మురళీమోహన్.

"మీ ఆవిడ కోసం కొట్టంతా కొనుక్కు వెడుతున్నట్టున్నావే!" అని నవ్వాడు పురుషోత్తం.

మురళీమోహన్ సిగ్గుగా నవ్వాడు.

"రావోయ్ కాస్త కాఫీ తాగొద్దాం!" అని పురుషోత్తం దారితీశాడు.

హోటల్లో కూర్చున్నాక "ఏమిటండీ విశేషాలు." అని అడిగాడు మురళీమోహన్ నవ్వుతూ.

"ఏమున్నాయ్! అంతా మామూలే! విశ్వం ఈవేళ ఆఫీసుకి రాలేదు. ఎలా వున్నాడేమిటి?"

"మొన్ననేదో రిక్షవాడు గ్రుద్దేసాట్టండీ! కొంచెం దెబ్బలుతగిలాయి."

పురుషోత్తం ఆశ్చర్యంగా చూసాడు. "రిక్షవాడు గ్రుద్దడం యేమిటి?....అయితే. అలాగని చెప్పుకున్నాడేమిటి విశ్వం!"

మురళీమోహన్ తెల్లబోయాడు. "చెప్పుకోవటమేమిటండి! అది నిజం కాదా?"

పురుషోత్తం గాఢంగా నిట్టూర్చాడు. "ముందు కాఫీతాగు....బయిటికి వెళ్లాక మాట్లాడుకుందాం."

మురళికి గుండెలు దడదడ లాడాయి.

విశ్వనాధం, పురుషోత్తం చాలా యేళ్ళుగా ఒకే ఆఫీసులో పని చేస్తున్నారు. ఇద్దర్కీ మంచి స్నేహం ఉండేది. కాని, విశ్వనాధం పేకాట వ్యసనానికి బానిస అయినాక అతనికి బాగా దూరం అయిపోయాడు పురుషోత్తం. విశ్వనాధం పేకాట ఆడుతున్నాడన్న సంగతి ఇదివరలో మురళికి మొదట చెప్పింది కూడ అతనే!

హోటలు బయిటికి వచ్చాక ఇద్దరూ ఒంటరిగా ఒక చోటికి వెళ్ళారు.

అంతవరకు ఎలాగో నిగ్రహించుకున్న మురళి

"చెప్పండి." అని తొందర పెట్టాడు.

"మీ మంచి కోరేవాణ్ణి కనుక చూసింది చెప్పాలనుకుంటున్నాను కాని....చెప్పి బాధ పెట్టటం నా కిష్టంలేదు...."

"చెప్పండి. పర్వాలేదు...."

"ఒకప్పుడు ఎవరయినా మాటా మాటా అనుకొని ఘర్షణ పడుతుంటే—వాళ్ళ మధ్యకి వెళ్ళి విడదీసి నచ్చచెప్పి సముదాయించేవాడు విశ్వం. అతని సమయస్ఫూర్తికి ఓపికకు నేనెంతో ఆశ్చర్యపోయేవాణ్ని. అటువంటివాడు ఇప్పుడు మాటలతో సరిపెట్టకుండా చేతులు కలిపే దాకా వెళ్ళాడు."

"ఏం జరిగిందండీ? ప్లీజ్ నా దగ్గర దాచ కండి." అన్నాడు మురళి కంగారుగా.

"ఆ అప్పారావుకీ మీ అన్నయ్యకీ మాటా మాటా పెరిగి...."

"అసలంత అవసరమేమొచ్చిందండి?" అని అడిగాడు మురళి ఎర్రపడిన ముఖంతో.

"ఏముంది? మామూలే. అప్పుపెట్టి మీ అన్నయ్యలాంటి వాళ్ళచేత పేకాడించటం. జీతం రోజున ఆ అప్పు వసూలు చేసుకోవటం ఆప్పారావు లాంటి వాళ్ళకి అలవాటే. మీ అన్నయ్య క్రితం నెల ఫస్టున బాకీ అంతా యివ్వలేదుట. ఈ నెల యిస్తానని చెప్పి ఈ సారీ యివ్వలేదుట. నెల మధ్యలో యిస్తానన్నాడట. మొన్న డబ్బిస్తే కాని ఆటకి రావటానికి వీల్లే దన్నాట్ట అప్పారావు. నువ్వు రానిచ్చేదేమిటి—నువ్వు కాకపోతే మరోడు—అంటూ మీ వాడు. ఇలా మాట మీద మాట వచ్చింది. ఇలాంటి వాటిలోకి దిగకూడదు కాని... ఇక ఉచ్చనీచా లంటూ ఉండవోయ్! నలుగురూ చూస్తున్నా రనయినా చూడకుండా నడిరోడ్డు మీద జుట్టూ జుట్టూ పట్టుకొని ఇద్దరూ కొట్టేసుకున్నారు." అన్నాడు పురుషోత్తం నిస్పృహగా.

మురళి ముఖం తెల్లగా పాలిపోయింది.

"సమయానికి నేను కలగజేసుకోకపోతే....ఈపాటికిద్దరూ పోలీస్ స్టేషన్‌లో ఉండేవాళ్ళు."

మురళి మనస్సు అతలకుతలమయిపోయింది.

"అంత అభిమానమున్నవాడయితే పుచ్చు కున్న డబ్బు ఇవ్వాలి....అని అంతా తలో మాటా అన్నారు. ఆ పరిస్థితిలో విశ్వాన్ని చూస్తే నాకు చచ్చేంత సిగ్గయింది. వెంటనే యింటికి వెళ్ళి డబ్బు పట్టుకువచ్చి ఇచ్చెయ్యమని నచ్చచెప్పాను. మధ్యవర్తులు—ఆయన రానక్కర్లేదు డబ్బిస్తే చాలన్నారు. వెంట మనిషినిచ్చి పంపారు. కృష్ణ వేణమ్మ ఏం తంటాలు పడిందో పాపం....డబ్బిచ్చింది..యిప్పటికందరి మర్యాదా దక్కింది!"

మురళికి కళ్ళనీళ్ళ పర్యంతమయింది.

అతని భుజం మీద బుజ్జగింపుగా చేయివేసాడు పురుషోత్తం. "సారీ మురళీ! నీ ముఖం చూస్తే నీకీ సంగతి తెలియదని అర్థమయి పోయింది. ఓ ప్రక్కన చెప్పలేను—మరోపక్క చెప్పకుండా ఉండలేను. మీ మేలు కోరేవాణ్ని కనుక....శ్రుతి మించక ముందే నీ చెవిన వేస్తే ఏమయినా ప్రయోజనం ముంటుందేమోనని చెప్పాను....అయామ్ వెరీసారీ." అని అతను వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి అసలు ఇంటికే వెళ్ళాలనిపించలేదు మురళికి. ఒక్కడూ పార్కులో కూర్చుని ఎంతో సేపు ఆలోచించాడు.

అన్నగారి ఎదుటపడి...."నువ్వు చేస్తున్నది తప్పన్నయ్యా." అని చెప్పటం ఎలా? తామిద్దరూ వాదులాడుకుంటుంటే వదిన పరిస్థితి ఎంత ఘోరంగా ఉంటుంది! ఇంతవరకూ దీని గురించి ఏమీ తెలియని తల్లి తండ్రులు ఈ విషయం వింటే ఎంత బాధపడతారు!

పూల పొట్లాన్ని చూసేసరికి మాధవి గుర్తుకు వచ్చింది. విశ్వనాథం 'వ్యసనం' గురించి మాధవికి తెలియదనే అతని ఉద్దేశ్యం. తామిద్దరూ ఎంత మనస్సులో మనస్సై కలిసిపోయినా యీ నిజం చెపితే ఆమె దృష్టిలో అన్నగారు చులకనై పోతాడని—అతనెప్పుడూ ఆ ప్రస్తావన ఎత్తలేదు. విశ్వనాథం ప్రవర్తనలోని వైప రీత్యాన్ని గుర్తించలేని అమాయకురాలు మాధవి అనుకున్నాడే కాని—అన్నీ తెల్సి గుంభనగా గడుపుతోందని అతనికెప్పుడూ అనిపించలేదు.

క్రితం రోజున అన్నగారికి రిక్షా ప్రమాదంలో దెబ్బలు తగిలాయని నిర్మల అబద్ధం చెప్పింది. అంటే, ఇదంతా కాకపోయినా—కొంతయినా చెల్లెలికి, వదినగారికి నిజం తెలుసన్నమాట. చీర గురించి నిర్మల సర్ది చెప్పటం గుర్తుకు వచ్చి—ఇదంతా తననుంచి వాళ్లు దాచారని అతనికి అర్థమయిపోయింది.

ఆ నిప్పునంతా వాళ్ళు కడుపులో పెట్టుకోగలిగి నప్పుడు—తనేనా బయటపడేది! ఆ మాత్రం తను భరించలేడా?....ఇప్పుడు తమలో ఎవరికయినా భరించక చేసేదేముంది?....తనే అన్నగారి స్థానంలో వుంటే—ఇదే 'రవి' చేస్తూంటే—'ఇది తప్పురా తమ్ముడూ!' అని చెప్పొచ్చు.

కాని, తన పరిస్థితి చాలా క్లిష్టంగా ఉంది. భార్యకి, తల్లిదండ్రులకి తెలియకుండా చెప్పాలి. వదిన నొచ్చుకోకుండా చెప్పాలి. పిల్లల దృష్టిలో చులకన కాకుండా చెప్పాలి....ఇన్ని దృష్టిలో పెట్టుకొని అన్నగారితో మాట్లాడాలి. తనకు సాధ్యమా? అన్నయ్య తనకసలా అవకాశం ఇస్తాడా?

పరిపరివిధాల పోయింది అతని మనస్సు. సాధ్యమయినంత శక్తిని కూడదీసుకొని ఇంటికి వచ్చాడు మురళి.

గుమ్మంలోనే ఎదురు చూస్తోంది మాధవి. ఎంతపైకి చిరునవ్వు నవ్వినా అతని ముఖంలో ఏదో బాధ గూడుకట్టుకొని ఉండటం ఆమె గుర్తించింది.

గదిలోకి వచ్చాక పూలపొట్లం అందుకుంటూ "....ఇవేళ మీ అన్నయ్య ఇంట్లోనే వున్నారని మీరాలశ్యంగా వచ్చారా." అని పరిహాసంగా నవ్వింది.

అతని నవ్వులో ఎప్పటి కాంతి లేదు.

అప్పటికా ప్రస్తావన ఆగిపోయినా రాత్రి పడుకొనే ముందు మాధవి అడగకుండా వుండలేక పోయింది. "ఈ రోజేమిటో పరధ్యానంగా వున్నారు."

"ఏమీలేదు."

"ఏమీలేదు అంటే ఏదో వుందనే అర్థం!"

అతని భ్రుకుటి ముడివడింది. "అంతరార్థాలు తీస్తుంటే నేనేం చెప్పలేను!"

ఆమె ముఖం చిన్నబుచ్చుకుంది.

అతను బలవంతంగా నవ్వు తెచ్చుకున్నాడు. "సారీ మధూ! నిన్ను నొప్పించాలని కాదు. ఏమిటో నాకే మనస్సు కుదురుగా లేదు. డోన్ట్ మిస్టేక్ మీ!...." అంటూ దగ్గరకి తీసు కున్నాడు.

అతని గుండెల్లో ఒదిగిపోతూ "క్షమించండి. నేనే అనవసరంగా గుచ్చి గుచ్చి అడిగాను. చెప్పవల్సిందైతే, మీరు నాకు చెప్పరా ఏమిటి." అంది.

## 30

కృష్ణవేణి పూజలు ఫలించలేదు. నిర్మల ఆశలు తీరలేదు. మురళి ఊహలు వాస్తవం కాలేదు.

ఆ సంఘటన తరువాతయినా విశ్వనాథం మారలేదు. అతను యిల్లు కదలకుండా ఉన్నది వారం మాత్రమే! మళ్ళీ క్లబ్బుకి వెళ్ళటం ప్రారంభించాడు. ఒక్క సారిగా ఆ వ్యసనం నుంచి బయిటపడలేక....క్రమక్రమంగా తగ్గించుకుందామని అనుకున్న వాడిలా అతను వెళ్ళటం లేదు; మరింత పిచ్చి తలకెక్కించుకున్న వాడిలా వెడుతున్నాడు.

అప్పారావు నలుగురిలో తన పరువు తీసేశాడు. వాడప్పుపెట్టకపోతే తనకు గతిలేదన్నట్టు మాట్లాడాడు. వాడి దయాధర్మాల మీదనే తను పేకాట ఆడగలుగుతున్నట్టు వాగాడు. ఇప్పుడదంతా ప్రేలాపన అని నిరూపిస్తే కాని నలుగుర్లో తన పరువు నిలబడదు. వాడి దగ్గర్నించి పైస కూడా పుచ్చుకోకుండా తను ఆడాలి.... తనకి బోలెడంత పరపతి వుందని నిరూపించుకోవాలి.

ఇలాంటి ఆలోచనలతో మరింత పిచ్చివాడయిపోయాడు విశ్వనాథం. ఇప్పుడతని దృష్టిలో పేకాట స్నేహితులు మాత్రమే ఆ 'నలుగురు' అయిపోయారు కాని....బయిట ఓ సంఘం వుంది....అక్కడ తన గౌరవం పోతోందని అతను గ్రహించటం లేదు. చుట్టూ లోకం వుంది- ఆ నోటా యీ నోటా కుటుంబ మాన మర్యాదలు మంటకలిసిపోతున్నాయని అతను గుర్తించటం లేదు.... కేవలం తన పేకాట సంఘంలో పరపతి నిలబెట్టుకోవటమే జీవిత పరమావధి అనుకొనే మూర్ఖుడయిపోయాడు.

అప్పారావుతో వచ్చిన తగవు అతన్ని బాగు చేయవల్సిందిపోయి మరింత పాడుచేయటానికే పనికివచ్చింది. ఇదివరకు అప్పారావు ప్రోత్సహించి ఆటలో కూర్చోపెట్టేవాడు. కొంత డబ్బు పోయిందని నిరుత్సాహపడి లేచి పోబోతుంటే– నీకెందుకు నేనున్నానని అప్పుపెట్టి ఆడించేవాడు. కాని, ఇప్పుడు అప్పారావు ఎదురుగా లేకపోతేనే త్వరత్వరగా లేచిపోవాలన్న స్పృహ ఉంటోంది కాని....అతను దరిదాపుల్లో కనిపిస్తే చాలు మరింత పట్టుదలతో బిగుసుక్కూర్చుంటున్నాడు విశ్వనాథం.

మళ్ళీ ఆటకి వెళ్ళిన రెండవనాడు ఖాళీ జేబులు వెదుక్కుంటున్న విశ్వనాథాన్ని చూసి వ్యంగ్యంగా నవ్వాడు అప్పారావు. విశ్వనాథంకి చివ్వున అభిమానం పొడుచుకువచ్చింది.

"రెడ్డీ! ఓ వంద యివ్వవోయ్...రేపిస్తాను." అన్నాడు. పదీపరకా కాదు...ఏకంగా వంద అడిగేసాడు. అంత డబ్బు ఆటలో పెట్టాలనికాదు– తనకెంత పరపతి వుందో అప్పారావు ముందు ప్రదర్శించాలని!

రెడ్డి ఓ క్షణంపాటు వాళ్ళిద్దర్నీ మార్చి మార్చి చూశాడు. ఆ పూట అతనికి బాగా కలిసివచ్చింది కూడా. అందులో విశ్వనాథం మాట తప్పని వాడన్న నమ్మకమూ కొంత వుంది. ఏమాత్రం సందేహించకుండ వంద రూపాయిలు తీసిచ్చాడు.

డబ్బిచ్చినవాడు తొణకలేదు కాని పుచ్చుకున్నవాడు గర్వాతిశయంతో చూశాడు. అప్పారావు నొసలు వెక్కిరిస్తే, విశ్వనాథం 'నువ్వివ్వకపోతే నాకిచ్చేవాళ్ళు వందమందున్నారు.' అన్నట్టు చూశాడు.

అప్పారావు అక్కడ్నించి వెళ్ళిపోయేవేళకి ఆ పూట రెడ్డి యిచ్చిన వందలో ఏభై దాకా పోయింది. అప్పటివరకు డబ్బు పోతున్నందుకు చీకూచింతా అన్నదే కలగలేదతనికి. మబ్బు విడిచాక చంద్రకాంతి ప్రకాశించినట్టు....అప్పారావు అటు వెళ్ళాక మనసులో రేపటి రోజు

### లోకజ్ఞానం

1. ప్రపంచంలోకల్లా ఎత్తయిన శిఖరం 'ఎవరెస్ట్' అని మీకందరికీ తెలుసు. కాని ఆ శిఖరానికి ఆ పేరెలా వచ్చిందో చెప్పగలరా? ఆ శిఖరాన్ని మొదట అధిరోహించడానికి ప్రయత్నించింది ఎవరు? ఏ సంవత్సరంలో?

2. 'వనిత' లో 'మాటలకొలువు' వున్నట్లే యితర పత్రికలు చాలా వాటిల్లో ఈ గళ్ళనుడి కట్టులు వున్నాయి. వీటినే ఆంగ్లంలో 'క్రాస్ వర్డ్ పజిల్' అని అంటారు. ఈ క్రాస్ వర్డ్ పజిల్‌ని కనుగొన్నది ఎవరు? ఏ దేశస్థుడు?

3. షాజహాన్ చక్రవర్తి కడపటి కుమారుడు ఔరంగజేబు. మరి అతని పెద్ద కుమారుడి పేరేమిటో చెప్పగలరా?

4. అన్ని పాములలాగే నాగుపాముకి కూడా చెవులు లేవు. అయినా నాగస్వరం వినగానే నాగుపాము శరీరం లయబద్ధంగా కదులుతుంది. ఎందువల్ల?

5. ఆంధ్రప్రదేశ్ లో జిల్లాలు ఎన్ని? తూర్పు గోదావరి, ప్రకాశం, కృష్ణా, మెదక్ జిల్లాల ముఖ్య కేంద్రాలు ఏవి?

6. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత తంతి తపాలా సర్కిల్ ఏ సంవత్సరంలో ప్రారంభమయిందో చెప్పగలరా?

7. ఆఫ్ఘనిస్థాన్ రాజధాని నగరం ఏది? ప్రస్తుతపు అధ్యక్షుడెవరు?

8. హిందువులకు 'భగవద్గీత', ముస్లింలకు 'ఖురాన్' పవిత్ర గ్రంథాలయినట్లే క్రైస్తవులకి 'బైబిల్' పవిత్ర గ్రంథం. అసలు 'బైబిల్' అనే పదానికి అర్థం ఏమిటో చెప్పగలరా?

9. ప్రపంచంలో అత్యధిక వర్షపు సాంద్రత గల ప్రాంతం మన దేశంలోని చిరపుంజి. అయితే సంవత్సరంలో అధిక భాగం వర్షం కురుస్తూనే వున్న ప్రాంతం ఏది? ఎక్కడుంది?

10. ప్రాచీన వాస్తు శాస్త్రం ప్రకారం కట్టిన గుమ్మటా (డోమ్)లలో మన దేశంలోని గోల్ గుంబజ్ పెద్దది. మరి నవీన వాస్తు శాస్త్ర పద్ధతులలో కట్టిన అతి పెద్దదయిన 'డోమ్' ఏదో చెప్పగలరా?

[సమాధానాలు ఈ సంచికలోనే వుంటాయి. చూడండి]

గుర్తుకు వచ్చింది విశ్వనాథానికి. తక్కిన ఏభై రూపాయిలు చటుక్కున రెడ్డి చేతిలో పెట్టి "....బేలన్సు రేపు తప్పకుండా యిస్తానోయ్!" అని చెప్పి లేచిపోయాడు.

మర్నాడు క్లబ్బుకి వెళ్ళాలంటే ముందు రెడ్డికివ్వవల్సింది పట్టుకువెళ్ళాలి. తను కావాలనుకున్నప్పుడల్లా ఇచ్చే భార్య తనకు వుంది. అందుకనే నిశ్చింతగా ఆ రాత్రి నిద్రపోయాడు విశ్వనాథం.

మర్నాడు ఆఫీసుకి వెళ్ళేముందు భార్యని అడిగాడు.

కృష్ణవేణి నిర్జీవ నేత్రాలతో చూసింది. వారం పది రోజులుగా అతనడగలేదు. అంతకాలం మినుకు మినుకు మన్న ఆశాజ్యోతి కాస్తా టప్పున ఆరిపోయింది.

"ఏమిటలా చూస్తావు? వినపడలేదా?" అన్నాడతను చిరాగ్గా.

"అంత డబ్బు నా దగ్గర్లేదు...."

"ఎంతుందేం?"

కృష్ణవేణి ఇక నిగ్రహించుకోలేకపోయింది. "ఎంతున్నా ఇప్పుడు నేనివ్వలేను...."

అత్తగారికి మందులు కొనాలి. పళ్ళు కొనాలి. ఇంట్లో నిండుకున్న సరుకులు తెప్పించాలి.... ఇలా తన బాధలు చెప్పుకోవాలనుకుంది ఆమె. కాని, వినేందుకే ఓర్పు లేని భర్త ఇక అర్థం చేసుకోవటం కూడానా?

తత్ఫలితంగా ఆమె చెంప ఛెళ్ళుమంది.

"ఇవ్వవూ? ఇవ్వకపోతే మూట కట్టుకోవే! నాకేం డబ్బు పుట్టదనుకున్నావా? నాకిచ్చేవాడే లేడనుకున్నావా?" అని గొంతు చించుకున్నాడు.

దెబ్బతగిలి ఎర్రపడిన చెంపనయినా నిమురుకోకుండా రానున్న కన్నీటికి ఆనకట్ట కట్టి శిలా ప్రతిమలా నిలబడిపోయింది కృష్ణవేణి.

భార్య మౌనంగా వుండంటే ఎటువంటి పరిస్థితి కయినా సిద్ధపడే వుందని అర్థం! ఇకిప్పుడు తను సాధించలేడని అతనికి తెల్సు!...కాని, ఈనాడు డబ్బివ్వకపోతే రెడ్డి తన గురించి నలుగురితో చెడుగా చెపుతాడు. ఇదంతా తెలిస్తే యిక ముందెవరూ తనని నమ్మి డబ్బివ్వరు. మరెలా?....

"మురళీ!...." అని గట్టిగా కేక వేశాడు విశ్వనాథం.

"ఏమిటన్నయ్యా!" అంటూ కంగారుగా వచ్చాడు మురళి.

"నాకో ఏభయి రూపాయిలు అర్జంటుగా కావాలిరా! నీ దగ్గరుంటే యిస్తావా?...." అని సూటిగా అడిగాడు.

ఎర్రబడిన వదినగారి ముఖం.... ఏ మాత్రం మార్దవం లేని అన్నగారి కంఠస్వరం... మురళికి లిప్తకాలంలో జరిగినదంతా చెప్పాయి. అతనికి వెంటనే ఏమని చెప్పాలో తోచలేదు.

ఆ మాత్రం ఆలశ్యాన్నే భరించలేకపోయాడు విశ్వనాథం. "నాలుగయిదు రోజుల్లో తిరిగి యిచ్చేస్తాను...." అన్నాడు. "....నీ దగ్గర లేకపోతే మాధవి దగ్గరుందేమో అడుగు...." అని కూడా సలహా యిచ్చాడు.

"అలాగే!" అని అక్కడ్నించి గబగబా వెళ్ళి మరు నిమిషంలో డబ్బు తెచ్చిచ్చాడు మురళి.

మరిది ముఖం చూడలేక తల త్రిప్పుకుని నోట చీర చెంగు కుక్కుకుంది కృష్ణవేణి. తానెంతో తప్పు చేసిన వాడిలా తల దించుకుని తన గదిలోకి వెళ్ళిపోయాడు మురళి.

ఈ బాధలకీ – అవమానాలకీ అతీతమైన వాడిలా చిదానంద స్వరూపుడులా జేబులో డబ్బు పెట్టుకుని చరచరా వీధిలోకి వెళ్ళిపోయాడు విశ్వనాథం.

మరో అరగంటవరకు వదినగారి ముందుకు రావటానికి కూడా భయపడింది నిర్మల.

అతనింకా మారలేదని ఆ పూట వాళ్ళందర్కీ ఒక్కసారిగా స్పష్టంగా తెలిసిపోయింది.

## 31

ఇదివరలో అన్నగారు పేకాట ఆడుతున్నాడని తెల్సినా మురళి కంత బాధనిపించేది కాదు. విసుగనిపించేది కాదు. 'పాపం, ఎన్నో ఏళ్ళు అన్నయ్య కుటుంబభారాన్ని మోసాడు. ఇప్పుడేదో వినోదాన్ని వెతుక్కున్నాడు. ఆ మాత్రం సుఖపడే హక్కు అన్నయ్యకి వుంది....ఈ మాత్రానికి తప్పుపట్టి అన్నయ్యని విమర్శించటం అన్యాయం' అని సరిపెట్టుకునేవాడు. వదినగారితో కూడా అదే వాదించి ఇది పెద్ద సమస్య కాదన్నట్టు తేలిగ్గా కొట్టిపడేసేవాడు. తానెన్ని బాధలు పడటానికయినా సిద్ధపడేవాడు. స్వవిషయం, స్వసుఖం మరిచి అన్నీ సర్దుకుపోయేవాడు.

ఇప్పుడలా కాదు. పెళ్ళయ్యాక అతను సర్దుకు పోదామన్నా వీలులేని పరిస్థితి వచ్చింది. తను భార్యను సుఖపెట్టవలసిన క్రొత్త బాధ్యత వచ్చింది. భార్య సంతోషం కోసం చక్కని బట్టలు వేసుకుంటున్నాడు. భార్య ముచ్చట కోసం సినిమాలకీ – సరదాలకీ వెడుతున్నాడు. సొంత ఖర్చులంటూ పెరిగాయి. అలాగని తను వదినగారికిచ్చే డబ్బు తరిగిపోవటం లేదు. ఆ డబ్బుని పెంచేలా ఉద్యోగం చేస్తున్న భార్యగా మరీ వచ్చింది మాధవి. మామూలుగా యిచ్చేదానికన్న మరికొంత ఎక్కువగానే వదినగారికి ఇవ్వగలుగుతున్నాడు. ఆమె ఆర్థిక బాధను మరికొంత తగ్గించగలుగుతున్నాడు.

కాని, అదెంతవరకు ఆమె మానసిక వ్యథను తగ్గించగలుగుతోంది? డబ్బు ఎక్కువ యిచ్చినంత మాత్రాన అన్నగారి వ్యసనం వల్ల ఆమె పడే బాధ తరుగుతుందా? ఒక విధంగా అన్నగారి వ్యసనాన్ని తను పెంచి పెద్ద చేసినట్లవటం లేదా? వదినగారి బాధని పెంచినట్లవటం లేదా?

ఈ బాధకి తోడు మరో కొత్తబాధ తోడయిందతనికి. మాధవి తన జీతమంతా తెచ్చి అతని చేతుల్లో పెడుతోంది.... 'అక్కయ్య కివ్వండి నేనిస్తే అంతా పుచ్చుకోదు....' అని చెప్పి మరీ యిస్తోంది.

ఏ మాత్రం స్వార్థంలేని ఆమె మనస్సు ఆమె అమాయకమైన కళ్ళల్లో ప్రతిఫలిస్తుంది. 'నువ్వింత నిండు మనస్సుతో డబ్బిస్తున్నావు. నీకు తెలియకుండా నీ కన్యాయం చేస్తున్నాను మధూ!' అంటూ అతని మనస్సు మూలుగుతుంది.

ఇటీవల వదినగారు మొండికేసి డబ్బివ్వనన్నప్పుడు రెండు మూడుసార్లు అతన్నే పిలిచి డబ్బడిగాడు అన్నగారు. అన్నమాట ప్రకారం ఒకసారి తిరిగి యిచ్చాడు. మరోసారి ఆ మాటే మరిచి మళ్ళీ అడిగాడు. అతను అడిగినప్పుడల్లా ఏదో ఖర్చుకని ఉంచుకున్న మాధవి డబ్బు తీసి యిస్తున్నాడు మురళి.

'ఏమిటిలా మీ అన్నయ్య అస్తమానం డబ్బడుగుతారు?....' అనదు సరికదా – 'ఎంతో అవసరం వస్తే కాని అడగరు కదా!' అని చెప్పి మరీ యిస్తుంది మాధవి.

అప్పుడామె ముఖం చూడటానికి సిగ్గుపడి తల త్రిప్పుకు పోతుంటాడు మురళి. మనస్సులో బాధనణచుకోలేక నిజం చెప్పేద్దామని అతనికి

నోటి చివరిదాకా వస్తుంది!....అతికష్టం మీద నిగ్రహించుకుంటాడు. ఇదివరలో భార్య దృష్టిలో అన్నగార్ని తక్కువ చేసినట్లవుతుందేమోనన్న భయంతో చెప్పేవాడు కాదు. కాని, ఇప్పుడు అంతా చెప్పి ఆమెని కూడా బాధపెట్టినట్లవుతుందని ఆ మాట ఎత్తటం లేదు.

తనను కూడా డబ్బడగటం అన్నగారికి ఒక పరిపాటయి పోయాక మురళి పరిస్థితి యిరకాటంలో పడింది. డబ్బు లేదు — అనే సందర్భం యింతవరకు రాలేదు కాని....తమ భార్యాభర్తల ఖర్చులు మానుకొనే స్థితి మాత్రం వస్తోంది. తన భార్యకీ మాత్రం సుఖం కూడా లేకుండా చేయటం అతనికి చాలా అన్యాయమనిపించింది. బాధనిపించింది.

అందుకనే ఆ మరుసటి నెల వదినగారికి డబ్బు తగ్గించి యిచ్చాడు. తనలో కలిగిన యీ స్వార్థానికి లోలోపల సిగ్గుపడిపోతూ — వదినగారికి ముఖం చూపలేని వాడిలా గబగబా అక్కడ్నించి వెళ్ళిపోయాడు. కాని, కృష్ణవేణి ఎప్పటిలాగే అతనిచ్చిందాంట్లోనే కొంత డబ్బుతీసి మాధవిని పిలిచి యిచ్చింది. ఆమె 'వద్దక్కయ్యా-నా దగ్గరుంది'. అంటున్నా వినకుండా "చెప్పిన మాట విని వుంచు. కావాలంటే నేనే అడిగి పుచ్చుకుంటాను." అని చెప్పి వెళ్ళిపోయింది.

ఈ పరిస్థితుల్లో మురళికింట్లో వున్నంతసేపూ ఉక్కిరిబిక్కిరిగా ఉన్నట్లుంటోంది. ఆఫీసులో ఉన్నప్పుడు, మాధవితో ఏ సినిమాకో వెళ్ళినప్పుడు కాసేపు యింటి విషయం మర్చిపోతుంటాడు. అంతేకాని, ఇంటి దరిదాపుల్లోకి వచ్చేటప్పటికి అతని మనసు మీదకి మబ్బుతెర క్రోసుకు వస్తుంది. కాంతి విహీనమైన వదినగారి ముఖం కళ్ళముందు కనిపిస్తుంటే మాటలే కరువైపోతుంటాయి. అన్నగారి మీద అతనికిదివరకుండే సానుభూతి క్రమక్రమంగా కరిగిపోతోంది. ఒక విధమైన అసంతృప్తి, నిరసన భావం మనస్సులో చోటు చేసుకుంటున్నాయి.

ఏదో ఒకనాడు అన్నగారు తనంతట తను తెల్సుకొని దారి మళ్ళించుకుంటాడని ఇదివరకు అతననుకునేవాడు. కాని, అది జరిగేలా లేదు సరికదా — ఈ మధ్య మరెవరు చెప్పినా వినేలా కూడ కనిపించటం లేదు విశ్వనాధం. ఒకటి రెండుసార్లు అన్నగార్ని ఒంటరిగా కల్సుకొని యీ విషయం మీద మాట్లాడదామని ప్రయత్నించాడు మురళి. కాని, అంతవరకూ వెళ్ళాక అతనికెలా ప్రారంభించాలో తోచలేదు. ఆ క్షణంలో అన్నగారి ముఖం చూసేసరికి — గొంతు పెగల్లేదు. "నీకెంత డబ్బు కావల్సి వచ్చినా ఉత్తరం వ్రాయి. నేను పంపుతాను. నువ్వేబ్బంది పడకుండా నిశ్చింతగా చదువుకో!" అన్న ఒకప్పటి అన్నగారి మాటలే గుర్తుకు వచ్చాయి....ఈనాడు వున్న పరిస్థితి ఎలా చెప్పినా తను స్వార్థంతో చెప్పినట్టు అనిపిస్తుందని అతనికి భయం కలిగింది. అందుకని, ఆ ప్రయత్నం విరమించుకున్నాడు.

పోనీ, తండ్రి చెపితే అన్నగారు వింటాడేమోనని ఆయనతో చెపుదామని కూడా ఒకటి రెండుసార్లు అనుకున్నాడు మురళి. కాని, ఈ పెద్ద వయస్సులో తండ్రి మనస్సు బాధపెట్టినట్టవుతుందేమో — అని సందేహించాడు. మరోవైపు చిన్నపిల్ల వాడి మీద మరో చిన్నపిల్లవాడు చాడీ చెప్పినట్లుగా ఏమిటీ పని — అని అనిపించి వూరుకున్నాడు.

వదినగారిలాగే తనూ నిశ్శబ్దంగా బాధననుభవించటం తప్ప మరో దారేదీ కనిపించలేదతనికి.

ఇంతలో అతని యు. పి. ఎస్.సి పరీక్షలు దగ్గర పడ్డాయి. శలవుపెట్టి యింట్లో కూర్చోవటంతో మరింత మనశ్శాంతి లేకుండా పోయింది. ఇలాంటి పరిస్థితిలో పరీక్షలు సవ్యంగా వ్రాస్తానన్న నమ్మకం కూడా లేకుండా పోయిందతనికి. మాధవి శలవు పెట్టినా దగ్గరుండి ప్రోత్సహిస్తున్నా అతనికి చదువు మీదకి దృష్టి పోవటం లేదు. కళ్ళు అక్షరాల్ని చూస్తున్నాయే కాని మనసెక్కడో వుంటోంది.

ఓసారి చూద్దామని వచ్చిన రాఘవరావు కూతురూ అల్లుడూ ఇంట్లోనే వుండటం చూసాడు. "పోనీ, అక్కడికి వచ్చి చదువుకో బాబూ! ప్రశాంతంగా వుంటుంది" అన్నాడు.

కృష్ణవేణి కూడా అదే మాటంది. ఇంట్లో మాధవికేదో ఒక పని తప్పటం లేదు. తాను వద్దంటున్నా చేస్తూంటుంది. మరో మూల పిల్లల అల్లరి. ఏదో ఒక హడావిడి తప్పటం లేదు. అతను మామగారింటికి వెడితేనే చదువు బాగా సాగుతుందని అనిపించిందామెకు! [సశేషం]

మన కార్టూనిస్టులు భార్య చేతిలో అప్పడాల కర్ర, భర్త నెత్తిన బొప్పి కట్టడం తమాషాగా చిత్రిస్తూ వుంటారు. చూపిన వాళ్ళ ఈ కార్టూనుల్ని అధిక్షేపిస్తూనే వుంటారు. అయితే మన దేశంలో కార్టూన్ల మీద వున్న ఈ కథలు కాస్తా అమెరికాలో నిజమయి కూర్చున్నాయి! పాపం....అక్కడ పన్నెండు మిలియన్లమంది భర్తలు (అంటే ఒక కోటి ఇరవై లక్షలమంది) తరచు భార్యల చేతుల్లో మొట్టికాయలు అవీ తింటున్నారట! కాని నవ్వులపాలవుతారన్న భయంతో ఆ విషయం వారు పైకి చెప్పడం లేదుట. ఈ సంగతంతా డాక్టర్ సుజాన్నే స్టెన్‌మెట్జ్ అనే ఆయన మిస్టర్ రోజర్ లాంగ్‌లెగ్ అనే ఆయనతో కలిసి చేసిన 'సర్వే' లో తేలింది. ఈ రోజర్ లాంగ్‌లెగ్ అంతకు ముందు 'భర్త చేతుల్లో తన్నులు తింటున్న భార్యల' మీద ఓ పుస్తకం రాశాడట. వీరి అంచనా



ప్రకారం ఇలా నిజంగానే కార్టూను మొట్టికాయలు తింటున్న భర్తలు—భార్యలకన్న పొట్టిగానూ, ఎందుకూ పనికిరానివారుగానూ, మరీ ముసలివాళ్ళుగానూ వుంటున్నారుట. ఫర్వాలేదు — ఇన్నాళ్ళకి మన 'కార్టూన్ భర్తల' కు తోడు లభించారన్నమాట!

# భాషలు నేర్చుకోండి

| తెలుగు | తమిళం | కన్నడం | మలయాళం | మరాఠీ | గుజరాతీ | ఒరియా |
|---|---|---|---|---|---|---|
| ప | ப | ಪ | പ | प | પ | ପ |
| ఫ | — | ಫ | ഫ | फ | ફ | ଫ |
| బ | — | ಬ | ബ | ब | બ | ବ |
| భ | — | ಭ | ഭ | भ | ભ | ଭ |
| మ | ம | ಮ | മ | म | મ | ମ |
| య | ய | ಯ | യ | य | ય | ଯ |
| ర | ர | ರ | ര | र | ર | ର |
| ల | ல | ಲ | ല | ल | લ | ଲ |
| వ | வ | ವ | വ | व | વ | — |
| శ | — | ಶ | ശ | श | શ | ଶ |
| ష | ஷ | ಷ | ഷ | ष | ષ | ଷ |
| స | ஸ | ಸ | സ | स | સ | ସ |
| హ | ஹ | ಹ | ഹ | ह | હ | ହ |
| ళ | ள | ಳ | ള | ळ | ળ | ଳ |
| క్ష | க்ஷ | ಕ್ಷ | ക്ഷ | क्ष | ક્ષ | କ୍ଷ |
| ఱ | ற | ಱ | ഴ, റ | — | — | — |

[వచ్చే సంచికలో మరికొన్ని]

## నిబంధనలు

'వనిత మాటల కొలువు'లో స్త్రీలు మాత్రమే పాల్గొనాలి. ఈ సంచికలో ఉన్న కూపను పూర్తి చేసి కవర్లో పెట్టి 'వనిత మాటల కొలువు – 39' చందమామ బిల్డింగ్స్, మద్రాసు – 600 026 చిరునామాకు సెప్టెంబర్ నెలాఖరులోగా చేరేలా పంపాలి. ఆ కవర్లో మాటల కొలువు కూపను తప్ప మరేదీ ఉండకూడదు. ఒక కవర్లో ఒక్క ఎంట్రీయే ఉండాలి. గళ్ళలో వేసే అక్షరాలు శుభ్రంగా, తెలిసేలా ఉండాలి. కొట్టివేతలూ దిద్దుబాట్లూ ఉండకూడదు. దీని సమాధానం, ఫలితాలూ 1978 నవంబర్ సంచికలో ప్రచురింపబడతాయి. మా దగ్గర గల సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారికి రూ. 150 లు బహుమతిగా పంపుతాము. సరైన సమాధానం పంపేవారు ఒకరికంటె ఎక్కువమంది గనుక ఉంటే, బహుమతి మొత్తం సమానంగా పంచబడుతుంది. దీనికి సంబంధించిన ప్రతి విషయంలోనూ 'వనిత' నిర్వాహకవర్గానిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపబడవు.

### ఆధారములు – అడ్డము

1. అనురాగంలోనూ సుమతిలోనూ గల సమ్మతమైన మాట
2. ముక్కంటి
3. వేడికానేకాదు
4. ముందు గుడి కొట్టేయండి; అక్షరాలను సరిగ్గా పేర్చండి-చెట్టు మీద, మొక్క మీద వుండేది తెలుస్తుంది
5. చిరకాల అనుభవం గలదాన్ని అంటారు
6. దీన్ని కూడా కొందరు పారేసుకోగలరు!
7. రామశబ్దంతో విశ్రాంతిని పొందవచ్చు
8. నడిపించడం అడ్డదిడ్డమైతే?
9. తాడు అక్కర్లేకుండా వస్తువుకు కట్టేది
10. ఈ కాలంలో పడుతుంది; గాని దెబ్బేతగలదు!
11. అధిపుడే తిరగబడ్డాడే!
12. అంతా తారుమారే!
13. అరటాకుకు శత్రువు లాంటిదన్నారు
14. వనితే; చక్కని పలువరస గల వనిత!

### ఆధారములు – నిలువు

1. మాటకి మొదలుంది; అర్థానికే మొదలు లేదు
2. మొదలూ కొసా లేని నగ!
5. ఆంగ్లంలో శకటంలా కనిపిస్తే - అది అరణ్యం!
6. దీనికి నోచుకోవాలి
7. అనేక రకములు (గలది)
8. చంద్రుని భార్యగా చెబుతారు
15. దర చూపగల స్త్రీ!
16. బుద్ధి తిరిగింది!
17. అట్నుంచి చదివితే గింజ గల కాయ
18. మనోజ్ఞురాలైన స్త్రీ
19. కొంత వేదనపడితే, ఈ మాట తెలుస్తుంది
20. ముందు దీర్ఘం వుంటే - పెద్ద జంతువునే శాసించగలుగుతాడు
21. పశువులు తినడం!
22. మొదటి అక్షరాన్ని చివర్లో కూడా చూడగలిగితే సంతోషం!
23. '2 అడ్డము'లో వున్నవాని భార్య

## వనిత మాటల కొలువు - 39
## రూ 150 లు బహుమతి

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | | 15 | 16 | ■ | 2 | | 17 |
| | ■ | 3 | | ■ | | ■ | |
| 4 | 18 | | ■ | 5 | | 19 | |
| ■ | | ■ | 6 | | ■ | | ■ |
| 7 | | 20 | | ■ | 8 | | |
| 9 | | | ■ | 10 | | ■ | ■ |
| | ■ | 11 | 21 | ■ | 12 | 22 | 23 |
| 13 | | ■ | | ■ | 14 | | |

పేరు ______________________

చిరునామా ______________________

______________________

______________________

______________________

# పుట్టిన రోజులు



కరవది కిరణ్‌కుమార్ (తిరుపతి)
పుట్టిన తేదీ: 30-9-76
తల్లిపేరు : కె. అనసూయ

ఈ నెలలో పుట్టిన రోజులు గల శిశువుల్లో- ఏడాది పిల్లల గ్రూపులో ఎ. నీలిమ; రెండేళ్ళ గ్రూపులో కరవది కిరణ్ కుమార్; మూడేళ్ళ గ్రూపులో వై. ఉదయకిరణ్ – 'పుట్టిన రోజు' బహుమతులకు ఎన్నికైనారు. నిర్ణయింపబడిన వీరితోపాటు మొత్తం మీద అన్ని గ్రూపులలోనూ ఆరోగ్యంగా కనిపిస్తున్న మరో ఇద్దర్ని ఎన్నిక చేసి విడిగా ప్రచురిస్తున్నాము. అక్టోబర్ సంచికలోని ఈ శీర్షికకు ఫోటోలు పంపేవారు-వివరాలతో సహా-(ఫోటో తీయించిన తేదీ ముఖ్యంగా వుండాలి. ఫోటో వెనక, పెన్సిల్‌తో పేరు మాత్రమే రాయాలి.) సెప్టెంబర్ 5వ తేదీలోగా మాకు చేరేలా పంపగోరుతున్నాము.



ఎ. నీలిమ (కల్యాణఖని) పుట్టిన తేదీ: 19-9-77
తల్లిపేరు : ఎ. సునందిని

వరసింహం శ్రీరామానుజం (ఎల్లారెడ్డి) పుట్టిన తేదీ: 2-9-77 తల్లిపేరు : ఆండాళ్ శ్రీనివాస్





◀ వై. ఉదయకిరణ్ (విశాఖపట్నం) పుట్టిన తేదీ: 7-9-75 తల్లిపేరు : వై. రమణీనరసింహం

యస్. రామ్‌కిరణ్ (హైద్రాబాదు) పుట్టిన తేదీ: 26-9-77 తల్లిపేరు : యస్. సులోచన



# టెస్ట్ ట్యూబ్ బేబీ

సామాన్య ప్రజలలో – ఇవన్నీ నిజాలా? వట్టి కట్టు కథలా? – అన్న సందేహాన్ని కల్గించేటంత అద్భుతమైన ప్రగతి సాధిస్తున్నది ఈనాటి విజ్ఞాన శాస్త్రం!

'బ్రేవ్ న్యూ వరల్డ్' అనే నవలలో భావికాల సమాజాన్ని టెస్ట్ ట్యూబ్ బేబీల సమాహారంగా చిత్రించాడు ఆల్డస్ హక్స్‌లీ।

గర్భాశయం ప్రమేయం లేకుండా శిశువులు జన్మించే శుభదినం మరెంతో దూరంలో లేదు – అన్న ఆశాభావం వ్యక్తం చేశాడు – ఆల్విన్ టాఫర్ అనే పాత్రికేయుడు – 'ఫ్యూచర్ షాక్' గ్రంథంలో।

ఇలా రచయితలే కాకుండా వైద్య పరిశోధకులు కూడా దశాబ్దాల తరబడి కలలు కంటూ, దానికై కృషి చేస్తున్న 'టెస్ట్ ట్యూబ్ బేబీ' ఇవాళ కొంతవరకు నిజమైంది – శ్రీమతి లెస్లీ బ్రౌన్ విషయంలో।

వాయవ్య ఇంగ్లండు ఓల్డాం పట్టణానికి చెందిన శ్రీమతి లెస్లీ బ్రౌన్‌కు పెళ్ళయి తొమ్మిదేళ్ళయింది. కాని సంతానం మాత్రం కలగలేదు. ప్రతి వనితకూ యేర్పడే సంతానాభిలాష ఆమెకూ యేర్పడి తానూ అమ్మ కావాలనే ఆశ కల్గింది. వైద్యవేత్తలను సంప్రదించి వైద్య పరీక్షలు చేయించుకుంది. ఈ పరిశోధనలవల్ల – ఆమె అండాశయం (ఓవరీ) నుంచి గర్భాశయం వరకూ వున్న ఫలోపియన్ ట్యూబ్స్ ద్వారాలు మూసుకుపోయి వున్నాయి – అని తెలిసింది. అంచేత ఈ విషయంలో విస్తృతంగా పరిశోధనలు జరుపుతూన్న డా॥ స్టెప్టోను సంప్రదించమని ఆ వైద్య పరిశోధకులు సలహా యిచ్చారు. అక్కడ ఆమెకు జరిగిన చికిత్స ఎలాంటిదో తెలుసుకోవాలంటే అసలు గర్భధారణ, సంతానోత్పత్తి ఎలా జరుగుతుందో తెలుసుకోవాలి.

స్త్రీ పురుషుల సంయోగ సమయంలో పురుష వీర్యాణువులు స్త్రీ గర్భాశయంలో ప్రవేశిస్తాయి. ఆ తర్వాత అవి అక్కడి నుంచి ఫలోపియన్ ట్యూబ్స్ ద్వారా అండాశయం (ఓవరీ) వైపు ప్రాకుతూ పోతాయి. స్త్రీ అండాశయం నుంచి వెలువడే అండం (ఓవం)తో వీర్యాణువు ఐక్యమై ఫలదీకరణ చెంది పిండోత్పత్తి అవుతుంది. కాబట్టి సంతానం కల్గాలంటే ముఖ్యంగా, పురుష వీర్యాణువులు (స్పెర్మ్స్) సజీవంగావుండాలి: స్త్రీ అండాశయం నుంచి అండం సక్రమంగా వెలువడాలి. అంతే కాదు. గర్భాశయం నుంచి అండాశయం వరకు వున్న ఫలోపియన్ నాళాలు ఆరోగ్యంగా వుండాలి. ఎంచేతంటే – ఈ నాళ ద్వారంగుండానే పురుష వీర్యాణువులు అండాశయం వరకు ప్రాకుతూ వెడతాయి. ఫలదీకరణ చెందిన తర్వాత పిండం గర్భాశయం చేరడం కూడా ఈ నాళ మార్గంలోనే. అందువల్ల గర్భధారణ జరగాలంటే ఫలోపియన్ నాళాల అమరిక, ఆరోగ్యం బాగుండాలి. అయితే కొందరికి పుట్టుకతోనే ఫలోపియన్ ట్యూబ్స్ ద్వారాలు మూసుకుని వుంటాయి. దానివల్ల గర్భధారణకు అవకాశం వుండదు.

ఫలోపియన్ నాళద్వారం మూసుకుపోయినప్పటికీ, అండాశయం నుంచి వెలువడే అండాన్ని, వీర్యాణువులను కలిపి ఫలదీకరింప చేసే ప్రయత్నంలో గత పదిహేను సంవత్సరాలుగా పరిశోధనలు చేస్తున్నారు డాక్టర్ స్టెప్టో. డాక్టర్ స్టెప్టో – ఆయన సహోద్యోగి డాక్టర్ ఎడ్వర్డ్స్. శ్రీమతి బ్రౌన్‌ను ఎన్నో వైద్య పరిశోధనలు చేసి చూశారు.

ఆమె అండాశయం ఫలానా రోజున అండాన్ని విడుదల చేసే విధంగా – ఆమెలో హార్మోనులు స్రవించేట్టు చేశారు. అండం వెలువడిన తర్వాత దానిని అండాశయం నుంచి వెలుపలికి తీయడానికి, అంతర్ద్వారం గల సూది అమర్చబడిన పెరిస్కోపు లాంటి పరికరాన్ని ఉపయోగించారు.

వెలుపలికి తీసిన అండం ఆమె భర్త వీర్యాణువులతో కలిసి ఫలదీకరణ చెందే విధంగా ఒక టెస్ట్‌ట్యూబ్‌లో అనువైన రసాయనిక ద్రవ్యాల మధ్య వుంచారు. ఫలదీకరణ చెందిన పిండం అభివృద్ధి చెందడానికి అనుకూలంగా ఐదు రోజుల పాటు వుంచి, ఆ తర్వాత శ్రీమతి బ్రౌన్ గర్భాశయంలోకి జొప్పించారు. ఇది జరిగింది గత నవంబరు మాసంలో. గత జూలై నెల ఇరవయ్యో తారీఖున శ్రీమతి బ్రౌన్ సిజేరియన్ ఆపరేషన్ ద్వారా ఆడ శిశువును ప్రసవించింది.

అయితే-ఇది పూర్తిగా టెస్ట్‌ట్యూబ్ బేబీ కాదు. స్త్రీ అండాశయం నుంచి అండాన్ని సేకరించి, గర్భాశయానికి వెలుపల పురుష వీర్యాణువులతో కలిపి, ఫలదీకరింపచేసి టెస్ట్‌ట్యూబ్‌లోనే–శిశువు పెరిగి–జన్మించినట్టయితే – ఆ పాపాయిని టెస్ట్‌ట్యూబ్ బేబీ అనవచ్చు–కాని అలా జరగడం అసాధ్యమేమీ కాదు–అనడానికి ఇదొక రుజువు.

డాక్టర్లు–టెస్ట్‌ట్యూబ్ బేబీలకై ప్రయత్నించడం ఇది ప్రథమంకాదు. 1964 వ సంవత్సరంలోనే కొందరు ఈ ప్రయత్నంలో కృతకృత్యులైనట్టు కూడా వార్తలు వెలువడ్డాయి. కాని వైద్య శాస్త్రం సాధించిన ఈ అద్భుతమైన ఘన విజయం వైపు యావత్ ప్రపంచ దృష్టిని ఆకర్షించిన ఘనత డా. స్టెప్టో – ఎడ్వర్డ్స్ బృందానికే చెందుతుంది. ఈ వార్త–సంతానం కోసం పరితపించే అసంఖ్యాకులైన దంపతులకు ఆశాకిరణం. ఈ విషయంగా ఇప్పటికే ఐదు వేలకు మించిన దంపతులు వీరిని సంప్రదించారుట।

టెస్ట్‌ట్యూబ్‌లలో శిశువులను పుట్టించడం ప్రకృతికి విరుద్ధమైన చర్య అనీ, ఇది మనిషి నైతిక పతనానికి నాంది పలుకుతుందనీ—దీనిని విమర్శించడం ప్రపంచం మొత్తంమీద కొందరికి పరిపాటి అయిపోయింది.

ఈ విమర్శ—ఆ విమర్శకుల అమాయకతను, అర్థం లేని ఆవేశాన్ని చాటుతుందే కాని సత్య సమ్మతం మాత్రం కాదు. ఎంచేతంటే వీరి వాదం ప్రకారం కుటుంబ నియంత్రణ పాటించడం కూడా ప్రకృతికి విరుద్ధంగా పయనించడమే అవుతుంది. ఇంతెందుకు? చూపు తగ్గితే కళ్ళజోళ్ళు పెట్టుకోడం, చెవులు వినకపోతే వినికిడి పరికరాలు అమర్చుకోడం కూడా ప్రకృతికి వ్యతిరేకమైన చర్యలే కదా? అంచేత ఈ విమర్శలు—తిరోగమనవాద ప్రతిరూపాలు, వైజ్ఞానిక పురోగతికి ప్రతికూలాలు, మనిషి మనుగడకు గుదిబండలు—అని గ్రహించడం ఎంతైనా అవసరం!

# సమస్యలూ-సలహాలూ

నిర్వహణ : కమలా వసంతకుమార్

ఆర్. వి.

నేను మంచి కుటుంబంలో పుట్టాను. దేనికీ నాకు లోటులేదు. పదకొండో తరగతి వరకూ చదువుకున్నాను. వివాహమైంది; నలుగురు పిల్లలు. కాని నా జీవితంలో అశాంతి। కారణం–నా భర్త స్త్రీలోలుడు. అందువల్ల ఆయన నన్ను గౌరవంగా చూడరు; నేనంటే హేళన। పిల్లల్ని బాగానే చూస్తారు। వాళ్ళకు ఏంకావాలన్నా తెచ్చి ఇస్తారు. కాని నామీదే ఆయనకి కోపం. ఏమైనా అంటే, నన్ను కొడతారు కూడా! నేను అన్నిటికీ పిల్లల ముఖం చూసి వూరుకుంటున్నాను. కాని, నాకు శాంతి లేదు. ఎప్పుడూ మనసులో బాధపడుతూనే వుంటాను. నేను ఎలా ప్రవర్తిస్తే నాకు శాంతి కలుగుతుందంటారు?

మీ భర్త మిమ్మల్ని బాధ పెడుతున్నట్టుగా రాశారు గాని, మీరు ఆయన దగ్గర ఎలా ప్రవర్తిస్తారో—వివరంగా రాయలేదు. ఒక్కోసారి మనకి తెలియకుండానే, మనం ఇంకొకర్ని రేగగొడుతూ వుంటాము. మరి, అలాంటిదేదైనా జరుగుతోందా?–అంటే, మీ ఆయన ఇంటికి రాగానే మీరు ముభావంగా వుండడం, అదొక రకంగా మాట్లాడ్డం వంటి వేవైనా చేస్తున్నారా? అలాంటి వేవైనా వుంటే, అవతలివాళ్ళు (వాళ్ళ తప్పు తెలిసిపోయిందనే బాధ, కోపంగా మారడం వల్ల) విజృంభిస్తారు. అంచేత, అటువంటిదేమీ లేదో వుందో మీరే ఆలోచించుకోండి. అలాంటిది వుంటే, తగ్గించుకోండి. లేకపోతే, కొన్నాళ్ళపాటు శాంతమే వహించండి. ఓర్పు, విశ్వాసం ఈ రెండూ వుంటే మీరు మీ భర్తను మార్చవచ్చును. అయితే, అది నేను చెప్పినంత సులభం కాదనుకోండి. అయినా, అదొక్కటే రాజమార్గం. మీరు మారుమాట చెప్పకుండా, ఆయన ఎంత రాత్రి ఇంటికి వచ్చినా, సంతోషంగానే మాట్లాడి చూడండి, కొన్నాళ్ళు.

యన్. ఆర్.

మా కుటుంబంలో నేను ఆఖరుదాన్ని; అభాగ్యురాలిని. నా వయసు పందొమ్మిది సంవత్సరాలు. కొన్నాళ్ళక్రితం నేను ఒక అతన్ని అభిమానించాను। అయితే, అతను మోసగాడన్న విషయం తెలుసుకోడానికి అట్టే కాలం పట్టలేదు. దాంతో అతనికి నేను దూరమయ్యాను. అతను వేరే పెళ్ళి కూడా చేసుకున్నాడు. నా విషయం మా యింట్లో అందరికీ తెలుసు. అయితే, ఇంకా నేను అతనికోసం పరితపిస్తాననో, అతనికోసం 'వెర్రి మోహం'తో వున్నాననో మా వాళ్ళందరికీ అనుమానం. అదేం లేదని నేనెంత చెప్పినా వినిపించుకోరు. నన్నెవరితోనూ మాట్లాడనీయరు; ఎవరింటికీ వెళ్ళనివ్వరు. మా యింటికి ఎవర్నీ రానివ్వరు; రానిచ్చినా, నాతో మాట్లాడనివ్వరు। నన్ను పుస్తకాలు చదవనివ్వరు; ఏదైనా నేర్చుకుంటానంటే వెళ్ళనివ్వరు। నేను నా కాలం అంతా ఎలా గడుపుతున్నానో, పరమేశ్వరుడికి తెలుసు। నాకు మనశ్శాంతి లేదు. మా యింట్లో నేనొక వింత జంతువును। నిజంగా నాకు జీవితం మీదనే విరక్తి కలుగుతోంది. నన్నేం చెయ్యమంటారో చెప్పండి.

మీ పరిస్థితి నిజంగా చాలా దయనీయమైనది! మీ తలిదండ్రులే మీపై నిర్దయగా వుండడం – ఎంతో శోచనీయమైన విషయం! తలిదండ్రులుగా వాళ్ళ బాధ్యతను వాళ్ళు విస్మరిస్తున్నారనిపిస్తుంది. మీకు 'కొత్త జీవితం' ప్రసాదించాల్సింది పోయి, మిమ్మల్నెందుకు బాధిస్తున్నారో అర్థం కాని విషయం. అయితే, మీరు మాత్రం అసహనం తెచ్చుకోకూడదు. మీరు చదువుకోవాలనుకుంటున్నట్టూ, ఏదైనా నేర్చుకోవాలనుకుంటున్నట్టూ – మీ వాళ్ళతో శాంతంగా చెప్పండి. మీ ప్రవర్తనలో ఎలాంటి అనుమానమూ వాళ్ళకి రాకుండా వుండేలా ప్రవర్తించండి. ఆ మాటే, వాళ్ళతో చెప్పి — వాళ్ళని ఒప్పించండి! తప్పకుండా మీ జీవితం కొత్త చిగుళ్ళు చిగురిస్తుంది!

యమ్. యస్.

నా పధ్నాలుగవ ఏట నాకు 'అతని'తో పరిచయమైంది. అతను ఇంకో వూళ్ళో చదువుకుంటూ వుండేవాడు. సెలవులకు మా వూరు వచ్చేవాడు. వాళ్ళదీ మాదీ ఒక కులం కాదు. నా పదిహేనవ ఏట నేను పెద్దమనిషినయ్యాను. ఆ తర్వాత, అతను ఒకసారి వచ్చినప్పుడు నేను అతనికి లొంగిపోయాను। అయితే, అనర్థం ఏమీ జరగలేదు. అతని చదువు పూర్తయిన తర్వాత, మా వూళ్ళోనే వుంటూ వచ్చాడు. దాంతో మా పరిచయం ఎక్కువైంది. పెద్దవాళ్ళకు తెలియకుండా నేను నా 'ప్రేమ'ను పెంచుకుంటున్నాను. అయితే, తర్వాత తర్వాత అతను ఎంతగా నన్ను కోరినా, నేను మాత్రం మళ్ళీ అతనికి లొంగిపోలేదు. 'పెళ్ళయ్యాకనే' అంటూ వచ్చాను. కాని, వున్నట్టుండి అతను నాతో చెప్పకుండా, చెయ్యకుండా ఇంకో అమ్మాయిని వివాహం చేసేసుకున్నాడు। నేను అతనితో మాట్లాడాలని ఎంత ప్రయత్నిస్తున్నా, అతను తప్పించుకుంటున్నాడు. దాదాపు సంవత్సరం నుంచి– అంటే అతనికి వివాహం అయిన దగ్గర్నుంచీ నేను ఎంతగానో వ్యథ అనుభవిస్తున్నాను. మా వాళ్ళు నా పెళ్ళికి సంబంధాలు చూస్తున్నారు. కాని నాకు ఇష్టం లేదు. పెళ్ళి చూపులనగానే నాకు 'అతనే' గుర్తుకొస్తుంటాడు. అతని ధ్యాసనుంచి ఎలా తప్పించుకోవాలో తెలియక, సతమతమవుతున్నాను....

ఐపోయిందేదో అయిపోయింది; ఆ విషయం గురించి ఇహ చింతపడకూడదు. చింతపడుతూ వుండంటి మీ జీవితాన్ని పాడుచేసుకోకూడదు. తెలిసీ తెలియని వయసులో ఇలాంటి తప్పులు జరగడం పరిపాటి! 'అతని'కి ఎలాగూ వివాహమైపోయింది; మీరు ఇహ ఏమీ చెయ్యలేరు. అయినా అతన్నే మీరు తలచుకుంటూ, బాధపడేకంటే – నెమ్మదిగా అతన్ని మరిచిపోవాలి. తొందరగా మీకు వివాహం జరిగితే, మీ భర్తను చూసుకుంటూ, ఆ ఆనందంలో అతన్ని మరిచిపోగలుగుతారు!

వి. ఆర్. ఆర్.

నాకు వివాహమై, పదకొండు సంవత్సరాలు దాటింది. కాని, నాకు పిల్లలు కలగలేదు. మా అత్తగారికి మావారు ఒక్కరే సంతానం। పిల్లలకోసం నేను ఎన్నో పూజలు చేశాను; వ్రతాలు చేశాను. ఎందరో డాక్టర్లకు చూపించుకున్నాను. ఎన్నో వైద్య పరీక్షలు, మందులూ అయినాయి. కాని, నాకు సంతానప్రాప్తి లేదు. అయితే, అందుకని నన్ను మావాళ్లెవరు ఎత్తిపొడవరు. మా అత్తగారు మామగారూ కూడా నన్ను అభిమానంగానే చూసుకుంటారు. మావారు కూడా ఎంతో ప్రేమతో చూస్తారు. అయినా, నాకు

మాత్రం అశాంతే! ఆ అశాంతి నుంచో ఏమో—నా ఆరోగ్యం బాగుండడం లేదు. గుండెల్లో దడగా వుంటుంది; చికాగ్గా వుంటుంది; నీరసంగా వుంటుంది. రాత్రుళ్ళు బాగానే నిద్రపోయినా, నిద్ర లేవగానే భయం! సంతోషంగానే వుండాలనుకుంటాను; కాని, వుండలేకపోతున్నాను. నా మనసు నా స్వాధీనంలో వుండడం లేదు. ఎవరితోనూ మాట్లాడాలనిపించదు; ఏమీ చదవాలనిపించదు; ఏ పనీ చెయ్యాలనిపించదు. నా దిగులు, బాధ నాకే అర్థం కాకుండా వున్నాయి. ఈ పరిస్థితి నుంచి నేనెలా తప్పించుకోవాలి?

మీ అవస్థ నిజంగా విచారించదగ్గ అవస్థ. అయితే మీ సమస్య – పూర్తిగా మానసికమైనది. పిల్లల కోసం మీరు తపించిపోతున్న సమయంలో, ఈ మానసిక వ్యాధి ఆరంభమై వుంటుంది. మనసులో చెలరేగే ఆలోచనా జ్వాలల్ని మీరు లోలోపలే అణచుకోవడం వల్లనే – భయం, నిస్సత్తువ, నరాల బలహీనత వంటివన్నీ కలిగాయి. మీ పరిస్థితిని—మీ భర్త మిమ్మల్ని అర్థం చేసుకున్నవారే గనక, ఆయనతో వున్న విషయాలన్నీ స్పష్టంగా చెప్పి—మీకు దగ్గర్లో వున్న పట్నంలో వుండే ఒక మనస్తత్వ శాస్త్రజ్ఞురాలిని సంప్రదించండి! కొద్ది రోజుల మానసికచికిత్స తర్వాత–మీరు కచ్చితంగా ఆరోగ్యంగా వుంటారు.

మీరు ఇంకొకటి కూడా చెయ్యవచ్చును. పిల్లలు పుట్టలేదన్న దిగులుతో బాధపడేకంటె—ఎవర్నయినా బిడ్డను తెచ్చుకుని పెంచుకోవచ్చును. ఆ బిడ్డను పెంచడంలోనూ, బిడ్డను చూసుకోవడంలోనూ మీకెంతో ఆనందం వుంటుంది; మీ ఆరోగ్యం కూడా బాగుపడవచ్చును. దానికి తోడుగా — మీరు ఎప్పుడూ ఏదో ఒక పనిలో నిమగ్నమవుతూ వుంటే, మీ ఆలోచనలను నెట్టగలుగుతారు; తద్వారా కూడా ఏ మందూ అక్కర్లేకుండానే, మీరు మామూలు మనిషి కాగలుగుతారు.

''సమస్యలూ, సలహాలూ''
శీర్షికకు ప్రశ్నలు పంపేవారు వారి ప్రశ్నను కవర్లోనే పెట్టి పంపాలి. ఎట్టి పరిస్థితులలోనూ వారి పేరు, వూరు బయటపెట్టడం జరగదు. అయినా సరే – పంపిన వారి పూర్తి పేరు, చిరునామా తప్పకుండా ఇవ్వాలి. లేఖలన్నీ చాలా రహస్యంగా ఉంచబడతాయి. ప్రశ్న ప్రచురించేటప్పుడు వారి పేరును పొడి అక్షరాలతోనే వేస్తాము. —వ. సం.






"జీవితంలో వేదనని కాసేపు పక్కకి నెట్టి నిండుగా నవ్వగలిగే శక్తినిచ్చే కార్టూన్లు – మనిషికి గ్లూకోజు డోసు లాంటిది!'' – అంటారు ప్రఖ్యాత కార్టూనిస్టు కుమారి రాగతిపండరి.

ఇరవై ఏళ్ళ ప్రాయమయినా లేని కుమారి పండరీబాయి వ్యంగ్య చిత్రాలు యిప్పటికే కొన్ని వందలుగా వివిధ పత్రికల్లో ప్రచురింపబడ్డాయి. ప్రస్తుతం కార్టూన్లు గీస్తున్న అనేకమంది తెలుగు వారిలో యీమె ఏకైక మహిళా కార్టూనిస్టు! ''ఆడ కార్టూనిస్టును అయివుండీ ఆడవాళ్ళ మీద కార్టూన్లు వేయడం మూలంగా వారి కోపానికి కూడా గురయ్యాను!'' అన్నదామె–నవ్వేస్తూ.

శ్రీ జయదేవ్‌ని (అంతర్యంలో) గురువుగా పెట్టుకొని కార్టూనులు గీస్తున్న పండరి–మొదటి కార్టూను ఆంధ్రజ్యోతిలో 1971 లో వచ్చింది. చిన్నతనం నుంచి సరదాగా ఇండియన్ యింక్‌తో గీతలు గీయడం ప్రారంభించి, స్వయంకృషితో మంచి కార్టూనిస్టుగా ఆమె పేరు తెచ్చుకున్నారు. కార్టూన్ల మీద అభిమానంతో చదువుకు స్వస్తి చెప్పి, అదే పనిగా కార్టూన్లు వేస్తూ, ఆ విద్యలో కృషిచేసి అనుభవం సంపాదించారు.

ఈమె వేసిన మొదటి ''ఇలస్ట్రేషన్'' ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురితమయింది. ఆ తరువాత ఆ పత్రికలోనే రెండు మూడు ఇలస్ట్రేషన్లు కూడా ఆమె వేశారు. రాజకీయ కార్టూన్ల గురించి ప్రస్తావిస్తూ, ''పదవీ దాహంతో ప్రజల దాహాన్ని మరిచిపోయే ప్రజా నాయకుల దురంతాలపై కార్టూన్లు గీయటం నాకూ యిష్టమే!''–అన్నారు.

చిన్నతనం నుంచి వ్యంగ్య చిత్రాలు గీయటంలో ఆమెకు గల అభిలాషను ప్రోత్సహించినవారు ఆమె తల్లి, అన్న శ్రీ రామరాజు. ఆమె అభిమాన చిత్రకారులు తెలుగులో శ్రీ బాపు, శ్రీ గోలి – ఇంగ్లీషులో ఆర్. కె. లక్ష్మణ్. ఇప్పుడిప్పుడు ఆమె 'గోలి'తో కలిసివేస్తూన్న కార్టూన్లు వారపత్రికల్లో వస్తున్నాయి. కుమారి పండరికి సినిమాలు ఎక్కువగా చూడటం హాబీ! అందులోనూ హాస్య చిత్రాలంటే చాలా యిష్టం.

''ఈ కార్టూన్లు గీయటానికి కావలసిన భావాలు మీరు జీవితంలో స్వానుభవం ద్వారా సంపాదిస్తున్నారా?'' అని అడిగితే – ''అబ్బే! నాకు ప్రాకృతిక లోకానుభవం తక్కువ! అంతా పత్రికల ద్వారా సంపాదిస్తూన్న విజ్ఞానం, నా ఊహాలోకానుభవం!'' అన్నారు. మీ జీవితాదర్శం ఏమిటన్న మరో ప్రశ్నకు, ''నేను మంచి కార్టూనిస్టును'' అనిపించుకోవడమేనని అన్నారు విశాఖపట్నంలో వుంటున్న రాగతిపండరి. —విలేకరి

# తరతరాలుగా స్త్రీలకు జరుగుతున్న అన్యాయాలు

తరతరాలుగా భారత వనితలు ఎంత తక్కువ స్థాయిలో చూడబడ్డారో, ఇప్పటికీ ఎలా చూడబడుతున్నారో ఒక పరిశీలన చేద్దాం. ఏ పురాణేతిహాసాలు చూసినా అడుగడుక్కీ ఇవి కనిపిస్తాయి. వనిత అంటే ఒక విలాస వస్తువుగా పరిగణించే ప్రబుద్ధులు ఆనాటినుండీ ఈనాటివరకూ ఉన్నారు. ఎక్కడా కూడా పురుషునితో సమానంగా ఆమెను చూడ్డానికి వీల్లేదు.

రాముడు ఏకపత్నీవ్రతుడు. సీతని అమితంగా ప్రేమించాడు. రావణుడు ఆమెను ఎత్తుకుపోయేక, రావణునితో యుద్ధంచేసి ఆమెను చెరనుండి విడిపించాడు. తరువాత లోకాపవాదం పోగొట్టుకోవాలన్న మిషతో ఆమెను అగ్నిపరీక్షకి గురికమ్మన్నాడు. ఈ అగ్నిపరీక్ష ఒక్క సీతకేనా? సీతావియోగం సహించలేక రాముడు ఏ ఇతర వనితతోనైనా అక్రమ సంబంధం పెట్టుకుని ఉండకూడదా? అది రూపుమాపుకునేందుకు రాముడెందుకు అగ్ని పరీక్షకు గురికాకూడదు? ఇంతకీ తన భార్య శీలం మీద నమ్మకం ఉండబట్టేకదా, రావణుని మీదికి దండయాత్రకి వెళ్ళాడు! తన భార్య శీలం మీద నమ్మకం లేనివాడు రావణుని మీద యుద్ధం ప్రకటించడమెందుకు?

మహా పతివ్రత సావిత్రి తన భర్త ప్రాణాల్ని రాబట్టుకునేందుకు యముని వెంటబడింది. చివరికి తన భర్తని సజీవంగా తీసుకొచ్చింది. ఈ గాథ వల్ల అవగాహన అవుతున్నదేమంటే, వివాహిత అయిన వనిత తన పతికి వ్రతచారిణి అయి ఉండాలని. అర్ధాంగి అన్నందుకు ఆమె ఒక్కతికేనా ఆ బాధ్యత? మిగిలిన అర్థంలో పురుషుని బాధ్యతలేదా?—ఈమె చస్తే మరో ముద్దుల పెళ్ళాం వస్తుందని చూస్తాడనా!

కొందరు మహా పతివ్రతలు తమ భర్తలకు సంక్రమించిన కుష్ఠువ్యాధిని పోగొట్టుకొనేందుకు భర్తలను వెంటబెట్టుకుని అనేక తీర్థాలలో స్నానం చేయించారు. అదే విధంగా భార్యలకే అటువంటి వ్యాధులు సంక్రమిస్తే భర్తలేనాడైనా ప్రయత్నించారా? భార్య చస్తే మరో పెళ్ళికి సిద్ధం! ఈనాడు కూడా అటువంటి సిద్ధపురుషులు కోకొల్లలు. మళ్ళీ కట్నం వస్తుందని ఆశ!

సప్తఋషులలో ఒకడైన జమదగ్ని భార్య రేణుకాదేవి. ఆమె మహా పతివ్రత. ఆమె రోజూ ఏటిఒడ్డుకు వెళ్ళి తన పాతివ్రత్య మహిమవల్ల ఇసుకతో కుండచేసి నీరుపట్టేది. ఒకసారి ఆ నీటిలో ఒక ప్రతిబింబం కనిపించింది. ఇది ఎవరి నీడ చెప్మా అని ఆమెమీదికి చూసింది. అతను దేవేంద్రుడు. అలా ఆమె ఒక పరపురుషుని చూడడంవల్ల ఆమె పాతివ్రత్యానికి భంగం కలిగి, ఇసుకతో నిర్మించిన కుండ పగిలిపోయింది. ఎంత అపచారం జరిగిపోయింది! అదే దేవేంద్రుడు సప్తర్షులచేత చేయబడిన యజ్ఞయాగాది క్రతువులలో హవిర్భాగాలను స్వీకరిస్తాడు. మానవులకంటే దేవతలు గొప్పవారే కదా! అటువంటి గొప్పవారికి గొప్పవాడూ, ముక్కోటి దేవతలకు అధినాథుడూ, మానవ మాత్రులైన ఋషులుచేసే యజ్ఞయాగాది క్రతువులలో హవిర్భాగాలను స్వీకరించేవాడు అయిన ఇంద్రుడు, మానవ స్త్రీ అయిన రేణుకను చూసినంత మాత్రాన ఆమెకు శీలభంగం అయిందా? ఎంత ఘోరం! ఎంత అవివేకం! భావితరం స్త్రీలమీద, తమ ఆధిపత్యాన్ని చెలాయిద్దామనే ఉద్దేశ్యంతో పురుషులు పథకం వేశారు; కాని అది పారలేదు.

స్త్రీలు గోత్ర నామాలతో పూజ చేయించవలసి వస్తే, తమ భర్తల గోత్రనామాలతోనే పూజ చేయించాలి. ఉదాహరణకి: ''గౌతమ సగోత్రస్య ప్రకాశ నామధేయస్య ధర్మపత్నీ సమేతాం'' అని చదవాలి. అంతేకానీ, అందులో ధర్మపత్ని పేరు మాత్రం చదవకూడదు. అవివాహిత అయినట్లయితే తన తండ్రి గోత్రంతో పూజ చేయించాలి. స్త్రీ పురుషులు సమానంగా సృష్టించబడినప్పుడు ఈ అసమానత దేనికి?

నాటికీ నేటికీ సమాజంలో ఎన్ని విప్లవాత్మకమైన మార్పులొచ్చినా స్త్రీ పురుష శిశువులిద్దర్నీ ప్రసవించే స్త్రీయే ఎంత నీచంగా చూపబడుతూందో వనితలు గ్రహించాలి. అంచేత స్త్రీలకు తమ గోత్ర నామాలతో తామే పూజ చేయించుకునే అవకాశం ఉండాలి. భారత సాంప్రదాయం నరనరాల్లో జీర్ణించుకు పోవడంవల్ల తమ గోత్ర నామాలతో పూజ చేయించుకునే అర్హత తమకు లేదనే అభిప్రాయం – అంటే ఒకవిధమైన 'తక్కువ స్వభావం' వనితలకే ఉండడం విచారకరం. ఇది పోవాలి.

వివాహ సందర్భాలకి వద్దాం: భార్య ఏ కారణం చేతనైనా చనిపోతే, ద్వితీయ వివాహానికిగాను అనేకులైన తల్లిదండ్రులు ''మా అమ్మాయిని చేసుకో'' అంటే ''మా అమ్మాయిని చేసుకో'' అని అతని కోసం పోటీ పడతారు. పెళ్ళికుమారుడికి అతని మొదటి భార్య వల్ల పిల్లలున్నా ఫరవా లేదు. అదే వరుడు పిల్లలుండే భర్తను కోల్పోయిన వనితను (అంటే వితంతువుని) ఎందుకు పెళ్ళి చేసుకోకూడదు? ఒకవేళ చేసుకుంటే, చనిపోయిన భర్తవల్ల ఆమెకు కలిగిన సంతానాన్ని ఎవరు చూస్తారనే ప్రశ్న ఉదయించవచ్చు. చనిపోయిన భార్యవల్ల కలిగిన సంతానాన్ని రెండోభార్య ఎలా చూస్తుందో అలాగే, చనిపోయిన భర్తవల్ల కలిగిన సంతానాన్ని కూడా పురుషుకు చూడాలి. భార్యలను కోల్పోయిన భర్తలు, భర్తలను కోల్పోయిన వితంతువులను పెళ్ళి చేసుకోవడం కనీస న్యాయం.



వర్షాకాలం అగ్గిపెట్టెలు, పుల్లలూ తేమని గ్రహించి, త్వరగా వెలగవు. అగ్గిపెట్టెలో 6, 7 బియ్యం గింజలు వేయండి. అగ్గిపుల్లలు చప్పున వెలుగుతాయి.



నారింజ తొక్కలు ఎండబెట్టి బట్టల మధ్య వుంచితే బట్టల్ని పురుగులు కొట్టివేయవు.

—శుభ

వనితలను అసమానంగా చూడ్డానికి మన పూర్వీకులు మరో నినాదాన్ని సృష్టించారు– "అపుత్రస్య గతిర్నాస్తి" అని. పుత్రుడు లేకపోతే గతిలేదట! ఆ పుత్రుడికి పుత్రుడు కలగాలంటే మరో స్త్రీ అవసరం లేదా? అప్పుడతనికి స్త్రీయే గతికాలేదా?

"కార్యేషుదాసీ
కరణేషు మంత్రీ
రూపేషు లక్ష్మి
భుక్తేషు మాతా
శయనేషు రంభా
క్షమయా ధరిత్రీ
షడ్గుణ్య భార్యా
కులముద్ధరంతీమ్" అని వనితలను అవమానపరిచే మరో శ్లోకాన్ని సృష్టించారు. ఏదైనా కార్య సమాలోచన చేసేటప్పుడు దాసీలాగా, కార్యరూపేణా చర్య తీసుకునేటప్పుడు మంత్రిలాగా, రూపంలో లక్ష్మిలాగా, అన్నం పెట్టేటప్పుడు తల్లిలాగా, శయ్యపైన రంభలాగా, ఓర్పులో భూదేవిలాగా, భార్యలు, భర్తలపట్ల మసలుకుంటే–అటువంటి స్త్రీలు కులం అంతటినీ ఉద్ధరిస్తారట!

పై ఆరు సద్గుణాలు భార్యలకే ఉండాలని చెప్పబడ్డది. కానీ భర్తలకు ఎటువంటి సద్గుణాలు వుండాలో చెప్పబడలేదు. అంచేత భర్తలు భార్యలను చూసుకునే విధానం కూడా సూక్తిముక్తావళులలో కల్పించడం అవసరం.

నేటి సమాజంలో వనితలు విద్యావేత్తలై, ఉద్యోగాలు చేసుకుంటూ అన్ని రంగాల్లోనూ ముందడుగు వెయ్యడం ముదావహమే. అయినప్పటికీ వారి పరిస్థితిలో మెరుగనేది అంతగా కనిపించడం లేదు.

ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే, ఏ పురాణేతిహాసాలు చూసినా, ఆధునిక పరిస్థితులు చూసినా, వనితలు తమ భర్తల గురించి ఎన్ని పాట్లైనా పడాలిగాని పురుషులు మాత్రం పడకూడదు. భర్తలు ఇబ్బందుల్లో ఉన్నప్పుడు, భార్యలు తమ పట్ల వహిస్తున్న శ్రద్ధ, భర్తలు తమ భార్యలపట్ల వహించడం లేదు. ఈ మనస్తత్వం పోవాలి. ఇద్దరూ ఒకర్నొకరు సమానంగా చూసుకోడం, ఒకరిపట్ల ఒకరు సమాన శ్రద్ధ వహించడం జరగాలి!

—బులుసు రామలక్ష్మి

# పావురాల ముగ్గు

ఈ ముగ్గు వెయ్యడానికి, ముందుగా 25 చుక్కల చొప్పున తొమ్మిది వరసలు పెట్టాలి. తర్వాత ఒక చుక్క తగ్గించి, రెండు వరసలకు 23 చుక్కలూ తర్వాతి వరుసలో ఒక చుక్క వదలి మరో చుక్కను, మూడు చుక్కలు వదలి 13 చుక్కలు పెట్టాలి. (బొమ్మలో చూడండి)



ఆ తర్వాత—

వరుసగా, 2 వరసలకు 13 చుక్కలు, పక్క వరసకు 15 చుక్కలూ, దాని తర్వాతి వరసకు 13 చుక్కలూ, చివరి వరుసకు 9 చుక్కల ప్రకారం చుక్కలు పెట్టాలి. రెండో చిత్రంలో వున్న ప్రకారం ముగ్గును పూర్తి చేసినట్టయితే అందమైన 'పావురాల ముగ్గు' తయారవుతుంది.

—మోహన





నిర్వహణ: మంగళా కందూర్

### ఉండల బ్యాగ్

ఇది మరీ సన్నవయరూ కాక, మరీ మోటు వయరూ కాక మధ్యస్థంగా వున్న వయరుతో వేయాలి. వయర్ స్టిఫ్‌గా వుంటే బాగానే వుంటుంది కాని వేళ్ళు కోసుకు పోతాయి. అందుకే వేలికి చిన్న గుడ్డముక్క చుట్టుకోవాలి. క్రీమ్ కలరయితే చాలా చాలా అందంగా వుంటుంది. మామూలుగానే మొదట హాండిల్స్‌ను వయరుతో చుట్టాలి. తర్వాత రెండు హాండిల్స్‌కు ముక్కలు వేసుకోవాలి. 32 + 32 = 64 వయర్ ముక్కలు



కావాలి. ముక్క పొడవు 85 అంగుళాలు వుండాలి. అల్లేటప్పుడు తక్కువైతే 4 వరసలు వుండలు వేస్తే సరి. ఒకవేళ ఎక్కువైతే ఇంకొక వరస వుండలు ఎక్కువ వేయవచ్చు. అందుకే కంగారు పడనవసరం లేదు. అల్లికలోని బేధాల వల్ల హెచ్చు తగ్గులు వస్తాయి.

ముందు వయరును రెండుగా మడచి, ఈ భాగాన్ని హాండిల్‌పై నుంచి బయటికితీసి మిగిలిన భాగాన్ని దీనిలోనుండి వేసి లాగితే హాండిల్‌ను పట్టుకుంటాయి వయర్లు. ఇలా ఒక్కొక్క దానికి 32 వయర్ల చొ॥న వేసుకుని 4, 5 లైనులు జడలు వేసుకుని, తర్వాత రెంటినీ కలుపుతూ చుట్టూ మామూలు ముడులు వేసుకుంటూపోవాలి. 3, 4 డైమండ్స్ వచ్చిన తర్వాత వుండలు మొదలెట్టాలి. పెద్ద కష్టమేమీ కాదు. మామూలుగా వయరు సైజునుబట్టి 5, 6 ముడులువేసి, క్రింది నుండి పైకి వంచి వయర్ కొసలను లో నుండి (అడుగునుండి) బయటికి తీసి మామూలుగా ముళ్ళు అల్లుకోవాలి. అంతే! ఒక రౌండ్ వుండలయిన తర్వాత రెండు వరుసలు మామూలుగా అల్లుకుంటే ఒక డైమండ్ వస్తుంది. ఆ తర్వాత తిరిగి వుండలు వేయాలి. ఇలాగ వయరునుబట్టి 5, 6 వరుసలు వుండలువేసి బ్యాగ్‌ను తిరగేసి అడుగున 4 వయర్లలో 2 ముళ్లువేసి, ఆ తర్వాత 2 ముళ్ళు వేసి, ఆ తర్వాత ఈ నాలుగు వయర్లను మధ్య వుంచుకుని, ఇటు 2 అటు 2 వయర్లతో ముళ్ళువేసి మధ్య వయర్లను కాస్త మేర వుంచి కత్తిరించాలి. ఇలా అన్ని వేసుకుంటే బేస్ చక్కగా వస్తుంది. బాగా లాగి వేయాలి. లేకపోతే గ్యాప్ ఎక్కువగా వచ్చి అసహ్యంగా వుంటుంది. లైనింగ్‌వేసి, జిప్ వేయాలి. దీనిని కలరా వుండలువేసి ప్లాస్టిక్ బాగ్‌లో వుంచి జాగ్రత్త చేయాలి. తెల్ల వయర్‌లో వేస్తే ఈ వుండలు చూడటానికి గుండు మల్లెలులాగ వుంటాయి.

## ప్రశ్నలు-జవాబులు

**మండెల పద్మ - పాలకొల్లు**

నేను సన్న వయరుతో ఒక బ్యాగ్ అల్లాను. దానికి కొలతలు ఎక్కువై 60 సెం. మీ. పొడవు ముక్కలు మిగిలిపోయాయి. వాటితో ఏదైనా పర్స్‌గాని, అటువంటిదేదైనా అల్లటానికి వీలవుతుందా?

తప్పకుండా వీలవుతుంది. ఏరకం వయర్ ముక్కలు మిగిలినా ఏదో రకంగా అల్లుకోవచ్చు. చిన్న పర్స్ అల్లితే పెద్ద పర్స్ లోపల పెట్టుకోడానికి కూడ బాగుంటుంది. ఎందుకంటే పెద్ద బ్యాగ్స్‌లో అన్ని రకాల సామాన్లు పెడతాము కాబట్టి డబ్బు త్వరగా చేతికి దొరకదు. అలాంటప్పుడు మిగిలిన ముక్కలతో చిన్న పర్స్‌లు అల్లుకుని అందులో డబ్బు మాత్రం



సెపరేట్‌గా వుంచుకొంటే తీసుకోటానికి అనువుగా వుంటుంది.

పోతే, మిగిలిన ముక్కలతో 4 రకాలు అల్లటం ఫోటోలతో సహా వున్నాయి. ఏ రకం అల్లినా ముందు ఒక పువ్వుగాని, ముడిగాని ఎంత వయర్ పట్టిందో చూసుకోవాలి. దాని ప్రకారం మన దగ్గరున్న వయర్‌కు ఎన్ని పువ్వులు వస్తాయి - పొడవెంత వుంటుందని చూచాయగా ఊహించుకొని వెడల్పుకు ముక్కలు తీసుకోవాలి. ఉదాహరణకు: II బొమ్మలోని పువ్వుకు ఒక అంగుళం వయరు అవసరమైతే IV బొమ్మలోని చేమంతి పువ్వుకు $1\frac{1}{2}$ అంగుళం వయరు పడుతుంది.

I బొమ్మ - బ్రహ్మ ముడి. ఒక పువ్వుకు $1\frac{1}{2}$ అంగుళాల వయర్ కావాలి. పువ్వు సుమారు






I బొమ్మ

½ అంగుళం వెడల్పులో వుంటుంది. ఇది ఎలా అల్లాలో బొమ్మ చూస్తే తెలుస్తుంది. బొమ్మలోని 4 గీతలు 4 వయర్లుగా లెక్క పెటుకోవాలి. అల్లే టప్పుడు జంటలు కలిపి అల్లుకోవాలి. కుడి రెండు వయర్లకు ఆ బొమ్మలోలాగ బాగా త్రిప్పి పట్టుకొని




II బొమ్మ

2వ బొమ్మలోలాగ ఎడమ వయరును దూరిస్తే నంబరు 8 డిజైన్ విశ్రాంతి తీసుకొన్న పొజిషన్‌లో వస్తుంది. హాండిల్ చూశారా! దేనిదో గుర్తు పట్టారా? పైసా ఖర్చు కానిది. బట్టల కొట్లో ఇచ్చే ప్లాస్టిక్ బ్యాగ్ హాండిల్‌కు వయర్లనువేసి బ్యాగ్ అల్లితే ఎంత బాగుందో చూశారా? లైనింగ్ మాత్రం చాలు.




III బొమ్మ



II బొమ్మలోనిది మిగిలిన ట్యూబ్ వయరు, వెడల్పు వయరుతో అల్లినది. పొడవు ముక్కలు కాబట్టి కాస్త పెద్ద బ్యాగ్ వచ్చింది. అడుగున, ప్రక్కల. ముందు వెనక దళసరి అట్ట ముక్కలు పెట్టి లైనింగ్ వేసి, జిప్ పెట్టేటప్పటికి ఎక్కడ లేని అందం వచ్చింది. చేతిలో పట్టుకెళ్ళటానికి అనువైన సైజుతో దిగ్నిఫైడ్‌గా వుంది. మధ్య మధ్యలో ట్యూబ్ వయర్ వేగాం కాబట్టి ఎంతో చక్కగా వుంటుంది.

III బొమ్మలోని ఈ అల్లిక చాలా తేలికైనదని అందరికీ తెలుసు. బొమ్మలో చూపిన విధంగా అల్లితే ఒక కుట్టు వస్తుంది. ఎడమవయరు మొదటిమారు మడచి అల్లితే, రెండవమారు కుడి వయరు మడచి అల్లాలి. రెండు కుట్లతోగాని ముడి పూర్తి అవదు. కొందరు 3 కుట్లు వేస్తారు. అది కూడా బాగానే వుంటుంది. ఫోటోలో చూడండి. పైన మాత్రం పెద్ద పూసలు అల్లాము. అదీనూ నిలువుగా వుంచాం కాబట్టి చక్కగా వుంది. మధ్యలో పూసలు వేయలేదు కాబట్టి అల్లిక దగ్గరిదగ్గరిగా వుండి చాలా నీట్‌గా వస్తుంది. దీనికి అడుగున, ప్రక్కల్లో మాత్రం ప్లైవుడ్ ముక్కలు పెట్టి లైనింగ్, జిప్ వేగాం.



IV బొమ్మలో చేమంతిపూలు చేయటమెలాగో చెప్పాము కదా. ఒక పువ్వుకు 1½ అంగుళాల వయర్ కావాలి 28 అంగుళాల ముక్కను మధ్యన మడిస్తే 14 అంగుళాలొస్తుంది. 9 వరుసలు పువ్వులొచ్చాయి. అంటే 13 అంగుళాలు. ఇంకో అంగుళం ముక్క లోనికి మడవటానికి సరిపోతుంది. దీనికి మాత్రం రన్నింగ్ వయర్ తప్పనిసరి. దీనికి కూడా లైనింగ్,

## జీవనసత్యం

బ్రదుకున వేదన
భారము హెచ్చగ
శాంతి సుఖమ్ములు
సమయుచుండుటను

సేవధి తీరము
చేరి కూర్చుంటి
పరుగులువారే
వార్థి గన్గొంటి

పదపడి లేచుచు
పదపడి కూలుచు
నురగలు జిమ్ముచు
ఉరవడి జూపుచు

పొంగెడు తరగల
పూచిన తత్త్వము
చేసిన బోధన
చిత్తముకెక్కెను

మహి జీవనము
మహా సముద్రము
సుఖ దుఃఖములే
స్ఫురిత వీచికలు

జీవన సత్యము
నీ విధి నెరిగితి
మాయని శాంతిని
మదిలో నిల్పితి

—జ్యోతి

జిప్ కావాలి. వేను కొన్ని రకాలు చెప్పాను. ఇలా మిగిలిన ముక్కలతో రకరకాలు చేసుకోవచ్చును. పర్సులేకాక ఫ్లవర్ వాజ్‌లు కూడా చేసుకోవచ్చును చిన్న చిన్న ముక్కలతో. □



# స్వయంకృతం

శ్రావణమాసం. ప్రొద్దున్ననగా మొదలయిన సన్నని తుంపర బాగా జల్లుగా మారి ఉండీ ఉడిగీ వీస్తున్న గాలితో చేరి ససపెడుతోంది. వరండా ముందున్న మామిడిచెట్టు—వాన జల్లుతోపాటు ఆకులను రాలుస్తూ చిన్నగా చప్పుడు చేస్తోంది. ఎక్కడో దూరంగా పెళ్ళి మేళాలు. అవడానికి మధ్యాన్నం పన్నెండే అయినా మబ్బుగా వుండటం చేత సాయంత్రంలా వుంది. డిపార్ట్‌మెంట్‌లో ఎక్కడా అలికిడిలేదు. ఉన్న ఒక్క మేడమ్ ఆ చివరి రూమ్‌లో కునికిపాట్లుపడుతోంది. శర్మ భోజనానికి వెళ్ళి చాలా సేపయింది. ఇంకా రాలేదు. అంతా నిశ్శబ్దం. చాలా బోర్‌గా వుందనిపించింది. ప్రకృతినయినా పరికిద్దామని బయటకు నడిచాను. బయట ఎక్కడో సన్నని మూలుగు. ఆ చెమ్మ వాతావరణంలో వరండా చూరులో ముడుచుకు కూర్చుని బిక్కమొగంతో చూస్తున్న పిచుకల జంట. నా రాకకు కొంచెం కదలి రెక్కలు ఒక్కసారి విదిలించి మరింత దగ్గరగా జరిగి కూర్చున్నాయి. టీచర్ చూస్తున్నారని భయంగా ఒదిగి కూర్చునే పిల్లలు గుర్తొచ్చి నాకు నవ్వొచ్చింది. ఇంతలో ఆ నిశ్శబ్ద వాతావరణాన్ని భగ్నం చేస్తూ మళ్ళీ మూలుగు వినపడింది. ఈసారి మూలుగు ఇందాకటికంటె దీనంగా బాధగా వుంది. కుతూహలం ఆగక అటుగా నడిచాను. బాత్‌రూం ప్రక్క జామిచెట్టు క్రింద పడుకుని మూలుగుతోంది ఒక కుక్క. నన్ను చూసి లేవబోయి మళ్ళీ ఓపికలేక కాబోలు పడుకుండి పోయింది. కాని దాని మూలుగు మాత్రం మరింత ఎక్కువయింది, దాన్ని చూస్తూ వుంటేనే అర్థం అయిపోయింది–దాని బాధేమిటో. నాకెన్నడూ ఎదురుకాని పరిస్థితి అది. ఒకప్రక్క చలిగాలి, వాన. నేల అంతా బురద, తడి. అలాంటి పరిస్థితిలో తన లాంటి జీవుల్ని మరి కొన్నిటిని ఈ లోకంలోకి తీసుకురావాలని ఆ కుక్క తల్లి పడుతున్న బాధకు నా మనసు గిలగిల్లాడింది. "నేనేం చేయగలను దానికి సహాయం?" ఇంతలో ఏదో పారపోయడానికి తలుపు తీసుకుని బయటకు వచ్చిన గెస్ట్‌హవుస్ వాచ్‌మన్ భార్య నా కంటపడింది. వాళ్ళ వరండాలో ఆ కుక్కకో చిన్న చోటు, ఒక వెచ్చని గోనెపట్టా సంపాదించగలిగేను ఆమెను అర్థించి. ఆమె అయిష్టంగానైనా తానూ ఒక తల్లి కావడం చేతనో, నా మాట మీద గౌరవం చేతనో ఆ కుక్కకు ఆశ్రయమిచ్చింది. ఆ అతి చిన్న పనికే నా మనసు కొంచెం గర్వపడసాగింది. "చాల్లే ఇది కూడా పెద్ద సంఘసేవేనా?" అని అహాన్ని కసిరి రూమ్‌కు వచ్చేసరికి శర్మ కనిపించేడు ఎదురుగా. ఎవరూ లేకుండా రూమ్‌ను అలా వదలి వెళ్ళినందుకు తిడతాడేమోనని భయం వేసి, సిగ్గుపడుతూనే కుక్క దీనగాథ, నా చిన్న సహాయం వివరించాను.

"అయితే నీ సంఘసేవ కుక్కల దగ్గర నుండి మొదలుపెట్టావన్నమాట" అన్నాడతడు నవ్వుతూ. తిట్టనందుకు స్థిమిత పడ్డా ఈ ఎగతాళికి ఒళ్ళు మండింది.

"ఎక్కడి నుండో ఒక చోటి నుండి మొదలు పెట్టాలిగా. అందుకని...." అన్నాను విసురుగా.

"సర్లే. ఇప్పుడు నీతో నాకు గొడవెందుకు? పని పాడవుతుంది." అనుకుంటూ వర్క్‌లో నిమగ్నుడయిపోయాడు.

ఈ లోపల నేనయితే గమనించలేదు కాని ప్రకృతి మరింత భీభత్సంగా తయారయింది.

సిమెంట్ రేకుల మీద మామిడిచెట్టు కొమ్మలు గాలికి విసురుగా ఒరుసుకుంటూ పెద్దగా చప్పుడు చేయసాగాయి. ఎక్కడి నుండి వచ్చిందో సుడి గాలిలా వచ్చి వరండాలోని ఆకులన్నిటినీ రూమ్ లోకి చిమ్మేసింది. ఇసుకరేణు వొకటి కంట్లోపడి భగ్గుమంది కన్ను. వాన బాగా ఎక్కువయిపోయి జల్లు లోపలికి కొడుతోంది. కిటికీలు మూద్దామంటే గాలికి పడటం లేదు. శర్మ లేచి తన వర్క్ కట్టిపెట్టేసి "ఇక లాభం లేదు. ఇదేదో తుఫాన్ లాగుంది. నువ్వు వెంటనే వెళ్ళిపో. నేనూ పోతున్నా" అంటూ వెళ్ళిపోయాడు. నేను తాళం వేసి బయటపడ్డాను. గొడుగు వున్నా కొంత దూరం పోయాక ఇక నా వల్ల కాదంటూ గొడుగు చేతులెత్తేసింది. ఆ గాలిలో నేను కొట్టుకుపోతా నేమో ననిపించింది. దారిలో పెద్ద పెద్ద చెట్లన్నీ భయంకరంగా వూగిపోతూ ఏ క్షణాన విరిగి పడతాయో అన్నట్లుగా వున్నాయి. తడిసి ముద్దయి పోయిన బట్టలతో ఎలాగో రూమ్ చేరాననిపించాను.

ఇక ఆ తరువాత ఆ రాత్రి ప్రకృతి చేసిన విలయతాండవం తెలియని తెలుగువాడు లేడు. గాలీ నీరూ నిప్పూ కలసి నేలను ముంచెత్తాయి. వూరూవాడా ఏకమయింది. పోయినవాళ్ళు పోగా అక్కడా అక్కడా మిగిలిన అభాగ్యుల ఆక్రందనలు, ఆక్రోశాలు, ఇదే అదనుగా తల యెత్తిన రాజకీయపు టార్భాటాలూ, గలాటాలు వీటి మధ్య గడిచిపోయాయొక పక్షం రోజులు. తుఫాన్ బాధితుల కోసం విరాళాలు, సహాయాల కోసం మా స్కాలర్ల సంఘంతో తిరుగుతూ ఒక రోజు బ్యాగ్ నిండా పోగు చేసిన పాత బట్టలతో ప్రవేశించిన నాకు శర్మ పలకరింపు—"ఫరవా లేదు. నీ సంఘసేవ ఇప్పుడు మనుష్యుల్లో పడింది." నాకు వెంటనే ఆనాటి కుక్క జ్ఞాపకం వచ్చింది. అప్రయత్నంగా జామిచెట్టు క్రిందకు చూశాను. నాలుగు చిన్న చిన్న కుక్కపిల్లలు ఆడుకుంటున్నాయి. గుసగుసలాడుతూ ఒకదానితో ఒకటి దెబ్బలాడుతూ పొర్లుతున్నాయి.

"కుక్కపిల్లలు బావున్నాయి కదా!" అన్నాను.

"ఇంకేం. పెంచుకో మంచి జోడీ"

"ఈ శర్మ కెందుకింత ఉత్సాహం నన్ను ఎగతాళి చేయడానికి?" అనుకుంటూ మా మణి వచ్చి లైబ్రరీకి వెళ్దాం పదమనే సరికి అక్కడి నుండి వెళ్ళిపోయాను.

రీసెర్చికి సంబంధించిన తిరుగుడూ అదీ పూర్తయ్యేసరికి మరో నాల్గు నెలలు పట్టింది. అన్ని రోజులు తిరిగి తిరిగి వున్నానేమో చాలా అలసటగా వుంది. ఒక్క పది రోజులయినా ఇంటికెళ్ళి విశ్రాంతి తీసుకువద్దామనిపించింది. మాస్టారిని శలవు అడుగుదామనుకుంటూనే వున్నాను. ఇంతలో ఆయనే నన్ను పిలిపించి "అర్జంటుగా పది రోజుల్లో పూర్తి చేసి పెట్టాలి" అని పని ఒకటి పురమాయించారు. "తప్పేదేముంది" అనుకుంటూ మొదలుపెట్టా. కాని అసలే అలసి వున్న మీదట ఏకాగ్రత కుదరడం లేదు. చికాకుగా వుంది.

"ఇప్పుడయినా వంట్లో బాగా లేదని వెళ్ళిపోనా?" అని అనుకోబోయి పైకి అనేశాను.

"నువ్వే ముందుగా వెళ్ళి శెలవు అడిగితే ఇచ్చేవాడు కదా. ఆయన పిలిచి పని వప్పగించే దాకా వూరుకున్నావు. ఇప్పుడు నువ్వెళ్ళి శెలవు కావాలంటే ఆయన నువ్వు ఈ పని ఎగకొట్ట డానికే నాటకం ఆడుతున్నావనుకుంటాడు. పని జరగదు సరికదా నీమీద ఉన్న సదభిప్రాయం కూడా పోతుంది" అన్నాడు శర్మ మందలింపుగా.

అదీ నిజమేననుకుని సమయానికి సలహా యిచ్చినందుకు శర్మకు కృతజ్ఞతలు చెప్పుకున్నా.

"సరేలే....నీదంతా కంగారుబ్రాండు. పుణ్య కాలమంతా మీన మేషాలు లెక్కబెట్టి ఆ తరువాత గంతులేస్తావు. ఒకసారి దాటిపోయిన అవకాశం కాని, సమయం కానీ మళ్ళీ రావు" అన్నాడు నాకేసి సాలోచనగా చూస్తూ. ఆ కళ్ళల్లో అదో లాగున మెరుపు. ఒకలాంటి కవ్వింపు.

శర్మ మా 'లాబ్'లో సీనియర్ మోస్ట్ స్కాలర్. మా డిపార్ట్‌మెంట్‌లో అందరికీ అతనంటే గౌరవం. సబ్జక్ట్‌లో ఎలాంటి క్లిష్ట సమస్యనయినా యిట్టే అర్థం చేసుకుని సాధించగలడని అతనికి మంచి పేరుంది. అతనికి మంచి విమర్శనా శక్తి ఉండటంతో అందరూ తమ వర్క్‌లను ఫైనల్‌గా పంపే ముందు ఒకసారి శర్మకు చూపుతారు. మా మాస్టారు అతని సలహా సంప్రదింపులు లేనిదే దాదాపు ఏ పనీ చేయరని చెప్పవచ్చు. అయితే శర్మ చాలా నిర్మొహమాటస్థుడు. ఎదుటి వాళ్ళపనిలో ఏదయినా పొరపాటు దొర్లిందనిపిస్తే

"వాఘీరా"

దాన్ని వారికే సూటిగా వెల్లడించేస్తాడు. చాటుగా మాట్లాడటం కాక ఏ విమర్శనయినా ఎదురుగానే చెప్పేతత్వం తనది. అందువల్ల అతనంటే కొందరికి భయం కూడా. అలా అని అతను అనవసరంగా యెవరి జోలికీ పోడు. తన పనేదో తాను చూసుకుంటూ ఎవరితోనూ ఎక్కువగా కలివిడిగా వుండకపోవటంచేత, అమ్మాయిల్లో అతనికి 'గర్విష్టి' అని పేరొచ్చేసింది. కాని నన్ను చూస్తేమట్టుకు యెక్కడలేని ఉత్సాహం వస్తుందతనికి యేడిపించడానికి. నేను చేసే ప్రతి పనినీ, ఆడే ప్రతి మాటనూ వెక్కిరించి ఆనందిస్తూ వుంటాడు. అదే అర్థం కాదు.

"నువ్వొక పిచ్చిమొద్దులా కనిపించావు. అందుకని ఆ గర్వాన్ని టెక్కును నీ మీద ఉపయోగిస్తున్నాడు" అంటారు మా వాళ్ళంతా. అది గర్వమూ, టెక్కూ కాదని, అతని చనువులో, ఎగతాళిలో ఇంకేదో ఉందనే అనిపిస్తుంది నాకు....కాని అతను నన్నెంత కవ్వింపుగా మాట్లాడినా, అతి చనువెప్పుడూ తీసుకోలేదు. హద్దుమీరి ప్రవర్తించలేదు. పైపెచ్చు ఒక్కోసారి నా ఉనికే గమనించని నిర్లక్ష్యం ప్రదర్శిస్తాడు, పనిలో మునిగిపోతే. అటువంటి సమయంలో నిజంగా అవసరం వచ్చి పలకరించవలసి వస్తే కొట్టినంత పని చేసేవాడు. దాంతో మూతి కాలిన రామలింగడి పిల్లిలా నాకు అతడంటే భయం. అందుకే ఆ కవ్వింపు, ఎగతాళి అర్థం అయినా ఏమీ అర్థం కానట్లు అయోమయంగా మొహం పెడతాను. ఇప్పుడూ అలాగే చేశాను.

మాస్టారు పని అప్పగించిన పది రోజులలోనూ ఆ కుక్క పిల్లల్లో ఒకటి మా రూమ్‌కు బాగా అలవాటయిపోయింది. మిగతా పిల్లలు అవతలి నుండే చూస్తుండేవి. కాని దీనికి మాత్రం మహా సాహసం. మేం పని చేసుకుంటుంటే బల్లల క్రిందా, కుర్చీల కిందా దూరి అల్లరి చేస్తుంది. రోజూ ప్రొద్దున్నే నేను రాగానే [illegible]డినుండో పరిగెత్తుకుంటూ వచ్చి నా కాళ్ళకు అడ్డం పడుతుంది. నాకదంటే ముద్దు. అయినా 'వూరకుక్క పిల్లను ముద్దులాడటం ఏమిట'నుకుంటారోనని మళ్ళీ కసిరేస్తుంటాను. మధ్యాహ్నం కారియర్‌లో అన్నం మిగిలినా దానికి పెట్టడానికి నాకు భయం. ఏం పెట్టకుండానే అది అంతలా నావెంట పడుతోంది. ఇక అన్నం కూడా అలవాటు చేస్తే, అది రేపటినుండి నాతో కేంపస్ అంతా తిరిగితే

నేనేం కావాలి? కాకపోయినా ఆ కుక్క ప్రేమ నాకెందుకో అంత యిష్టంగా లేదు. అందుకని తరచు దాన్ని కసిరి బయటకు పంపేస్తున్నాను. ''ఏం పాపం! అలా తరిమేస్తావెందుకు? అంత అపేక్షగా అది నీ దగ్గరకు వస్తే'' అడిగింది నా కొలీగ్ అరుణ.

''పెంచుకునే బంధాలన్నీ తెంచలేనివే అవుతాయని నా భయం. ఇప్పుడు ఈ కుక్కకి నామీద, కుక్కమీద నాకు అభిమానం పెరిగిందనుకో. అదెటన్నాపోతే నాకు బాధ. అది ఇంకెవరి దగ్గరన్నా మాలిమి అయితే నాకు జెలసీ. దానికేమన్నా అయితే నాకు దుఃఖం. ఈ అవస్థలన్నీ యెందుకు? అసలు బంధాలు అనేవి పెంచుకోకపోతే దుఃఖం అనేది ఉండదు కదా!'' అన్నాను.

''పుట్టినవాడు చావక తప్పదని అందరికీ తెలుసు. అంతమాత్రాన, ఎప్పుడో చస్తాం గదా అని యిప్పటినుండీ 'పాడె' అదీ సిద్ధంచేసి పెట్టుకుంటున్నారా? ఎప్పుడో విడిపోవాల్సి వస్తుందనీ, బంధాలకు దూరంగా ఉండాలనుకునే వారు—అయితే సన్యాసులన్నా అవ్వాలి. లేదా బుర్ర తిరుగుడు మనుష్యులన్నా కావాలి. మనిషిగా పుట్టాక చల్లటి చిరునవ్వులూ, వెచ్చటి కన్నీళ్ళూ, మండు వేసంగులు, మల్లెల సాయంత్రాలూ అన్నీ ఉంటాయి. బంధాలకు దూరంగా బ్రతికినవాడి బ్రతుకుకు అర్థం లేకుండా పోతుంది. అలాంటి బ్రతుకులో దుఃఖం మాటెలా వున్నా సుఖం మాత్రం ఉండదు.'' ఇది శర్మ వ్యాఖ్యానం నా జవాబుకు.

శర్మ చెప్పినదాంట్లో సత్యం లేకపోలేదని నాకూ తెలుసు. కాని....కాని....బంధాలంటే నాకెందుకో భయం. నేను చూసినంతవరకు ప్రకృతిలో ప్రతి ఆనందం వెనుకా ఒక విషాదం దాగి వుంటూనే వుంది. పూచే ప్రతి గులాబీకి వెనుక ముళ్ళుంటున్నాయి. వాసనలు వెదజల్లే సంపంగి పొదమాటున నాగుపాము, ఆనందంగా యెగిరి గంతులేసే కడలి తరంగాల వెనుక అంతులేని అగాథం, మధుర స్వప్నంవంటి యవ్వనం వెనుక పీడకలవంటి వృధాప్యం, వాటి వాటి అందాలని, ఆనందాలని తనివితీరా పొందనివ్వవు. చక్కటి మల్లెపూల చెండు...మరునాటికది వాడిపోతుంది. ఆ సుకుమారం, సౌరభం మాసిపోతాయి. జీవితంలో, అసలు సృష్టిలోనే వున్న ఈ అశాశ్వతత్వం నాకు బ్రతుకులో అందాల యెడల విరక్తినీ, భయాన్నీ కలుగజేసింది. ఒక వ్యక్తిపట్ల కాని, వస్తువుపట్ల కాని మనం పెంచుకునే అనుబంధమే ఆ వ్యక్తి ద్వారా మనం పొందబోయే దుఃఖాన్ని నిర్ణయిస్తుందని నా అభిప్రాయం. ఒక వ్యక్తిని మనం ప్రేమించినప్పుడు అతని కాలికి ముల్లు గుచ్చుకున్నా మనకు అమితమైన బాధ కలుగుతుంది. అదే దారినపోయే దానయ్య ఎవడో యాక్సిడెంటుకు బలయిపోయాడంటే ''అయ్యో పాపం!'' అని ఒకసారి అనుకుని వూరుకుంటాం. అందుచేత అసలు ఆ మమతే లేకపోతే....అంతా నిశ్చింతే.

నేను ఈ 'మమతా రాహిత్య' సిద్ధాంతానికి రావడానికి మా యింట్లో నేనెరిగిన, చూస్తున్న వ్యక్తుల అనుభవాలు కూడా కొంత కారణమయ్యాయి. మా యింటి ఆడపిల్లల్లో నేను రెండవదాన్ని. నాకు, మా అక్కకు వయస్సులో తేడా చాలా వున్నా, మనసుల్లో సాన్నిహిత్యం మట్టుకు చాలా యెక్కువ. తనలో కలిగే ప్రతి స్పందన, ప్రతి అనుభూతి, ప్రతి ఆలోచన నాకు చెప్పుకోనిదే వూరుకునేది కాదు మా అక్క. నా వయసు టీనేజిలోకి జొరబడుతున్న సమయంలో అక్కకు పెళ్ళయి బావతో వెళ్ళిపోయింది. మనిషి దూరమయినా తన మనసునంతా ఉత్తరాలలో నింపి వ్రాసేది అక్క. ఆ ఉత్తరాల నిండా బావ వూసే. తనను పువ్వుల్లో పెట్టి చూసుకునేవాడట బావ. సరదాలు.... షికారులు, చిట్టి పొట్టి తగాదాలు....ఓహ్....వారి జీవితమొక పువ్వుల పడవలా గడిచిపోతోందని చెప్పేవి అక్క ఉత్తరాలు. ఆ తరువాత వాళ్ళకు పిల్లలు పుట్టడం మొదలు పెట్టాక అలాంటి ఉత్తరాలు రావడం మానేశాయి అక్క నుండి. ఏదో మొక్కుబడికి వ్రాసినట్లుగా వ్రాసేది. వారి దాంపత్యానురాగాన్ని, ఆనందాన్ని ఒక అందమైన కథగా విని ఆనందించే నాకు బాధగా అనిపించింది. ఒకసారి అక్క మా యింటికి వచ్చినప్పుడు అడిగాను సంగతేమిటని. అక్క మొహం వివర్ణమయింది. అన్నాళ్ళుగా దాచుకున్న ఆవేదన కట్టతెంచుకోవడంతో తన బాధనంతా నా ముందు వెళ్ళబోసుకుంది. మొదట్లో తమ సంసారం స్వర్గతుల్యం. అక్క అంటే బావకు ఎంతో ప్రేమ. అలాగే అక్క కూడా బావతోడిదే లోకంగా భావించింది. కాని పిల్లలు పుట్టడంతో వారి సంసారంలో సుఖం క్రమక్రమంగా యిగిరిపోవడం మొదలు పెట్టింది. ఒకరి అభిప్రాయాలు మరొకరికి సరిపడటం మానేశాయి. పిల్లల అనారోగ్యాలు, చికాకులు. వారి పెంపకంలో తగాదాలు. కాగా మధ్యలో పెద్దవాళ్ళ జోక్యాలు ఇలా ప్రవేశించిన అభిప్రాయభేదాలు అన్ని విషయాలలోనూ పాకి చివరకు అక్క బావ ఒకరికొకరు బద్ధశత్రువుల్లా మారిపోయారు. ''ఆ రోజుల్లో నేనంటే అంత యిష్టపడిన బావకు ఈ రోజు నన్ను చూస్తేనే యెక్కడలేని చిరాకు, కోపం. ఈ బాధ నన్ను రంపపుకోత కోస్తూంది. అసలు నేను కూడా ఆయనను అంతగా ప్రేమించి ఉండకపోతే ఈనాడు నాకింత వేదన వుండక పోనేమో. అందరిలా నేనూ జీవితమింతేనని సరిపెట్టుకునేదాన్నేమో'' అంటూ వాపోయింది కన్నీళ్ళునిండిన కళ్ళతో.

నాన్నగారి మట్టుకు నాన్నగారి జీవితంలోనూ అటువంటి అనుభవమే. మా బామ్మగారు చిన్నతనంలోనే పోతే తాతగారు మళ్ళీ పెళ్ళి చేసుకున్నారు. ఆవిడకు ఒక ఆడపిల్ల కలిగింది. ఆ చెల్లి అంటే నాన్నగారికి అమిత ఇష్టం. ఆవిడ యేది కావాలంటే అది నిముషాలమీద తెచ్చిచ్చేవారుట. ఆవిడ ఆడింది ఆట, పాడింది పాట. ఆవిడకు కొంచెం కాలునొచ్చినా ఆయన ప్రాణం విలవిలలాడిపోయేది. ఆ సవతి అన్నాచెల్లెళ్ళ అనురాగాన్ని గురించి అందరూ అబ్బురంగా చెప్పుకునేవారుట. అయితే ఆవిడ హఠాత్తుగా ఏదో జబ్బు చేసి చనిపోయింది. ఇక ఈయన బాధ వర్ణనాతీతం. ఆ దెబ్బనుండి కోలుకోవడానికి చాలారోజులే పట్టిందాయనకు. ఇప్పటికీ ఆవిడ గుర్తువస్తే అదోలా అయిపోతారాయన. ''మరీ యింత 'యిదే'మిటి నాన్నా!'' అంటే ''బాధ అనేది ఆ మనిషిపై మనం పెంచుకున్న మమత మీద ఆధారపడి ఉంటుందమ్మా'' అంటారాయన.

ఇవన్నీ చూసేసరికి నాకు 'బంధాలంటే బంధనాలే' అన్న అభిప్రాయం ఏర్పడిపోయింది. అనురాగాలకూ, బంధాలకూ, వాటివల్ల ఆవేదనలకూ ఆందోళనలకూ దూరంగా ఉండటం మేలనిపించింది. అందుకే నేను ఎవరినీ కావాలని కోరి పెళ్ళాడదలచుకోలేదు. పెద్దలు నిశ్చయించిన వాళ్ళతో జీవితం పంచుకోగలిగినన్నాళ్ళు పంచుకోవడం, ప్రాప్తమున్నంతవరకు అనుభవించి నిర్లిప్తంగా నిష్క్రమించడం చేయదలచాను. శర్మపట్ల నాలో యిష్టత పెరుగుతున్న విషయం నాకు తెలుసు. దాన్ని పెంచి పెద్ద చేయడం నాకిష్టంలేదు. అందుకే అతనిపట్ల నిర్లక్ష్యవైఖరితో

**[లోకజ్ఞానం : సమాధానాలు]**

1. టిబెట్ – నేపాల్ సరిహద్దులలో తూర్పు హిమాలయ పర్వతశ్రేణిలో వున్న ఈ ఎత్తైన శిఖరాన్ని కనుగొన్న వ్యక్తి సర్ జార్జ్ ఎవరెస్ట్. 1856 లో ఆయన 'సర్వేయర్ జనరల్ ఆఫ్ ఇండియా' పదవిలో వుండగా కనుగొనబడటం వల్ల 'ఎవరెస్ట్ శిఖరం' అని ఆ శిఖరానికి నామకరణం చేయడం జరిగింది. ఈ శిఖరం ఎత్తు 29,002 అడుగులు. 1920 - 21 ప్రాంతంలో బ్రిటన్‌కి చెందిన కల్నల్ సి. కె. హొవార్డ్ ఈ శిఖరాన్ని అధిరోహించడానికి ప్రయత్నించి విఫలుడయ్యాడు. ఆ ప్రథమ ప్రయత్నం తరువాత ఎందరో ప్రయత్నించారు. కాని ఫలితాన్ని సాధించినది మాత్రం 1953 సంవత్సరంలో కల్నల్ హంట్ నాయకత్వం కింద వెళ్ళిన బృందం. ఈ బృందంలోని ఎడ్మండ్ హిల్లరి, టెన్సింగ్ నార్కే మే 29 ఉదయం పదకొండున్నరకి ఎవరెస్ట్ శిఖరాగ్రం చేరుకున్నారు.

2. ఆర్థర్ వైనె. ఇంగ్లండు దేశస్థుడు. ఇంగ్లండులోని లివర్‌పూల్‌కి చెందిన వైనె కూర్చిన మొట్టమొదట గళ్ళనుడికట్టు 'న్యూయార్క్ వరల్డ్' అనే పత్రికలో డిసెంబర్ 21, 1913 న ప్రచురితమయింది.

3. దారా షుకో. ఆగస్ట్ 30, 1659 న ఔరంగజేబు సింహాసనాన్ని చేజిక్కించుకునేందుకు అన్నగారైన దారాని హతమార్చాడు.

4. నాగస్వరం వినిపించకపోయినా ఆ వాద్యం వాయిస్తున్నప్పుడు నాగు పాము తన దృష్టి వాద్యం మీదనే కేంద్రీకరించి వుంచుతుంది. ఆ వాద్యం కదలికలనుబట్టి నాగు పాము కూడా లయబద్ధంగా కదులుతుంది.

5. 21. తూర్పు గోదావరికి కాకినాడ, ప్రకాశం జిల్లాకి ఒంగోలు, కృష్ణా జిల్లాకి మచిలీపట్నం, మెదక్ కి మెదక్ పట్టణం ముఖ్య కేంద్రాలు.

6. జూలై 1, 1954 న హైద్రాబాద్ ప్రధాన కార్యాలయంగా పోస్ట్‌మాస్టర్ జనరల్ అధ్వర్యంలో తంతి తపాలా సర్కిల్ ఏర్పడింది.

7. కాబూల్. ఆఫ్ఘనిస్తాన్‌లో ఈ సంవత్సరం ఏప్రిల్ 27 న జరిగిన 'సైనిక తిరుగుబాటు' తో నూర్ మహమ్మద్ తరక్కి దావూద్ ప్రభుత్వాన్ని కూలద్రోసి అధికారంలోకి వచ్చారు.

8. బైబిల్ అంటే 'పుస్తకం' అని అర్థం. గ్రీకు పదం బిబ్లియన్ నుండి గ్రహించబడింది. అసలు బిబ్లియన్, 'బిబ్లిస్' అనే పదం నుండి వచ్చింది. బిబ్లిస్ అంటే 'పేపైరస్' లేక 'పేపర్'–అంటే కాగితం అని అర్థం.

9. బహియా ఫెలిక్స్, చిలీ దేశంలో వుంది. 1916 లో 348 రోజులపాటు ధారాపాతంగా వర్షం కురిసిందట! ఈ పట్టణంలో సాధారణంగా సంవత్సరంలో 325 రోజులపాటు వర్షం కురుస్తూనే వుంటుంది.

10. 'ఆస్ట్రోడోమ్' అమెరికాలోని హ్యూస్టన్ నగరంలోని హారిస్ కౌంటీస్పోర్ట్స్ స్టేడియంలో వుంది. గోల్‌గుంబజ్ చుట్టు కొలత 144 అడుగులు. అయితే – ఈ 'ఆస్ట్రోడోమ్' బాహ్యపు చుట్టుకొలత 710 అడుగులు లోపలి చుట్టుకొలత 642 అడుగులు.

---

వుండడానికి నిశ్చయించుకున్నాను. నా మనసు అతని గూర్చి ఆలోచించకుండా ఉండేందుకు కాయశక్తులా ప్రయత్నించాను. నా రిసెర్చ్ వర్క్‌ను మరింత తీవ్రం చేశాను. రాత్రింబవళ్ళు అదే ధ్యాస. అదో తపోనిష్ఠ లాంటి దశ. నాకు మరి ఏ ఆలోచనకూ టైమ్ లేదు.

ఈ మధ్యలో శర్మకు నార్త్‌లో మంచి ఉద్యోగం వచ్చింది. ఇంక నా 'మమతారాహిత్యం' ఉద్యమం ఇంకా విజయవంతంగా సాగుతుందనుకున్నా.

శర్మ వెళ్తాడనగా మా వాళ్ళంతా పార్టీ యిచ్చారు. ఆ రోజు రాత్రి పార్టీ అయ్యాక నన్ను దిగబెట్టే మిషమీద నాతోనే వచ్చాడతను. దారిలో చాలా సేపటి వరకూ మౌనమే రాజ్యమేలింది.

"ఏదైనా మాట్లాడు" అన్నాడు శర్మ ఆ నిశ్శబ్దాన్ని భరించలేని వాడిలా.

"ఏం మాట్లాడను?" అన్నా తలవంచుకుని. నా గొంతు నాకే వెలితిగా వినిపించింది.

"నిజంగానే నాతో నువ్వేమీ మాట్లాడదలచుకోలేదా?" ఆ మసక వెలుతురులో శర్మ కళ్ళల్లో ఆరాటం, ఆత్రుత స్పష్టంగా కనిపించాయి.

"ఇన్నాళ్ళు ఇక్కడ బాగా అలవాటయి. వదలి వెళ్ళాలంటే నా కదోలా వుంది" అన్నాడు బేలగా.

"ఇప్పుడలానే అంటారు. కొంత కాలం పోయాక అంతా మర్చిపోతారు. కొత్త పాతయిపోతుంది. పాత గతంలోకి పారిపోతుంది" అన్నాను.

"కాని కొన్ని గతాలంత త్వరగా పారిపోవు. అలా పోనీయడం నా కిష్టం లేదు."

"ఏం? కాలాన్ని ఆపేస్తారా?" అన్నాను నవ్వుతూ.

"నాకు తోడుగా నువ్వొస్తానంటే నాకంత శక్తి నిజంగా వస్తుంది. రాగలవా మరి?" నేను యెదురు చూడలేదు యింత సూటి ప్రశ్న.

"నాకు కొంచెం టైం కావాలి" అన్నాను. అతని సమక్షంలో 'లేదు' 'కాదు' అని చెప్పగలిగే శక్తి లేదు నాకు.

"సరే. ఆలోచించి చెప్పు. రేపు వస్తాను" అని వెళ్ళబోయి వెనక్కి తిరిగి ఒకసారి ఆగి "నిరాశపరచవు కదూ!" అన్నాడు మృదువుగా.

ఆ చీకటిలో అతను వెళ్ళిన దిక్కునే చూస్తూ ఉండిపోయాను చాలా సేపు. అదంతా ఏదో కలలా వుంది. అలా మత్తుగానే లోపలికి నడచిపోయాను – మిత్రుల పలకరింపులో ఈ లోకంలో పడిన నేను.

అతడు నన్ను పెళ్ళాడతానంటున్నాడు నేను అంగీకరిస్తే. కాని నాకు అతన్నే చేసుకోవాలన్న 'యిది' ఏమీ లేదు. అందువల్ల నా 'మమతారాహిత్య' సిద్ధాంతానికి భంగం రాదు. పైగా శర్మ లాంటి వ్యక్తిని పెళ్ళాడటానికి ఏ ఆడపిల్లకయినా ఎట్టి అభ్యంతరమూ వుండదు. చక్కని తెలివితేటలు, దానికి తగ్గ రూపమూ, గుణమూ, అన్నిటికంటె ఒక విశిష్టమైన వ్యక్తిత్వం.... అతని తోడి బ్రతుకెవరికయినా గోదారిలో రాదారిబోటులా చల్లగా సాగిపోతుంది. కాని.... అతను నాలో ఏం చూసి అంత యిష్టపడుతున్నట్లు? నేనేమంత ఉన్నతురాలిని! అందగత్తెననా? అద్దం అబద్ధం చెప్పదు. డబ్బా! అంతంతమాత్రం. ఇంక నా తెలివితేటలు నాకంటె తనకే ఎక్కువ తెలుసు. ఈ ఆకర్షణ ఇప్పుడు




## లేమిలో కలిమి

(నవల)

[రచన : కోమలాదేవి; వెల : రు. 3-50; పేజీలు: 150; ప్రచురణ : ఎమ్.శేషాచలమ్ అండ్ కో మద్రాసు-1]

యువతరం నిరుద్యోగ సమస్యతో విసిగిపోతున్న ఈ సమయంలో ఇటువంటి ఉపయోగకరమైన నవల రావటం హర్షించదగ్గ విషయమే గాని....నవల పూర్తిచేసాక ఆ ఆనందం అట్టే సేపు నిలవదు. కారణం....రచనా విధానం సరిగ్గా లేకపోవటమే!

వ్యాపారంలో దివాలా తీసిన ప్రసాదరావుని, అతనివల్ల సహాయం పొందిన వారెవరూ ఆదుకోరు. ఆ పరిస్థితిలో కాలేజీ చదువు ముగించిన వారి కుమార్తె అరుణ. ఆమె పెదనాన్న కూతురు ఆనంద....స్వయం ఉపాధిపథకం ఆలోచించి, ఆత్మవిశ్వాసంతో, పట్టుదలతో గుడ్డలు మెండ్ చెయ్యటం వంటి చిన్నపనులతో ఆరంభించి, క్రమక్రమంగా ఒక చిన్న వ్యాపారం, ఒక కుటీర పరిశ్రమను పెంపొందించుకొని, మరి కొందరికి కూడా పని కల్పించే స్థాయికి ఎదిగి, పలువురుకి మార్గదర్శక మవుతారు.

ఆదర్శవంతమైన ఈ నవల అక్కడక్కడ విసుగు కల్గించటమే గాక, తికమకగా కూడా అన్పిస్తుంది. కథనంలో స్పష్టత కన్పించదు సరికదా, ఏ పాత్ర, ఏ డైలాగు మాట్లాడుతున్నదో అర్థం కావాలంటే కొన్ని పేజీలను మరోసారి చదవాలి.

కొత్తదైన ఇతివృత్తాన్ని ఎన్నుకున్న రచయిత్రి శైలి, శిల్పం విషయంలో తగినంత శ్రద్ధ తీసుకోలేదనిపిస్తుంది.

## దివ్వెలు

(గేయాలు)

[రచన : జ్యోతిర్మయి; వెల : రు. 2-50; పేజీలు : 40; ప్రతులకు : ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్; సికింద్రాబాద్;-దేశిబుక్ హౌస్, హైదరాబాద్.]

చాలామంది రచయిత్రుల్లా, మామూలు నవలల జోలికి పోకుండా, బాల సాహిత్యాన్ని చేపట్టిన జ్యోతిర్మయిగార్ని ముందుగా అభినందించాలి.

ఇందులో పాతిక దివ్వెల్ని 'రవ్వలాంటి భావి పౌరుల' కోసమే వెలిగించినా....అందులో కొన్ని పెద్దల్ని కూడా ఆహ్లాదపరుస్తాయి.

ఈ గేయాలన్నీ పాడుకోవటానికి వీలుగా వున్నాయా, లేదా. పాడితే లయబద్ధంగా వుంటుందా, లేదా అని ఆలోచిస్తే....కొన్ని గేయాలు మాత్రమే అందుకు ఉదాహరణగా నిలుస్తాయి.

"ఊయల" గీతంలో "చిట్టి తమ్ముడికి నిదురపోయే చిన్ని గొలుసుల ఊయలున్నది.... అట్లతద్దికి అక్క కట్టిన అందమైన ఊయలున్నది" అంటూ అచ్చ తెలుగులోని అందాల్ని చూపిస్తూ బాలల్ని ఊపే రచయిత్రి 'పాపాయి' గురించి చెబ్తూ....పాపాయి నడకలో చిగురాకు చిన్నెలు, హృదయాన్ని వెలిగించు మధురమౌ దివ్వెలు అంటూ పసిపాప గురించి అతి సున్నితంగా తెలియబరిచారు.

చల్లటివేళ, చక్కగా పాడుకోగల్గిన ఈ సాహిత్యము ప్రతి తల్లి తమ పిల్లలకు నేర్ప గల్గితే....రచయిత్రి కృషి ఫలించినట్లే.

---

దూరంగా ఉన్నందువల్ల కలిగినదేనేమో! రేపు పెళ్ళయ్యాక ఈ ఆకర్షణ పోతే....అప్పుడు మేము కూడా సగటు ఆలుమగల లాగే కీచులాడుకుంటూ ద్వేషించుకుంటూ బ్రతకాలంటే.... అబ్బ....అవూహే భయంకరంగా ఉందినాకు. ఇప్పుడు నేను ఎంతో ఉన్నతుడిగా ఊహించుకుంటున్న శర్మను అసహ్యించుకునే పరిస్థితే కలిగితే, ద్వేషించే పరిస్థితే వస్తే....అది నేను సహించలేను. అందుకే ఆ పరిస్థితి రానియ్యదలచుకోలేదు.

ఆ మరునాడు సాయంత్రం దాకా అటూ యిటూ తిరిగి శర్మకు కనపడకుండా కాలక్షేపం చేసి అతని ట్రయిన్ కదిలేక రూమ్‌కు చేరి స్థిమితపడ్డాను. నేను అతన్ని తప్పించుకున్నా అతడు నన్ను వదలలేదు. తన ప్రశ్నకు జవాబు కావాలంటూ రెండుసార్లు ఉత్తరాలు వ్రాశాడు. వాటిని అక్కడికక్కడే చించి వేశాను. ఏ క్షణంలో నేను లొంగిపోతానో అని నా భయం. నాకో కొత్త ఆలోచన వచ్చింది. "అసలు పెళ్ళి మానేస్తేనో? ముందర లేకపోయినా, తరువాత బంధమేర్పడవచ్చుకదా!" నా మనస్సెటు పోతోందో నాకే తెలియడం లేదు. మావాళ్ళు నాకెన్ని సంబంధాలు తెచ్చినా అన్నీ తిరగ కొట్టేశాను. దాంతో వాళ్ళకు విసుగొచ్చి మానుకున్నారు. నాకు మా డిపార్టుమెంట్‌లోనే ఉద్యోగం వచ్చింది. ఇదివరకు మేమంతా ఉండే రూమే నాకు ప్రత్యేకంగా యిచ్చారు. కుక్కపిల్ల యిప్పుడు నా రూమ్‌లోకి రావడం లేదు. బయటనుండే చూస్తుంటుంది. ఇదివరకటి వాచ్‌మన్ కుటుంబం అక్కడి నుండి వెళ్ళిపోవడంతో ఆ కుక్కపిల్లకు తిండిపోయి అంతకుముందు బొద్దుగా వుండేది కాస్తా డొక్కులా అయిపోయింది. డొక్క లెగరేసుకుంటూ నీరసంగా తిరిగే దాన్ని చూస్తే మనస్సు కలుక్కుమంటుందొకోసారి. కాని, జాలి పడి దానికేమయినా పెట్టబోతే అది దగ్గరకు రావడం లేదు. నన్ను చూసి భయంతో దూరంగా పారిపోతోంది.

ఒక రోజు పోస్ట్‌లో శుభలేఖ. అది శర్మ పెళ్ళి శుభలేఖ. నిజమే ఎన్నాళ్ళని అతనలా ఉండగలడు ఒంటరిగా? అతను పెళ్ళి చేసుకోవడం అసహజమేమీ కాదు. కాని...ఆ శుభలేఖ పట్టుకొన్న నా చేతిలో సన్నగా వణుకు. అంతకు ముందే కాఫీత్రాగి వేసుకున్న వక్కపొడి దెక్క పట్టింది. గుండెల్లో నొప్పి. కొండంత కలవరంగా వుంది మనస్సులో. శర్మ పేరు ప్రక్కన ఉన్న అమ్మాయి పేరు నన్ను వెక్కిరిస్తున్నట్లుగా వుంది. ఆనాటి తుఫాన్ సముద్రపుహోరు మళ్ళీ నా గుండెల్లో నాకు వినపడుతోంది. ఇంతకీ ఇంత అలజడి నాకెందుకు? బాధయెందుకు? కలవరం యెందుకు!

"అతన్ని నువ్వెంతగా ప్రేమించావో నీకే తెలియక, మూర్ఖమైన సిద్ధాంతాలతో దూరం చేసుకొని, నిన్ను నీవే వంచించుకొని, నీకు నీవే ద్రోహం చేసుకున్నావు. నీ జీవితానికి నువ్వే గోరీ కట్టుకున్నావే పిచ్చిదానా!" అంటూ నా ప్రమేయం లేకుండానే కారిపోతున్న కన్నీరు నా చెంపలపై జవాబు వ్రాసింది. □




'నవ్వు నాలుగు విధాల చేటు' అన్నారు. 'సంతోషం సగం బలం' అని కూడా అన్నారు. అంచేత నవ్వాలా? నవ్వకూడదా? అని 'విచారించే వారికి' ప్రొఫెసర్ ఫ్రై (స్టాన్‌ఫోర్డ్ విశ్వ విద్యాలయం-కాలిఫోర్నియా) ఒక సంతోషకరమైన వార్త చెప్పారు. ఆ వార్తకు ఆధారం ఆయన ఇటీవల బ్రిటన్‌లో జరిపిన ఒక ప్రయోగం. ఆ ప్రయోగంలో ప్రొ॥ ఫ్రై ఏం చేశారంటే, ఒక సమావేశంలో పాల్గొన్న సభ్యులందరినీ వైర్ల ద్వారా కొన్ని యంత్రాలకు సంఘటిత పరచి, ప్రసిద్ధ హాస్య నటుల ఛలోక్తులను వాళ్ళకు వినిపించారు. వాళ్ళు అవి వింటూ, పొట్టచెక్కలయ్యేలా నవ్వుతూవుంటే, దేహంలో ఏర్పడిన పరిణామాలను ఆ యంత్రాలు నమోదు చేశాయి. ఆ వివరాల ప్రకారం-హాయిగా నవ్వడంవల్ల పొట్టకు సంబంధించిన కండరాలకు మంచి వ్యాయామం కలుగుతుందని, రక్తప్రసార స్థాయిలో అభివృద్ధి ఏర్పడుతుందనీ తెలిసింది।

*

'ప్రశాంతంగాను, ఎలాంటి ఒడిదుడుకులు లేకుండా, అన్ని సౌకర్యాలతోను జీవించేవారు-తొందరగా చనిపోవడానికి అవకాశాలున్నాయి।' అని ఇటీవల ఓ చిత్రమైన వైద్యవిశేషాన్ని ఒక సోవియట్ వైద్యశాస్త్రజ్ఞుడు ప్రకటించారు. ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ గెరొంటాలజీ (కివ్)లో కొన్ని జంతువుల జీవన విధానాలపై ప్రయోగాలు జరిపిన తర్వాత-ఆయన తన పరిశోధన వివరాలను ప్రకటించారు.

ఈ పరిశోధన కోసం ఆయన వెయ్యికిపైగా జంతువులను రెండు బృందాలుగా విభజించారు. ఒక బృందంలోని జంతువులకు చక్కని ప్రశాంతత, మంచి ఆహారం, కలవరం, భయం లేవి వాతావరణం కల్పించారు. రెండవ బృందంలోని జంతువులు—రకరకాల ఇబ్బందులు, కష్టాలు, భయాలు ఎదుర్కొనేలా చేశారు. ఆ తర్వాత వీటి జీవన విధానాలను పరిశీలిస్తే, అన్ని సౌకర్యాలు చక్కగా ఉన్న బృందంలోని జంతువులే-తొందరగా మరణించాయట।

*

దోమలవల్ల మలేరియా, ఫైలేరియా వంటి జబ్బులేకాక, ఇస్నొఫీలియా (టి. ఇ. ఎస్) అనే ఛాతీకి సంబంధించిన జబ్బు కూడా వస్తుందని ఇటీవల రుజువైంది. ముఖ్యంగా రాత్రుళ్ళు ఎడతెరపి లేకుండా దగ్గు రావడానికి దోహదం చేసే ఆస్మా లాంటి ఈ వ్యాధి దేశంలోని అన్ని ప్రాంతాలలోను వుందని - ఈ మధ్య ఢిల్లీలో జరిగిన ప్రపంచ వైద్యశాస్త్రజ్ఞుల సమావేశంలో ప్రముఖులు వెల్లడి చేశారు. దోమల వల్ల వ్యాప్తి చెందే 'మైక్రో-ఫైలేరియా' అనే క్రిమి రక్తప్రసారాన్ని కలుషితం చేస్తే, 'ఫైలేరియాసిస్' వస్తుందని, అదే ఊపిరితిత్తులతో వ్యాపిస్తే, టి. ఇ. ఎస్ జబ్బు వస్తుందనీ ఆ వైద్యశాస్త్రజ్ఞులు తెలియజేశారు.

*

మార్జువానా అనే మత్తు పదార్థం - దేహానికి హానికరమన్న సంగతి అందరికీ తెలిసిందే. ఐతే, అది ఆస్మా రోగుల చికిత్సకు ఎంతగానో ఉపయోగపడుతుందన్న విషయాన్ని దోనాల్డ్ తాష్కిన్ (కాలిఫోర్నియా విశ్వ విద్యాలయం) అనే వైద్యశాస్త్రజ్ఞుడు రుజువు చేశారు. మార్జువానా కలిసిన సిగరెట్లను పదిమంది ఆస్మా రోగులకు ఇచ్చి, వైద్యపరిశోధన చేసిన తర్వాత — వాళ్ళు తేలికగా ఊపిరి పీల్చగలిగారట. అంచేత— మార్జువానాలోని ఉపయోగకరమైన పదార్థాలతో- ఒక మందును రూపొందిస్తే, ఆస్మా రోగులు ఆ వ్యాధి బారి నుంచి తేలికగా తప్పించుకోడానికి అవకాశాలు ఉన్నాయని ఆయన అభిప్రాయ పడ్డారు.

*

కీళ్ళ నొప్పుల వ్యాధి ('ఆర్థ్రిటీస్')తో బాధ పడుతున్న వారిని త్రాచుపాము విషంతో నయం చెయ్యవచ్చునని ఇటీవల ఒక భారతీయ ఆయుర్వేద వైద్యనిపుణుడు-ఐదుగురు రోగులపై ప్రయోగాలు చేసి, రుజువు చేశారు. ఈ విషాన్ని మందు రూపంలో రెండు నెలలపాటు తీసుకోవాలట. ఈ వైద్య విశేషాన్ని పరిశీలించడానికి ప్రపంచ ఆరోగ్య సంస్థ (W. H. O) కూడా ఆసక్తి చూపిందని ఆయన తెలియజేశారు.

*

మనోవ్యాకులత, కలవరపాటు, అధైర్యం, నిరాశ వంటి గుణాలు వున్నవారు ఎక్కువవేపు నిద్రపోతారని, నిద్రలో వాళ్ళను రకరకాల కలలు పీడిస్తాయని-యేల్ విశ్వ విద్యాలయానికి చెందిన జెరోమీ సింగర్, టఫ్ట్స్ విశ్వ విద్యాలయానికి చెందిన ఎర్నెస్ట్ హార్ట్‌మన్ - ఇటీవల ప్రకటించారు. తొమ్మిది గంటలు, అంతకు పైగా నిద్రపోయేవారు సాధారణంగా ఈ స్థితికి లోనైవుంటారని ఆ వైద్యశాస్త్రజ్ఞుల అభిప్రాయం. ఆరు గంటలు లేదా అంతకు తక్కువ సమయం నిద్రపోయేవారు-తెలివి తేటలతో, సామర్థ్యంతో తమ తమ బాధ్యతలు నిర్వర్తించేవారై వుంటారని వారు వివరించారు.

జూలై 'వనిత'లో ఇచ్చిన రేఖాచిత్రానికి వచ్చిన సంభాషణలలో-ఎన్నికైన సంభాషణ:



"ఏంరా! నా పోలికా రాక, అమ్మ పోలికా రాక, ఈ ఏనుగు పోలిక ఎక్కడినుంచి వచ్చిందిరా నీకు?"

"ఇంతకీ నాకు మీరు అమ్మా? నాన్నా? అది తేల్చండి ముందు"

పంపినవారు: సి. డి. రుక్మిణి 7-1-526 మూసాఖాన్ బజారు, బండిమెట్ట, సికింద్రాబాదు 500003

ప్రకటించిన ప్రకారం 'చక్కని బహుమతి'ని వారికి పంపించి వేశాము.

# రంజాన్

"దేవుళ్ళపేర్లతో రాళ్ళకు, రప్పలకు, చెట్లకు, పుట్లకు మ్రొక్కడం నిష్ప్రయోజనం; హాస్యాస్పదం. వాటికై పోట్లాడుకోవడం మరీ అవివేకం. సర్వలోకాలను సృష్టించి రక్షించే దేవుడు ఒకడే. అతడే అల్లా! అల్లానిర్దేశించిన ధర్మమార్గానికి లోబడి - అపనింద, దొంగతనం, పరస్త్రీగమనం లాంటి నేరాలకు, దుర్వ్యసనాలకు దూరంగా వుంటూ అల్లాను ప్రార్థించడమే ఆయన దయకు మానవులను పాత్రులుగా చేసే ఏకైక మార్గం"-అని విగ్రహారాధనను ఖండించి, ఏకేశ్వరోపాసన ప్రతిపాదించిన ప్రవక్త—మహమ్మదు! అజ్ఞానంతో ఒకరికొకరు శత్రుభావంతో పోట్లాడే అరబ్బుల మధ్య సమైక్యత, శాంతి సమకూర్చడానికి ప్రయత్నించిన పవిత్రమూర్తి—మహమ్మదు!

మహమ్మదు ప్రతిపాదించిన జీవనవిధానం (మతం) పేరు. ఇస్లాం మతం. ధర్మమార్గం అనుసరించుట—అన్న మాటకు అరబ్బీ పదమే-'ఇస్లాం'!

ఇస్లాం మత సంస్థాపనకు పూర్వం—మహమ్మదు 'హీరా' శిఖరం మీద ప్రార్థనలు జరుపుతున్నపుడు 'గాబ్రియేలు' అను 'దివ్యజీవి' ద్వారా ఆయనకు దివ్య సందేశం తెలిసొచ్చిందట! మహమ్మదును ప్రవక్తగా ఉండమని కూడా అల్లా ఆదేశం అందిందట. నాటి నుంచి ఆయన ప్రవక్తగా పరివర్తనం చెందాడు!

మహమ్మదు ద్వారా మానవాళికి అల్లా అందజేసిన ఆదేశాలను తమ పవిత్ర మత గ్రంథమైన 'ఖురాన్'గా మహమ్మదీయులు విశ్వసిస్తారు. అల్లా తన సందేశాన్ని మహమ్మదుకు అందించిన సమయం 'రంజాన్' మాసం! అంచేత ఈ నెలను ముస్లింలు పరమపవిత్రమైన కాలంగా పరిగణిస్తారు.

ముస్లింల కేలండర్ ప్రకారం మొదటి మాసం 'మొహరం'. రంజాన్ తొమ్మిదో నెల.

ఈ నెలను పవిత్రంగా భావించడంతోనే తమ పని అయిపోయిందని వారు అనుకోరు. మాస ఆద్యంతం నమాజులతో ఉపవాసాలతో గడపి అల్లా ఆదేశించిన ధర్మమార్గంలో పయనించడానికి ముస్లింలు శాయశక్తులా ప్రయత్నిస్తారు. కఠినమైన నియమావళి పాటిస్తూ ఉపవాసాన్ని ఒక వ్రతంగా ఆచరిస్తారు.

రంజాన్ నెల ఆరంభం నుంచే సూర్యోదయం తర్వాత, సూర్యాస్తమయానికి ముందు అన్న పానాదులు ముట్టుకోరు. అంటే-సూర్యోదయానికి ముందే ఆహారం తీసుకుంటారు. ఆ తర్వాత సాయంత్రం—సూర్యాస్తమయం అయిన తర్వాత నమాజు ముగించుకుని భోజనం చేస్తారు.

అయినా ఈ ఉపవాసం ప్రతివారూ వుండాలనే నిర్బంధం లేదు. పదిహేనేళ్ళకు లోబడిన అబ్బాయిలు, తొమ్మిదేళ్ళు నిండని అమ్మాయిలు, రోగస్తులు, బలహీనంగా ఉన్నవారు, గర్భిణీస్త్రీలు, బాలింతలు—ఉపవాసాలుండరు-వారి శరీర ఆరోగ్యదృష్ట్యా అది అంత మంచిదికాదు కనుక.

నెల మొత్తం కాకపోయినా ముఖ్యమైన రోజులలో పిల్లలు కూడా ఉపవాసాలుంటారు.

ఒక నెల కాలంపాటు కేవలం ఉపవాసాలు ఉండడమేకాదు — ఖురాను ప్రతిపాదించే ప్రవర్తనకు లోబడి — దానధర్మాలు చేస్తారు; క్రమం తప్పకుండా ఖురాన్‌ను పఠిస్తారు.

"దేవుడు, దివ్యజీవులు, గ్రంథాలు, ప్రవక్తలు, అంతిమదినం, పూర్వనియతి"—వీటిని నమ్మడమే 'ఇమాన్' (విశ్వాసం) వీటియందు 'ఇహ్సాన్' (భక్తి) కలవాడే ముమిన్. అతడే నిజమైన ముస్లిం—" అంటుంది ఖురాన్.

మనిషి తన్నుతాను అర్థం చేసుకోడానికే కాదు; ఆకటిచిచ్చుతో అలమటించే పేదసాదల ఆకలిమంటలు ఎలాంటివో కూడా చవిచూపుతాయి ఉపవాసాలు. భక్తిభావం పెంపొందించడంకోసమే ఈనోము నిర్దేశించబడిందని ఖురాన్ ఉద్ఘాటిస్తుంది. పాపకూపాలకు దూరంగా వుంటూ, సత్ప్రవర్తన ద్వారా అల్లా కరుణకు పాత్రుడిగా మనిషి తనను తయారు చేసుకోవడమే ఈ ఉపవాసాల పరమార్థం-అని మహమ్మదీయుల ప్రగాఢ విశ్వాసం!

నెలాఖరులో శుక్లపక్ష చంద్రుని చూచిన తర్వాత ఉపవాస విరమణ (Id-ul—Fitr) చేస్తారు. మసీదులలోనూ ఖాళీగావుండే మైదానాలలో గుమిగూడి 'నమాజు' చేస్తారు. బంధుమిత్రులను కలుసుకుని, ఒకరినొకరు కౌగిలించుకుని తమ సంతోషం పంచుకుంటారు.

పేదా, గొప్ప అన్న వ్యత్యాసం లేకుండా ప్రతివారూ తమ తమ శక్త్యానుసారం కొత్త దుస్తులు ధరిస్తారు. బంధుమిత్రులతో కలిసి పిండివంటలతో భోజనం చేసి ఆబాలగోపాలం ఆ రోజంతా ఆనందంగా గడుపుతారు.

రంజాన్ మహమ్మదీయులకు మనోల్లాసం కల్గించే ప్రధానమైన పండుగమాత్రమేకాదు; పండుగ రూపంలో ఒక నెలపాటు జరిగే ఆధ్యాత్మిక వ్యాయామ శిక్షణా సమయం కూడా! □

# చిట్టి కథలు



## పొరపాటు

లక్ష్మి ఒక ప్రయివేటు కంపెనీలో స్టెనోగా పని చేస్తోంది. జీతం తక్కువ. పని ఎక్కువ. రాత్రిళ్ళు కూడా 12 గంటలదాకా పని చేయిస్తారు. స్టాఫ్ ఎక్కువయితే అందరికీ ఎక్కువ జీతాలివ్వాలని, కొద్దిమందితోనే పనంతా చేయిస్తున్నాడు వాళ్ళ బాస్. ఆదివారాలు కూడా సెలవు లేదు. లేబర్ ఇన్‌స్పెక్టర్స్ ఎవరైనా చూస్తారేమోనని బయట గేటు తాళంవేసి, పని చేస్తుంటారు. అక్కడ పనిచేసే వారందరికి ప్రపంచంతో పని వుండదు. పోనీ ఇది మానేసి వెళ్ళిపోదామనుకున్నా, ఎక్కడా దరిదాపుల్లో ఉద్యోగాలు లేవు. మానేసి బైటికి వెళ్ళలేక, వుండి పని చేయలేక బాధలు పడుతున్నారు. అయినా, ఆశ వదులుకోలేక, ఎవరికి వారు పేపరులో 'వాంటెడ్ కాలమ్స్' చూసి అప్లయి చేస్తూనే వున్నారు.

ఒకరోజున లక్ష్మి అప్పుడే వచ్చి, ఏవో టైప్ చేస్తోంది దీక్షగా. ఇంతలో "మేనేజర్ గారు పిలుస్తున్నారమ్మా" అంటూ వచ్చి చెప్పాడు ప్యూన్.

'ఎందుకబ్బా' అనుకుంటూ, చేసే పనిని ఆపి, లేచి వెళ్ళింది లక్ష్మి.

"కూర్చోమ్మా" అన్నాడు మేనేజర్ నవ్వుతూ.

లక్ష్మి కూర్చున్నాక, "చూడమ్మా. నువ్వింకో ఉద్యోగానికి వెళ్ళిపోవాలనుకుంటున్నావా?" అన్నాడు నవ్వుతూనే.

"లే...లేదండి" అన్నది భయంగా.

"భయపడతావెందుకమ్మా. దేనికయినా అప్లయి చేసావా?" అన్నాడు.

"చేయలేదండి" అన్నది నీరసంగా–'తను అప్లయి చేసినట్లు ఎవరో చెప్పేశారు' అనుకుంది మనసులో.

"అలా అయితే ఇదేమిటి మరి" అంటూ, కవరు, కాగితాలు చూపించాడు.

దాన్ని చూడగానే నిశ్చేష్టురాలైంది. నోటంబడి మాట రాలేదు. ముచ్చెమటలు పోయసాగాయి.

"చూడమ్మా. మన కంపెనీకి ఒక క్లర్క్ కావాలంటూ పేపర్లో వేయించాము. ఆ విషయం ఎవరికీ తెలియదు. అడ్రస్ వివరాలు ఇవ్వకుండా పోస్ట్ బాక్స్ నెంబర్ అంటూ ఇచ్చాం. ఇక్కడ అనుభవం వుందంటూ, ఇక్కడికే పంపించావు...." అని ఆయన అంటుండగానే, లక్ష్మి జరిగిన 'పొరపాటు'కి చింతిస్తూ భయంతో పరుగులాంటి నడకతో తన సీట్లోకి వచ్చి పడింది ఆయాసపడుతూ.

—ఏడిద సూర్యకుమారి

## మ్యాచ్

కదలిపోతున్న బస్సును గబగబా ఎక్కేశాడు సుబ్బారావు. 'టికెట్' అంటూ ఎదురు వచ్చిన కండక్టరు చేతిలో చిల్లరపెట్టి టికెట్ తీసుకుంటూ తన 'మానస రాణి' కోసం బస్సంతా గాలించి లేడీస్ సీట్ల దగ్గరగా నిలబడ్డ ఆమెను చూచి ఎలాగో ఒకలాగ అందర్నీ తోసుకుంటూ వెళ్ళి ఆమె ప్రక్కగా నిలబడ్డాకగాని ఊపిరాడలేదు సుబ్బారావుకి. పాపం సుబ్బారావు! తన 'మానస రాణి'ని నలుగురికి పరిచయం చేసుకునే అదృష్టానికి నోచుకోలేదు. కారణం ఆమె అతనికే యిప్పటివరకు పరిచయం కాలేదు. ఆ అమ్మాయి పేరు సుభద్ర అని కనుక్కోవడానికి వారం రోజులకంటె ఎక్కువ సమయం పట్టలేదు. ఆ అమ్మాయి సుబ్బారావు మానస చోరిణి. అతని డ్రీమ్ గరల్. కాని సుబ్బారావుకి ఒక్కటే సందేహం. సుభద్ర తనకంటె కాస్త పొడుగేమోనని. అందుకే ఆ విషయం గురించి ఎక్కువ ఆలోచించడానికి సుబ్బారావు మనస్సు అంగీకరించదు. ఈరోజు గులాబీ పువ్వులా ఉంది సుభద్ర. 'గులాబీ రంగు చీర, దానికి నప్పే బ్లౌజ్, తలలో రోజ్, ఓహ్! ఎంత బాగుంది, మనసులోనే మురిసిపోయాడు. సుభద్రతో ఊహా ప్రపంచంలో విహరిస్తూ ఉన్న సుబ్బారావుకి ఎవరో తనను గమనిస్తూ వున్నట్లు అన్పించింది. తలెత్తి చూస్తే ఎదురుగా సీటులో కూర్చున్న ఒక ఆవిడ యితన్ని, సుభద్రను మార్చి, మార్చి చూస్తోంది. సుభద్ర వంకే రెప్పకొట్టకుండా చూస్తున్న ఆమెను నమిలి మింగేయాలనిపించింది సుబ్బారావుకు. ఇంతలో సుబ్బారావు బుర్రలో ఏదో తళుక్కున మెరిసింది. కోఠి బస్ స్టాప్‌లో దిగిపోతున్న ఆవిడ ఎక్కడ తనకు కన్పించకుండా పోతుందో అన్నట్లు ఆమె అడుగులో అడుగువేసి బస్సు దిగాడు. ఆవిడ నేరుగా చెరుకురసం బండివాడి దగ్గరకువెళ్ళి వాడితో ఏదో మాట్లాడుతూ ఉంది. "ప్లీజ్, ఒక్కక్షణం" అన్న సుబ్బారావు మాట విని అతనివైపు తిరిగింది.



"ఇంతకుముందు బస్సులో మీరు ఒక గులాబీ రంగు చీరె అమ్మాయిని తదేకంగా చూశారు, ఆ అమ్మాయి ప్రక్కనే నేనూ ఉన్నాను, చూశారు

గదూ?'' కంగారుగా ప్రశ్నించాడు.

ముందు అతని ధోరణి అర్ధంకాలేదు ఆవిడకు. తరవాత బస్సులో తాను చూసిన, అతడు వర్ణించిన దృశ్యం గుర్తుకు వచ్చి ''అవును చూశాను'' అని, 'అయితే ఏం' అన్నట్లుగా చూచింది.

''అపార్ధం చేసుకోకుండా మా మ్యాచ్ ఎలా ఉందో చెప్పండి, ఆ అమ్మాయి నాకంటె పొట్టి గానే ఉందా?'' తన మనసులో ఉన్న సందేహాన్ని వెల్లడి చేశాడు.

అతని కంగారు, ప్రశ్న, ప్రశ్న అడిగిన తీరు ఆవిడకు నవ్వు తెప్పించాయి. కాని తను నిజంగా యితగాడిని బస్సులో చూడలేదు. అందుకనే సీరియస్‌గా ''సారీ! నేను మిమ్మల్ని గమనించనేలేదు. ఆ అమ్మాయి చీర, బ్లౌజ్ చాలా చక్కగా మ్యాచ్ అయ్యాయి. ఆ మ్యాచింగ్ చూశానుగాని, మిమ్మల్ని చూడనేలేదండి'' అంటూ ఎదురుగా వచ్చిన ఇంకో బస్సు ఎక్కేసింది. సుబ్బారావు మొహం ఎలా మారుంటుందో మీరు ఊహించగలరు.

జె. రమాదేవి ఎమ్. కామ్

## బొమ్మ

అటూ ఇటూ చూస్తూ అడుగులేస్తోంది సిట్టి.

''తన ఈడు పిల్లలంతా రంగురంగుల కొత్త బట్టలు వేసుకుని తల నిండా పూలు పెట్టుకుని చక్కగా తిరుగుతున్నారు. అయ్య కొత్త గౌను కావాలని ఏడిచినా కుట్టించలేదు సరిగదా గట్టిగా రెండు మొట్టికాయలు తినిపించాడు. తను కూడా రంగుల పరికిణీ కట్టుకుని రెండు జడలు వేసుకుని అమ్మగారింట్లో పూసిన సామంతి పూలు పెట్టుకుంటే ఎంతో బాగుంటుంది. ఒక్కసారి అద్దంలో చూసుకుంటే బాగుండును అనుకుంది'' చింపిరి తల సిట్టి.

సిట్టి వయసు పది సంవత్సరాలు. అంచులు చిరిగి వెలిసిన పరికిణీ, మాసిపోయి భూమి



రంగులో కల్సిపోయి భుజాలు చిరిగిన జాకెట్టు, కొసకు పురికొస ముడిపెట్టిన చిన్న పిలక జడ, చేతిలో చిన్న సత్తుటిఫిను పెట్టె-ఇదీ దాని అవతారం. అందమైన చిట్టి పేరు కూడా అందవిహీనమైన దాని రూపానికి తగ్గట్టు సిట్టిగా మారిపోయింది.

సిట్టి తల్లి పాచి పనులు చేస్తూ ముగ్గురు పిల్లల్ని పోషిస్తోంది. తండ్రి సినిమా హాల్ దగ్గర ఐస్‌క్రీం అమ్మినా ఒకటో అరో పెళ్ళాం చేతిలో పెట్టి మిగిలింది తాగేస్తాడు. అది నోరులేని మనిషి కనుక తను సంపాదించే దాంతో గుట్టుగా బ్రతుకుతోంది. అప్పుడప్పుడు పండుగలు, పబ్బాలు వచ్చినప్పుడు సిట్టిని సాయంగా తీసుకుపోతుంది. అది తల్లి తోమిన గిన్నెలు కడిగి పెడుతుంది. చిన్న చీపురుతో దొడ్డంతా ఊడుస్తుంది. పనంతా ముగిశాక అన్నాలూ అప్పచ్చులూ టిఫిన్ పెట్లో సర్దుకుని చెరొకటీ పుచ్చుకుని ఇంటికి చేరతారు. ఆరోజు సంక్రాంతి పండుగ కావటంతో కమలమ్మగారు పెట్టిన అన్నంతో టిఫిను నిండిపోతే ఇంటి దగ్గర పెట్టి రమ్మని పంపింది తల్లి. అన్నం అంతా తాటాకు బుట్టలోపెట్టి మళ్ళీ ఖాళీ టిఫిన్ పెట్టె తీసుకుని రమణమ్మగారి ఇంటికి వెళ్ళింది సిట్టి.

ఆ రోజు రమణమ్మగారింట్లో పేరంటం. పిల్లలందరూ చేతుల్లో చిన్న చిన్న బొమ్మలు, చిలకలు, పళ్ళు పుచ్చుకుని వెడుతున్నారు. సిట్టి చేతిలో టిఫిను తల్లి దగ్గరపెట్టి తను కూడా వాకిలి దగ్గర నుంచుని పేరంటం చూస్తోంది. హాల్లో—బొమ్మలన్నీ అంతస్థులలోవచ్చి కూర్చున్నట్లు అమర్చారు రమణమ్మగారు. సిట్టి కళ్లు అకస్మాత్తుగా కింద అంతస్థులో ఉన్న రబ్బరుబొమ్మ మీద పడ్డాయి. బొమ్మ కళ్ళు నక్షత్రాల్లా మెరిసిపోతున్నాయి. గౌను అంతా బుట్టలాగా పూసలతో నిండి ఉంది. కదిలిస్తే స్ప్రింగ్ యాక్షన్‌వల్ల ముందుకీ వెనక్కీ ఊగుతోంది. సిట్టికి ఆ బొమ్మ బాగా నచ్చింది. ఒక్కసారి దాన్ని చేత్తో తాకితే.... అమ్మో అమ్మగారు చూస్తే ఇంకేమైనా ఉందా? అయినా దానికి ఇంకా బొమ్మను చూడాలనే ఉంది. అది తనకు ఇచ్చేస్తే? తన గుడిసెలో అట్లాంటి బొమ్మ ఉంటే! అప్పటికే రమణమ్మ రెండుసార్లు ''పోయి మీ అమ్మకు సాయం చెయ్యి ఎంతసేపట్లా నిల్చుంటావు'' అంటూ కేకలు వేసింది. అయినా కదలలేదు సిట్టి. క్రమంగా దాని మనసంతా బొమ్మే ఆక్రమించుకుంది. చిన్న అరటిపండు, గుప్పెడు శనగలు తెచ్చి చేతిలోపోసి ''ఇకపో'' అంది రమణమ్మ. ఎవరో పారేసిన కాగితంలో వాటిని కట్టి తల్లి దగ్గర ఉన్న టిఫెన్ పెట్లో దాచివచ్చింది సిట్టి. పేరంటానికి వచ్చినవాళ్ళంతా బైటకు వెళ్ళిపోతుంటే వారిని సాగనంపటానికి వెళ్ళింది రమణమ్మ. హాల్లో ఎవరూ లేరు. ఇంక ఆగలేని సిట్టి ఇదే అదనుగా గబుక్కున లోపలకు వెళ్ళి మెరిసే బొమ్మను తీసుకుని పరుగు ప్రారంభించింది. ఇంతలో రమణమ్మగారి అబ్బాయి అది చూసి సిట్టి వెంట పడ్డాడు. అప్పటికే సెంటర్ దాటిపోతోంది సిట్టి. అంతే.... వేగంగా వస్తున్న నాలుగోనెంబరు బస్సు కీచుమంటూ సిట్టి మీదుగా ముందుకు వెళ్ళి ఆగింది.

ఆకారం కనబడని సిట్టి చేతిలో బొమ్మ. అది మాత్రం శాశ్వతంగా బ్రతికిపోయింది.

—ఎమ్. కృష్ణకుమారి

## ఎదిరింటమ్మాయి

''ఏమండోయ్! బజ్జీలు చల్లారుతున్నాయి. త్వరగా రండి'' అప్పటికది నాలుగోసారి కేక వెయ్యటం. బయట వర్షం కురిసివెలిసింది. చలిగా ఉంది. వేడివేడిగా మిరపకాయబజ్జీలు చెయ్యమంటే చేస్తున్నాను. శ్రీవారికి చాలా ఇష్టం. ఎప్పుడూ స్టౌ దగ్గర కూర్చుని తినేవారు. ఈ రోజు ఇన్ని సార్లు పిలిచినా రారేమిటి చెప్మా అనుకుంటూ వరండాలోకి తొంగిచూశాను. చేతులు కట్టుకుని స్టయిల్‌గా నిలబడి దేనినో తదేకంగా చూస్తున్నారు వీధికేసి. ఏమిటా అని నేనూ ఆయన చూస్తున్న వేపు దృష్టి సారించి చూశాను కదా! గతుక్కుమన్నాను. శ్రీవారంతగా గుడ్లు మిటకరించి గుటకలుమ్రింగుతూ చూస్తున్నది ఎదురింటి పెళ్ళి కాని 18 ఏళ్ళ అమ్మాయిని! ఆ అమ్మాయి వాళ్ళ చిన్న తమ్ముడికి కాగితపు పడవలు చేసిస్తోంది. వాడు ఇంటిముందున్న నీళ్ళలో వదుల్తున్నాడు. వాడు చేసే అల్లరిపనులు చూస్తూ ఆ అమ్మాయి విరగబడి నవ్వుతోంది. మధ్య మధ్య మావారికేసి చూస్తోంది. నాకు వళ్ళు మండిపోయింది. ''ఇదా



ఇంత సేపు చూస్తున్నారు'' అన్నాను. ఉలిక్కిపడి వెనుతిరిగారు. తత్తరపాటుగా ''ఆ అబ్బాయి చూడు జానీ ఎంత ముద్దుగా అల్లరి చేస్తున్నాడో'' అన్నారు. ''ఆ అబ్బాయి ముద్దుగా అల్లరి చేస్తున్నాడు. ఆ అమ్మాయి ముద్దుగా నవ్వుతోంది. మీరు ఇంకా ముద్దుగా పోజులు కొడుతూ చూస్తున్నారుకానీ పదండి! బజ్జీలు చల్లారుతున్నాయి'' అంటూ లాక్కెళ్ళాను. ఆ రోజు నుంచి రోజూ మావారు ఆ అమ్మాయికి పోజులివ్వటం ఎక్కువైంది. ఇంటి దగ్గరున్నంతసేపూ వరండాలో తచ్చాడుతూ ఎదురింటికేసి చూడటమే పని. రోజూ ఈయనకు కాపలా కాస్తున్నాను. దాదాపు పెళ్ళయి 5 ఏళ్ళయిందా? ఒక బిడ్డ తండ్రయ్యారా! ఇప్పుడివేం పాడుబుద్ధులు ఈయనకు—అనుకుంటూంటే వళ్ళు మండుతోంది నాకు. శ్రావణమాసం వచ్చింది. మంగళ, శుక్రవారాలు పేరంటానికి అందర్నీ పిలిచాను. ఆ అమ్మాయినీ పిలిచాను. పిలిచానని మావారికీ చెప్పాను. ఆ అమ్మాయి వచ్చేవేళ న్నుంచి వెళ్ళేదాకా తన గదిలో ఏదో పనున్నట్టు తచ్చాడారు. పువ్వులు తెమ్మంటే బజారు కెళ్ళారు మావారు. పేరంటానికి వచ్చినవాళ్ళలో ఎవరో ఏవో జోకు వేశారు. అందరూ నవ్వారు. ఆ అమ్మాయీ నవ్వింది. ఆ అమ్మాయి నవ్వటం మావారు ఇంట్లోకి వస్తూ చూశారు. అందరూ వెళ్ళాక ''ఆ అమ్మాయి ఎందుకలా నవ్వుతోంది'' అన్నారు. ''నిజం చెప్పనా?'' అన్నాను. ''చెప్పు'' అన్నారు ఆత్రంగా. ''మీక్కోపం వస్తే!'' అన్నా. ''పర్వాలేదు చెప్పు'' అన్నారు. ''మీవారు ఏం బాగాలేరు. జెండాబొంగులా ఇంత పొడవున్నారు. మీరు అందంగా ఉన్నారు. మీవారిలో ఏం చూసి చేసుకున్నారు బాబూ'' అంది. అంటే నేనన్నాను గదా? ''మావారు పెళ్ళికాక ముందు మా ఎదురింట్లో వుండేవారు. అప్పుడు చాలా అందంగా ఉండేవారు. మేం ప్రేమించి మరీ పెళ్ళి చేసుకున్నాం'' అన్నాను. అందుకు ఆ అమ్మాయి హేళనగా నవ్విందండీ! మీరు అందంగా లేరంటే నాకు కోపం వచ్చి అలా అబద్ధం చెప్పాను అన్నాను—కాస్త బాధపడుతున్నట్లు, కాస్త కోపం వచ్చినట్లు ఇంకాస్త మావారి మీద ప్రేమ చూపిస్తున్నట్లు నటించి. ''ఆ! ఏడిసిందిలే. పెద్ద అందగత్తె! రేపట్నుంచి ఆ పిల్లను పిలవకు'' అన్నారు. నేను బుద్ధిగా తలూపాను.

ఆ రోజు నుంచి మావారు ఎదురింటివేపు కన్నెత్తికానీ, తల ఎత్తికానీ చూడలేదు పాపం!

—ఎ. జయలక్ష్మిరాజు

## ''మా బాబు''

పక్క గదిలోంచి గట్టిగా నవ్వులూ, మాటలూ వినబడడంతో లేచి కూర్చున్నాను.



''బాబుకు పేరేం పెట్టారు?'' శ్రీమతి అడుగుతోంది ఎవరినో!

''రఘువీర్! పేరు మోడర్న్‌గా వుండాలని నేను, రాముడి పేరు రావాలని మావారూ అనుకున్నాం. చివరికి ఈ పేరయితే చక్కగా సరిపోతుందని యిలా పెట్టాం.''

''బాగుంది!'' పక్క గదిలో శ్రీమతి పైకి అన్నమాటలే స్వగతంలో నేనూ అనుకున్నా.

"చాలా అల్లరి, ఎవరూ ఆపలేం అనుకోండి!" ఆ గొంతులో బాబు చాలా ప్రత్యేకమయిన అల్లరి చేస్తాడన్న భావం వుంది.

''అవునా బాబూ? అమ్మను బాగా అల్లరి చేస్తావా?'' మా శ్రీమతి ముద్దుగా అడుగుతోంది.

''వాడినేం అడుగుతారు గానీ, నన్నడగండి చెప్తాను. పొద్దున్నే లేచి నా వెనకాలే వంటింట్లోకి వస్తాడు. పాలు తాగగానే యిక షికార్లు మొదలు పెట్తాడు. ప్రక్కింటి వాళ్ళిచ్చే కాఫీ, ఎదురింటి వాళ్ళింట్లో టిఫిన్లు అన్నీ ముగించిగానీ మళ్ళీ రాడు. వాళ్ళకు వీడిని చూస్తే భలే ముద్దు! ఒక్కరోజు వీడు వెళ్ళకపోయినా, కాఫీ తీసుకుని మా యింటికే వచ్చేస్తారు!'' ఆవిడ గొంతులో ఆదో రకమయిన గర్వం.

''అబ్బా! ఘనుడేగానీ మీవాడు, అలా అతిగా వేళాపాళా లేకుండా కాఫీలు తాగితే మొద్దుబుర్రగా మారే ప్రమాదం వుందండీ!'' శ్రీమతి అనలేక పోయిన మాటలు నేనిక్కడ స్వగతంలో అనుకున్నాను.

''అసలు ఈ రోజేం చేశాడో తెల్సా? వాళ్ళ నాన్న రాత్రి 'యాష్‌ట్రే'లో సిగరెట్ పీకలు పారేయటం చూసాడు. పొద్దున లేవగానే యాష్‌ట్రే కింద బోర్లించి, ఒక ముక్క తీసుకుని స్టైల్‌గా నోట్లో పెట్టుకుని, తాగుతున్నట్లు కళ్ళు మూసుకుని గట్టిగా గాలి లోపలికి పీలుస్తున్నాడు'' ఆవిడ ఆనందంగా కొడుకు చేసిన ఘనకార్యం వివరిస్తుంటే, నేను 'నా కొడుకయితేనా, రెండు అంటిద్దును' అనుకున్నాను.

''ముగ్గురు ఆడపిల్లల తర్వాత లేక లేక పుట్టాడని మా యింట్లో అందరికీ తగని ముద్దు. వాణ్ణి ఒక్కమాట అనరు. ఏది కావాలంటే అది మరుక్షణం తయారుగా కొనిపెడ్తారు.''

'అందుకే యింత వెధవై వుంటాడు' అనుకున్నాను నేను.

యింతలో పక్క గదిలో శ్రుతి, లయబద్ధంగా ఏడుపు మొదలయింది.

'మంచి నీళ్ళు!' అని. మా శ్రీమతి వంట గదిలోకి వెళ్ళినట్టుంది.

'ఆదివారం సాయంత్రం శ్రీమతితో హాయిగా గడుపుదామంటే యీ ఏడుపులు, గోల ఏమిట్రా దేవుడా?' అనుకుంటూ కూర్చున్నాను. మంచి నీళ్ళు తాగటం అవగానే, యింకేదో గుర్తు వచ్చినట్టుంది 'యింటికి!' అని మళ్ళీ లంకించుకున్నాడు.

''అరెరే! ఏడవకూడదు బాబూ, మా బాబు బంగారట! అటు చూడు, ఆ బొమ్మ ఎలా తల వూపుతూందో!'' ఆవిడ షోకేస్‌లో బొమ్మలు చూపించగానే ఠక్కున ఏడుపు ఆపి, 'నాక్కావాలి' అన్నాడు ఏడుపు గొంతుతోనే! యిప్పుడు మా శ్రీమతి మొహం ఎలా వుందో చూసి రావాలనిపించింది. ఆ బొమ్మ కోరి కోరి తను కొనుక్కుంది బెంగుళూరులో. అది అపురూపంగా చూసుకుంటోంది.

''వద్దు నాన్నా. అది విరిగిపోతుంది. యీ బొమ్మ తీసుకో!'' మా ఆవిడ ఏదో నచ్చచెప్పటానికి ప్రయత్నిస్తోంది. ''ఛీ, క్కాక్కి! నాకేం వద్దు యీ పిచ్చి!'' విసిరికొట్టాడు దాన్ని. మా శ్రీమతి అక్కడే వుంటే ఆ బొమ్మ ఎక్కడ

[పోటీగా పెట్టిన 'చిట్టి కథలు' శీర్షికను ఇంతటితో ముగిస్తున్నాము. అయితే—'చిట్టి కథ' పేరిట, ఎవరైనా చిన్న చిన్న కథలు పంపితే (రెండు పేజీలకు (రావు) మించకుండా) వీలున్నప్పుడల్లా ప్రచురిస్తూ వుండగలము.
—వ. సం]

యివ్వాల్సి వస్తుందోనని "కాఫీ తెస్తా" అంటూ లోపలికి వెళ్ళింది.

ఆవిడ వాణ్ణి సముదాయించలేక నానా అవస్థా పడుతోంది. నేను లేచి బెడ్‌రూం కిటికీలోంచి, గదిలోకి చూశాను. వాడు నేలమీద కూలబడి, జుట్టు పీక్కుని, ఆవిడ చీర పట్టుకుని లాగుతూ, ఘోరంగా ఏడుస్తున్నాడు. నాకు ఒక్క ఉదుటున ఆ బొమ్మ వాడికి యిచ్చి 'యిక పో!' అని గట్టిగా అరవాలనిపించింది.

'వెధవ పిల్లాడు' అని వెయ్యోసారి తిట్టుకున్నాను. విసుగ్గా మళ్ళీ మంచం మీద కూలబడ్డాను. ఆవిడ యింకేదో బొమ్మతీసి, "యిది చూడు నాన్నా! ఎంత బాగుందో యిది, దీన్తో ఆడుకో!" అంటోంది. వాడు దాన్ని తీసుకుని, "యిక యింటికి పోదాం! "అని మొదలు పెట్టాడు. మా ఆవిడ కాఫీలు తెచ్చినట్టుంది. "కాఫీ తీసుకో బాబూ?" అంది. "వద్దూ.... తాగద్దు! యింటికి వెళ్ళిపోదాం" అని మళ్ళీ ఏడుపు పెద్దది చేశాడు. ఇంకో అయిదు నిముషాల తర్వాత "ఏమిటో, వీడికి మరీ అల్లరి ఎక్కువయిపోయింది, మళ్ళీ యింకోరోజు వస్తాంలే సుమతీ! ఈ బొమ్మ అప్పుడు తెచ్చిస్తానులే!" అనడం, తలుపు చప్పుడూ వినబడ్డాయి. ఆవిడ అటు వెళ్ళగానే, "అబ్బ! ఎవరా రావణాసురుడు!" అంటూ హాల్లోకి వొచ్చాను. మా ఆవిడ మొహం చిరాగ్గా వుంది. "ఛి ఛీ! పాడు పిల్లాడు! బొమ్మలన్నీ విసిరికొట్టాడు. కాఫీ అంతా పారబోసాడు. యింత డిసిప్లిన్ లేకుండా ఎలా పెంచుతారో! వాడేదో ప్రత్యేకంగా తెలివిగా అల్లరి చేస్తున్నాడని మురిసిపోయి చెప్తోంది. రేపా వెధవ పెద్దవాడయ్యాక కూడా యిలాగే ఆఘోరిస్తాడు మొండిగా! అందరూ పిల్లలు అల్లరి చేస్తారుగానీ, యిట్లాంటి గొడవ ఎక్కడా చూడలేదు." అంది. "అమ్మలందరూ అంతే! వాళ్ళ పిల్లలే అల్లరి కనిపెట్టినట్లు మురిసిపోతారు. రేపు నీకూ ఒకడు పుత్తే నువ్వూ అంతే!" అన్నాను నవ్వుతూ.

"చాల్లెండి" అంది యింకా ఆ పిల్లాడి మీద చిరాకుపోని శ్రీమతి.

—వసుధ

# వైద్య సలహాలు



-డాక్టర్

శ్రీమతి కె.

నా వయసు ఇరవై ఎనిమిది సంవత్సరాలు. గత మూడు వారాలుగా యోగాసనాలు అభ్యసిస్తున్నాను. ఇప్పుడు నాకు పదిహేను రోజుల లోపలే ఋతుస్రావం అయిపోయింది. యోగాసనాలు చేయడమే దీనికి కారణం – అంటున్నారు నా స్నేహితులు. ఇది నిజమేనా? అలాంటప్పుడు యోగాసనాలు వేయడం ఆపి వేయమంటారా? దయచేసి చెప్పగలరు.

ఋతుస్రావం తొందరగా జరగడానికి ఎన్నో కారణాలు ఉంటాయి. ఉన్నట్టుండి యోగాసనాలు వేయడం వల్ల ప్రారంభదశలో శరీరంలోని కొన్ని కండరాలు సడలడం కద్దు. కానీ అదే ఋతుస్రావం తొందరగా జరగడానికి కారణం అని మాత్రం చెప్పలేము. అదే విధంగా రెండు మూడు నెలలు అభ్యసిస్తే సరిపోతుంది. రెండు మూడు నెలలలో సరికాకుండా వుంటే డాక్టర్ దగ్గరకు వెళ్ళి వైద్య పరిశోధన చేయించుకోవడం ఎంతైనా అవసరం.

కుమారి కె.

మూత్ర విసర్జన చేసినప్పుడు నేను చాలా బలహీనంగా అయిపోతాను. చాలా అలసటగా వుంటుంది. మూత్ర పరిశోధన చేశాము. అందులో ఎలాంటి లోపమూ లేదని చెప్పారు. పొత్తికడుపు అతుక్కుపోయి శరీరం మరీ బక్కచిక్కిపోయివున్నాను. ఎన్ని టానిక్కులు తీసుకున్నా ఎలాంటి ప్రయోజనమూ కనబడడం లేదు. అప్పుడప్పుడు తెలుపు కూడా పడుతూ వుంటుంది. నా వయసు ఇరవై మూడు సంవత్సరాలు. దీనికేమైనా ఒక సలహా ఇవ్వండి డాక్టర్.

కొందరికి పసిప్రాయంలో కూడా చెక్కెరవ్యాధి వస్తూ వుంటుంది. కాని మూత్ర పరిశోధనవల్ల మీకు ఆ వ్యాధి లేదని తేలిపోయింది. కాబట్టి విచారించవలసిన అవసరం లేదు. అధికంగా నీళ్ళు త్రాగడం కొంచెం తగ్గించండి. రోజుకు రెండు మూడుసార్లు పాలు తీసుకోండి. తెలుపుపడడానికి శారీరక బలహీనత కారణం కావచ్చు.

శ్రీమతి ఎస్.

చామనఛాయతో వున్న నా కళ్ళ చుట్టూ గుండ్రంగా నల్లటి చారల్లాంటి ముడతలు యేర్పడ్డాయి. వీటి వల్ల, ఇరవై నాలుగేళ్ళు కూడా నిండని నేను చాలా వయసైనదానిలా కనబడతాను. దీనికి కారణం ఏమిటి? దీనిని పోగొట్టడానికి ఏదైనా మార్గం దయచేసి చెప్పగలరా?

విశ్రాంతి, చాలినంత నిద్ర లేకపోతే కళ్ళచుట్టూ నల్లటి చారలు యేర్పడతాయి. రోజుకు తక్కువ పక్షం ఆరు గంటలసేపైనా బాగా విశ్రాంతి తీసుకోవాలి. రోజూ ఉదయం నిద్ర లేవగానే చల్లటి నీళ్ళతో కళ్ళను కడుక్కోవాలి. కొన్నాళ్ళు అలా చేసి చూడండి!

శ్రీమతి ఎమ్.

మా రెండో పాపాయికి పది నెలల ప్రాయంలో 'పోలియో' వచ్చింది. వెంటనే చికిత్స చేయించాము. ఇప్పుడు రెండేళ్ళు నిండాయి. మూడు చక్రాల తోపుడుబండిని వేగంగా నడుపుతుంది. మంచం మీదకు ఎక్కుతూ దిగుతూ వుంటుంది. కాని వేరొకరి సహాయం లేకుండా, లేచి నిలబడలేకుండా వుంది. ఇప్పుడు, ఆయుర్వేద చికిత్స చేయిస్తున్నాము. మా పాపాయికి సంపూర్ణ ఆరోగ్యం చేకూరే అవకాశం వుందంటారా?

చిన్న పిల్లలకు పోలియో వ్యాధి రాకుండా ముందు జాగ్రత్త తీసుకోవడం ఉత్తమం; అవసరం కూడా. అందువల్లనే పసిప్రాయంలోనే పోలియో వ్యాధి మంచి కాపాడడానికి ముందుగానే ఇంజక్షన్స్ వేస్తూ వుంటారు. ఒకసారి వ్యాధి వచ్చిందంటే దానిని పూర్తిగా గుణపరచడమనేది అంత సులభం కాదు. చికిత్సపొందిన తర్వాత, వైద్యశాస్త్రప్రకారం శిక్షణ పొంది – శరీర వ్యాయామం క్రమం తప్పకుండా చేయడం చాలా అవసరం. ఏ అవయవం ఆరోగ్యం చెడివుందో దానికని ఫిసియోతెరపీ చికిత్సపొంది, ప్రత్యేకంగా వ్యాయమ శిక్షణ క్రమం తప్పకుండా ఇవ్వాలి. ఆహార విషయంలో కూడా తగిన జాగ్రత్త తీసుకోవాలి. పాలు, పెరుగు తాజా కూరగాయలు మొదలైన వాటిని ఆహారంలో విరివిగా ఇస్తూ వుండాలి.

విశాఖపట్నం సౌత్ లయన్ లేడీస్ ఆక్సిలియరీ మహిళలు కిన్నెర ఆవరణలో ఇటీవల జరిపిన ప్రతిష్ఠాపనోత్సవంలో నూతన సంవత్సరానికి అధ్యక్షురాలుగా డా॥ పద్మినీ చెంగల్‌రాయ్, కార్యదర్శిగా శ్రీమతి వసుంధరారెడ్డి, కోశాధికారిగా శ్రీమతి సత్యవేదమ్మ మంగయ్య, తదితరులు పదవీ స్వీకారాలు చేశారు. పాస్టు గవర్నరు లయన్ ఒ. పి. గోయెంకా ప్రమాణ స్వీకారాలు చేయించారు.



# వార్తా వనిత

విశాఖపట్నం ఇన్నర్ వీల్ క్లబ్–వనితలు ఇటీవల తమ పదకొండవ ప్రతిష్ఠాపనోత్సవాన్ని 'హొటల్ అప్సర'లో వైభవంగా జరుపుకున్నారు. శ్రీమతి ప్రభాకృష్ణకుమార్ అధ్యక్షత వహించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం సాంఘిక కార్య విభాగం అధ్యాపకురాలు, ప్రముఖ సంఘ సేవికురాలు అయిన శ్రీమతి ఇ. భానుమతి ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. శ్రీమతి కమలా చిత్రా అధ్యక్షురాలుగా నూతన కార్యవర్గం పదవీ స్వీకారం చేశారు. ఈ సభలో గౌరవ అతిథిగా పాల్గొన్న ఇన్నర్‌వీల్ డిస్ట్రిక్ట్–315 అధ్యక్షురాలు శ్రీమతి ప్రమీలా రావు నూతన కార్యవర్గానికి అభినందనలు తెలిపారు.

—విలేకరి.



విశాఖపట్నం నార్త్ ఇన్నర్ వీల్ క్లబ్ సభ్యులు ఇటీవల వికలాంగుల పునరావాస కార్యక్రమాలలో విశిష్ట సేవ చేస్తున్న శ్రీమతి తల్లాప్రగడ సరస్వతీ దేవిని, ప్రఖ్యాత యోగాభ్యాస శిక్షకుడు–ఆమె తండ్రి అయిన శ్రీ సత్యనారాయణ మూర్తిని అభినందిస్తూ వాల్తేరు సీవ్యూ హొటల్లో సభ జరిపారు. సభకు అధ్యక్షత వహించిన శ్రీమతి గీతా గుప్తా వారిరువురికీ క్లబ్ తరపున మెమెంటోలను బహూకరించారు. సంయుక్త కార్యదర్శి శ్రీమతి అమృతా రెడ్డి వందన సమర్పణతో సభ ముగిసింది.

—విలేకరి.





విశాఖపట్నం లయన్ లేడీస్‌క్లబ్ రాంనగర్ లయన్స్ కమ్యూనిటీ హాలులో ఇటీవల జరిగిన ప్రతిష్ఠాపనోత్సవంలో నూతన సంవత్సరానికి అధ్యక్షురాలుగా శ్రీమతి గ్రంధి విజయలక్ష్మి మంగరాజు, కార్యదర్శిగా శ్రీమతి వైదేహి కృష్ణారావు, కోశాధికారిగా శ్రీమతి శారదా నరేంద్ర, తదితరులు పదవీస్వీకారం చేశారు. ఆ రోజు కార్యక్రమానికి పోలీసు డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ - జనరల్ శ్రీ సల్దానా ముఖ్య అతిథిగా విచ్చేశారు. పాస్టు డిస్ట్రిక్టు గవర్నరు లయన్ డి. వి. సుబ్బారావు నూతన కార్యవర్గం చేత ప్రమాణ స్వీకారాలు చేయించారు.



నేషనల్ బుక్ ట్రస్ట్, ఢిల్లీ ఆధ్వర్యాన "రాబోవు దశాబ్దిలో తెలుగు పుస్తక ప్రచురణ" అనే అంశంపై హైదరాబాదులో ఇటీవల ఒక గోష్ఠి జరిగింది. ఈ గోష్ఠిలో పాల్గొన్న కొందరు రచయిత్రులు–శ్రీమతి రామలక్ష్మి ఆరుద్ర, వాసిరెడ్డి సీతాదేవి, ఇల్లిందల సరస్వతీ దేవి, లక్ష్మి రమణ, హైమవతీ భీమన్న డా॥ నాయని కృష్ణకుమారి, మాలతీ చందూర్ మొదలైనవారు.



ఇటీవల మచిలీపట్నం ఇన్నర్‌వీల్ క్లబ్ 'లేడీస్ ఈవినింగ్' నిర్వహించారు. కృష్ణాజిల్లా కలెక్టర్ సతీమణి శ్రీమతి ఎ. ఇందిరారెడ్డి ముఖ్య అతిథిగా విచ్చేశారు. పై చిత్రంలో ముఖ్య అతిథి ప్రసంగాన్ని అవలోకిస్తున్న వారు–క్లబ్ అధ్యక్షురాలు శ్రీమతి టి. రాఘవ కుమారి, విజేతలకు బహుమతి ప్రదానం చేసిన శ్రీమతి ఎస్. సుందరి, కార్యదర్శిని శ్రీమతి అరుణా ప్రఫుల్ల కుమార్.

ఆంధ్ర విశ్వవిద్యాలయ స్వర్ణోత్సవాల సందర్భంగా విశాఖపట్నం విచ్చేసిన భారతదేశ ప్రథమ మహిళ,



శ్రీమతి నాగరత్నమ్మ సంజీవరెడ్డికి విశ్వవిద్యాలయ మహిళామండలులు జూలై ఎనిమిదవ తేదీన జరిపిన సంయుక్త మహాసభకు వైస్ – ఛాన్సలర్ సతీమణి శ్రీమతి రాజరాజేశ్వరీ అప్పారావు అధ్యక్షత వహించారు. విశ్వవిద్యాలయ మహిళామండలి కార్యకలాపాల నివేదికను శ్రీమతి సరళాశాస్త్రి చదివి వినిపించారు. శ్రీమతి నాగరత్నమ్మ మాట్లాడుతూ స్త్రీ గృహిణిగా తన విధ్యుక్త ధర్మాన్ని సక్రమంగా నిర్వహించుకోవాలని, తరువాతనే మిగతా కార్యకలాపాలలో పాల్గొనాలనీ చెప్పారు. శ్రీమతి ఆర్. విమలాదేవి వందనసమర్పణ చేశారు. —విలేకరి



ఇటీవల ఆంధ్ర విశ్వవిద్యాలయం స్వర్ణోత్సవాల సందర్భంగా స్త్రీల బాస్కెట్ బాల్ పోటీలు జరిగాయి. విశ్వవిద్యాలయ ఆవరణలో జరిగిన ఈ పోటీలలో మద్రాసు స్టెల్లా మేరిస్ కళాశాల జట్టు హైదరాబాదు జట్టును ఓడించి ఛాంపియన్‌షిప్ కైవసం చేసుకుంది. మాచిపీడు, గుంటూరు జట్టులు కూడా ఈ పోటీలో పాల్గొన్నాయి. ఆంధ్ర విశ్వవిద్యాలయం కులపతి శ్రీ యం. ఆర్. అప్పారావు బహుమతి ప్రదానం చేశాడు. —బా. చ.

విశాఖపట్నం రోటరీ డిస్ట్రిక్ట్–315 యువతీ విభాగం – "వనితా రోటరాక్ట్" తమ తృతీయ ప్రతిష్ఠాపనోత్సవాన్ని ఇటీవల మెసానిక్ లాడ్జిలో అతి వైభవంగా జరుపుకున్నారు. ఈ సభకు కుమారి కె. పారిజాత అధ్యక్షత వహించారు. కార్యదర్శి కుమారి కె. ఉషాదేవి గత సంవత్సరం కార్యక్రమాల నివేదిక సమర్పించారు. ముఖ్య అతిథిగా విశాఖ జిల్లా 'స్కౌట్స్ అండ్ గైడ్స్' కమిషనర్ శ్రీమతి జె. శకుంతలా నాయర్ పాల్గొన్నారు. ముఖ్య అతిథి ఉపన్యాసం అనంతరం నూతన కార్యవర్గ సభ్యులు పదవీ స్వీకారం చేశారు. కుమారి రూపశ్రీ దుర్గ తన లలిత సంగీత కచ్చేరితో ఆహూతులను రంజింపజేసింది.

—విలేకరి.




అనంతపురం జిల్లాలోని – బుక్కరాయ సముద్రం గ్రామంలో శ్రీ పద్మావతి మహిళా మండలి నూతన భవన ప్రారంభోత్సవం ఇటీవల వైభవంగా జరిగింది. ఆంధ్రప్రదేశ్ చేనేత శాఖామాత్యులు శ్రీ పి. వి. చౌదరి భవన ప్రారంభోత్సవం చేశారు. నీటి

వనరుల శాఖామాత్యులు శ్రీ సి. దాసు అధ్యక్షత వహించారు. అటుపిమ్మట సభ్యురాండ్రచే తయారు చేయబడిన వివిధ వస్తువుల ప్రదర్శన మండలి అధ్యక్షురాలు శ్రీమతి వై. కళావతమ్మ ఆధ్వర్యంలో జరిగింది. ఆ నాటి సభను అలంకరించిన వారిలో జిల్లా కలెక్టరు, శిశు సంక్షేమ అధికారిణి వున్నారు.

*

విశాఖపట్నం నార్త్ లయన్ లేడీస్ ఆక్సిలియరీ ఇటీవల మెసానిక్ లాడ్జిలో జరిగిన ప్రతిష్టాపనోత్సవంలో నూతన సంవత్సర అధ్యక్షురాలుగా శ్రీమతి ఆస్మా మెహదీ, కార్యదర్శిగా శ్రీమతి రేవతీశర్మ, కోశాధికారిగా శ్రీమతి తన్‌హాయ్ యూనస్, పదవీ స్వీకారాలు చేశారు.

*

ఇటీవల కిన్నెర ఆవరణలో జరిగిన వాల్తేరు లయన్ లేడీస్ ఆక్సిలియరీ ప్రతిష్టాపనోత్సవంలో నూతన సంవత్సర అధ్యక్షురాలుగా శ్రీమతి రత్నమాలారావు, కార్యదర్శిగా శ్రీమతి జ్యేష్ట బసవరాజు, కోశాధికారిగా శ్రీమతి హైమవతీ నాకరాజు, పదవీ స్వీకారాలు చేశారు.

—విలేకరి

## నిజం చెప్పినందుకు పిల్లల్ని చంపిన తల్లి!

అస్సాంలోని నౌమతి అనే గ్రామంలో తిలేశ్వర్, బిమోలీదత్తా అనే దంపతులు వున్నారు. తిలేశ్వర్ తన భార్యకి వందరూపాయలు యిచ్చి 'ఎద్దు కొనడానికని అట్టేపెట్టాను. కావలసినప్పుడు అడుగుతాను-నీ దగ్గర జాగ్రత్తగా దాచివుంచు' అన్నాడు. తీరా అతను అడిగేసరికి బిమోలి అతని చేతిలో ఇరవైరూపాయిలు పెట్టి 'మిగతాది ఖర్చయిపోయింది' అంది.

వాళ్ళిద్దరి మధ్య జరుగుతున్న వాగ్వివాదం కాస్తా వారి ఏడేళ్ళ కుమార్తె విన్నది. విన్నది విన్నట్టు ఊరుకోక "నాన్నా.... అమ్మ ఆ డబ్బు ఖర్చుపెట్టలేదు. పిన్నికి యిచ్చి పంపించింది" అందిట. దాంతో తిలేశ్వర్ భార్యను ఛడామడా తిట్టి, చెంపఛెళ్ళుమనిపించి కోపంతో వెళ్ళిపోయాడు.

ఆ అవమానం భరించలేని బిమోలి శివమెత్తినదానిలా ఊగిపోతూ కూతుర్ని దుడ్డుకర్రతో బాదింది. దాంతో-కూతురు ప్రాణం పోయిందని గ్రహించేసరికి ఆమె ఎదుట ఆ దృశ్యం చూస్తూ నిలుచున్న కుమారుడు కనబడ్డాడు. బిమోలి తన తప్పు ఎక్కడ బయటపడుతుందో అన్న భయంతో కొడుకుని కూడా గొంతు నొక్కి చంపి, ఇద్దర్నీ పక్కనే వున్న పాడుపడిన చెరువులో పారేసింది.

ఆ తరువాత ఏమీ ఎరగనిదానిలా తన తల్లిగారింటికి వెళ్ళి పిల్లలిద్దరూ కనిపించడం లేదని 'ఆందోళన'తో చెప్పింది.

పిల్లలకోసం వెదికితే చెరువులో వారి శవాలు తేలుతూ కనిపించాయి. చుట్టుపక్కలవారు—ఎవరో ఏదో చేసి వుంటారని అనుమానించారే కాని, ఎలాంటి సాక్ష్యం లభించలేదు.

నాలుగు రోజుల తరువాత తిలేశ్వర్ కర్మకాండకు సంబంధించిన కార్యక్రమం ఏర్పాటు చేశాడు. తెలిసిన నలుగురినీ పిలిచాడు. అంతవరకు తనలోనే అణచుకున్న మాతృశోకాన్ని యిక భరించలేకపోయింది బిమోలి. తను ఆవేశంలో చేసిన ఘోరకృత్యం నలుగురి ఎదుటా బయటపెట్టింది.

పాతిపెట్టిన శిశువుల శవాలు బయటకు తీసి వాటిని శవపరీక్షకు పంపారు పోలీసులు. తను నేరం చేసినట్లు ఒప్పుకున్న బిమోలి, జైలుకి పంపబడింది. 'ఆవేశం అనర్థానికి మూలం' అని అందుకే అన్నారు!

## వనిత మాటల కొలువు - 37

సరైన సమాధానం :

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 స | రి | 14 గ | | 2 గో | 15 దా | వ | 16 రి |
| గ | | 3 తి | 17 రు | గ | లి | | వ |
| 4 టు | 18 మా | | మా | | | 5 కో | ట |
| | 6 కు | 19 దు | ర | | | కి | |
| 20 ఆ | | 7 మ్ము | మి | | 8 స | లి | హా |
| 9 డు | తో | | | 10 ప | ర్వ | | |
| వా | | 21 స | | 11 ప్ర | ధా | 22 న | 23 ము |
| 12 రు | ప | తి | తి | | 13 ం | గ | న |

పై సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారు డెబ్బై నాలుగు మంది. వారు :

1. జి. జయశ్రీ, తిరుపతి 2. టి. హైమవతీదేవి, శివరామపురం 3. యం. శారదాదేవి, హైద్రాబాదు 4. పి. రమ, కడప 5. జి. శివకామేశ్వరి, బెంగళూరు 6. కె. ఇందిరాపట్నాయక్, సాలూరు 7. వి. జయలక్ష్మి, హైద్రాబాదు 8. వి. సీతామహాలక్ష్మి, చిలకలూరిపేట 9. జి. లక్ష్మి, హనుమకొండ 10. యం. రేఖ, హైద్రాబాదు 11. ఎస్. ఎస్. కాంతం, బెంగళూరు 12. పి. వేంకటమారుతాంబ, మచిలీపట్నం 13. యం. హైమవతి, గుంటూరు 14. యం. కల్యాణి, సారవకోట 15. కె. కుసుమకుమారి, చినగంజాం 16. జి. యస్. కరుణ, కనిగిరి 17. యన్. నిరుపమ, కరీంనగర్ 18. డి. రాధమ్మ, హొసూరు 19. కె. లీలాసాయి, హైద్రాబాద్ 20. ఎస్. అనూరాధ, కాకినాడ 21. జి. సరోజ, ప్రొద్దుటూరు 22. విజయ, ఒంగోలు 23. శ్రీకృష్ణ, బెంగళూరు 24. ఎ. లలితాంబ, కాకినాడ 25. ఏ. శారదాదేవి, విజయనగరం 26. బి. లక్ష్మి, మద్రాసు 27. జి. యస్. ప్రభ, వి. సావరం 28. పి. రామలక్ష్మి, పాల్వంచ 29. పి. లలితాదేవి, సిరిసిల్లా 30. ఎన్. అనూరాధ, జగదల్‌పూర్ 31. వాణిశ్రీ, గుంటూరు 32. జి. జయలక్ష్మి, తిరుపతి 33. కె. మాధవి, నాగార్జునసాగర్ 34. సి. శ్యామల, హైద్రాబాదు 35. కె. నిర్మలాదేవి, కోటనందూరు 36. జయలక్ష్మి కేతరాజు, నరసారావుపేట 37. టి. శివమణి, విశాఖపట్నం 38. ఎస్. వి. సుబ్బలక్ష్మి, ఒంగోలు 39. వి. మీనాక్షి, అనంతపురం 40. బి. పద్మ, కూరెళ్ళ 41. యం. కొండలక్ష్మి, ఆరవల్లి 42. జి. రజని, కరీంనగర్ 43. కె. కవిత, సైదాపూర్ 44. కె. మాధవి, కోటగిరి 45. ఇ. లక్ష్మీదేవి, ఓదెల 46. యమ్. ఇందిర, రుద్రూరు 47. కె. కామేశ్వరి, కోలార్ గోల్డ్‌ఫీల్డ్స్ 48. టి. బాలా త్రిపురసుందరి, కాకినాడ 49. యు. స్వరాజ్యలక్ష్మి, చీమకుర్తి 50. జి. విజయప్రసాద్, కల్లూరు 51. పి. పుష్పలత, హైద్రాబాదు 52. టి. కె. నర్మదాబాయి, హైద్రాబాదు 53. కె. పార్వతి, ప్రొద్దుటూరు 54. ఎస్. రూపవతి, కాశిబుగ్గ 55. ఆర్. సునీతా ప్రభాకర్‌రావు, నోముల 56. జె. రాజేశ్వరి. తిరుచ్చి 57. యం. అరుణ, పుల్లెంల 58. బి. సత్యవతి, కాకినాడ 59. పి. సుధ, కాకినాడ 60. యస్. సీతా శ్రీనివాస్, శ్రీకాకుళం 61. యస్. శ్రీదేవి, మచిలీపట్నం 62. ఆర్. పద్మావతి, విశాఖపట్నం 63. జి. లలిత, అంబాజీపేట 64. జి. శారదాకుమారి, అలంపూరు 65. పి. కృష్ణకుమారి, అనంతపురం 66. యు. సూర్యకుమారి, హైద్రాబాదు 67. టి. రాఘవమ్మ, దుర్గి 68. డి. జయమ్మ, నెల్లూరు 69. ఎ. తులసీలక్ష్మి, పార్వతీపురం 70. ఎ. భారతీదేవి, తెనాలి 71. పి. ఉదయశ్రీ, సికిందరాబాదు 72. టి. సుదర్శనమ్మ, నెల్లూరు 73. టి. మహాలక్ష్మి, పార్వతీపురం 74. వి. శ్రీదుర్గ, బాపట్ల.

బహుమతి మొత్తం రూ. 150 లను వీరికి సమానంగా పంచి అందజేస్తున్నాము.

Edited & Published by B. Viswanatha Reddi for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) & Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., Madras-600 026.





Ranipal®
whitener for cottons




Ranipal®-S
whitener for synthetics and blends